# పంచాయతీ రాజ్యం

[ప్రజారాజ్య వ్యవస్థ]





మూలం :

యస్. కె. డే

అనువాదం:

డి. రామలింగం

తొలిపలుకు :

డా॥ యం. చెన్నారెడ్డి

MSC యం. శేషాచలం అండ్ కంపెనీ
మద్రాసు : మచిలీపట్టణము : సికింద్రాబాదు

**Panchayati Rajyam**: *English original by S. K. Dey. Telugu Translation by* **D. Ramalingam.**

*Price: Ordinary Rs. 4/— Library Edition Rs. 5/—*

*First Edition: August 1963.*

ప్రథమముద్రణ : 1963

ముఖచిత్రం : బాపు

ముద్రణ :
కాంతిప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసఫ్ వీధి
మద్రాసు-1.

వెల :
సాదా ప్రతి రు. 4
మేలు ప్రతి రు. 5




ప్రతులకు:
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు : : సికిందరాబాదు

# ఇందులోని విషయాలు

## 4. దేశ విషయాలు



## 5. వైరుధ్యంలో విచిత్రం



# ద్వితీయభాగం

## సిద్ధాంతం

## 6. వనయాత్ర



## 7. పంచాయతీరాజ్యం



## 8. విశాల దృశ్యం

## ప్రకాశకుల విజ్ఞప్తి

గ్రామపంచాయతీవ్యవస్థ మిగుల ప్రాచీనమైనది. ప్రజాభిప్రాయమున కనుగుణంగా, సత్యం, న్యాయం ఆధారంగా పరిపాలనను వికేంద్రీకరించడమే ఈ వ్యవస్థ ముఖ్యలక్ష్యం. ఈ గ్రంథరచయిత శ్రీ యస్. కె. డే ఈ వ్యవస్థను మానవ జీవిత తత్వంగాకూడా స్వీకరించారు. మన దేశంలో ఇప్పుడు పంచాయతీ సిద్ధాంతమునకు ప్రాముఖ్యం కలిగింది. ప్రాచీన నవీనాదర్శాలను సమన్వయపరచి ఈ సిద్ధాంతాన్ని ఒక క్రొత్త ఆదర్శంతో ప్రతిపాదించడం జరిగింది. దీని దేశవ్యాప్తంగా ఆచరణలోకి తెచ్చే కృషిలో శ్రీ డే నేడు ప్రధానపాత్ర వహిస్తున్నారు.

గ్రామసభ మొదలు లోకసభ వరకు ఒక్కొక్క మెట్టుగా మన దేశంలో ప్రజాస్వామ్యం చక్కగా రూపొందినప్పుడు, అది, మనం లక్ష్యంగా పెట్టుకున్న సామ్యవాదపద్ధతి సమాజ స్థాపనకు దోహదం చేయగలదని శ్రీ డే విశ్వాసం. ప్రజలను పునాదిగా పెట్టుకోనట్టి ప్రజాస్వామ్యం ఎక్కువకాలం మన జాలదనీ, అది పేకలమేడవంటి దనీ ఆయననిశ్చితాభిప్రాయం.

జాతి అంటే ఒక పెద్ద కుటుంబ మనీ, కనుక తదనుగుణమైన ప్రవర్తనసూత్రాలు జాతికి వర్తింపుగానవలెననీ చెబుతూ ఈ పుస్తకంలో రచయిత స్వాతంత్ర్యానికి పూర్వం భారత దేశస్థితి గతులను ప్రస్తావించి, స్వాతంత్ర్యానంతరపరిస్థితులను విమర్శనాత్మకంగా పరిశీలించి దేశంలో ఏర్పడబొయ్యే నూతనవ్యవస్థను దిఙ్మాత్రంగా సూచించారు.

భారతదేశానికి వర్తించదగిన పంచాయతీ రాజ్యాన్ని గూర్చి రచయిత విశదీకరిస్తూ దేశపు ఎల్లలను కూడా అధిగమించి, ఐక్యరాజ్యసమితి ప్రసక్తి తెచ్చి దానిని 'ప్రపంచ పంచాయతీ' అని అభివర్ణించి, అది ప్రపంచసాధనసంపత్తులను సకలదేశాల ప్రజలకు లభింపజేసి మాతృదేవివలె వ్యవహరించ గలదన్న ఆకాంక్షను వెలిబుచ్చారు.

నేడు మన భారతదేశంలో పలురాష్ట్రాలలో ప్రజాస్వామ్యవికేంద్రీకరణవిధానం అమలుజరుగుతున్నది. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఈ పథకమును శ్రద్ధతో, ఉత్సాహంతో అమలుజరుపుతూవుంది. గ్రామపంచాయతీలు, బ్లాకుపంచాయతీసమితులు, జిల్లాపరిషత్తులు, రాష్ట్రశాసనసభ, పార్లమెంటు—ఈవిధంగా మన ప్రజాస్వామం అంచెలవారీగా వుండి, పరిపాలనాధికారాలు క్రమేణా వికేంద్రీకరింపబడుతున్నవి. ఈ పుస్తకము ప్రజాస్వామ్యవాదులకు, పంచాయతీ

రాజ్య సహకార సమాజకార్యకర్తలకు, సాధారణపాఠకులకు మన నూతన వ్యవస్థనుగూర్చి తెలుసుకొని సమగ్రదృక్పథం కలిగించుకోవడానికి తోడ్పడగలదని ఆశిస్తూ తెలుగుపాఠకులకు దీనిని సమర్పిస్తున్నాము. ఈ అవకాశమును మాకు లభింపజేసిన గ్రంథరచయిత శ్రీ యస్. కె. డేగారికి, అడిగిన వెంటనే 'తొలిపలుకు' వ్రాసియిచ్చి ఆదరించి ప్రోత్సహించిన రాష్ట్రపంచాయతీరాజ్యశాఖామాత్యులు శ్రీ యం. చెన్నారెడ్డిగారికి మా కృతజ్ఞతాభివందనములు తెలుపుతూ ఆంధ్రమహాజనులు మా యీ ప్రయత్నమును ప్రోత్సహించగలరని ఆశిస్తున్నాము.

---

గ్రంథకర్త

శ్రీ యస్. కె. డే

శ్రీ యస్. కె. డే ప్రస్తుతం తూర్పుపాకిస్తానులో వున్న సిల్హెట్‌జిల్లాలో 1906లో ఒక రైతుకుటుంబంలో జన్మించారు. అమెరికాలో చదివి పర్డ్యూవిశ్వవిద్యాలయంనుంచి బి. యస్. సి. డిగ్రీని, మిచిగాన్ విశ్వవిద్యాలయంనుంచి యం. యస్. సి. డిగ్రీని పుచ్చుకున్నారు. విద్యనుబట్టి, పొందిన శిక్షణనుబట్టి ఈయన ఎలెక్ట్రికల్ ఇంజనీరు. భారతదేశంలో ఎక్సరే, ఎలెక్ట్రోమెడికల్ సైన్సులకు సంబంధించిన వ్యాపారాన్ని నిర్వహిస్తూవున్న అమెరికన్‌జనరల్ ఎలెక్ట్రిక్‌కంపెనీ తాలూకు విభాగంలో పదహారేండ్లు ఉద్యోగం చేశారు.

1947 లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు శ్రీ యస్.కె.డే పైన పేర్కొన్న కంపెనీవారి ఇండియా, బర్మా, సింహళవిభాగాలకు మేనేజరుగా వున్నారు. 1947లోనే ఆ పదవిని వదలి కురుక్షేత్రంలో నిర్వాసుల పునరావాసానికై ప్రారంభింపబడ్డ ప్రయోగాత్మకకేంద్రంకృషిలో నిమగ్నులయ్యారు. ఆదర్శప్రాయమైన వ్యవసాయ-పారిశ్రామికనగరమని పేరుపడ్డ నిలోఖేరి నిర్మాణం గావించారు. 1952

ార్చిలో సామాజికాభివృద్ధి ప్రాజెక్టుల పాలకవ్యవస్థకు అడ్మిని టరుగా నియమితులయ్యారు. 1956 సెప్టెంబరునుంచి కొత్తగా ఏర్పాటైన భారతప్రభుత్వ సామాజికాభివృద్ధిశాఖ మంత్రిగా వున్నారు. 1959లో ఈ శాఖకు పంచాయతీరాజ్యం, సహకారము అను కొత్త శాఖలుకూడ చేర్చబడ్డవి.

దేశ ఆర్థికవిషయాలనుగూర్చి, ప్రణాళికలను గూర్చి, సామాజికాభివృద్ధి కార్యక్రమమునుగూర్చి శ్రీ డే ఆంగ్లంలో అనేకగ్రంథాలు రచించి మేధావి అని పేర్వడసినారు.



# తొలి పలుకు

డా॥ యం. చెన్నారెడ్డి

(ఆంధ్రప్రదేశ్ ప్రణాళికలు, పంచాయతీరాజ్యశాఖామాత్యులు)

పవిత్రమైన గంగానది, సమున్నతమైన హిమాలయ పర్వతశ్రేణులు గల భారతదేశం వైభవోన్నతమైన చరిత్ర గల దేశం. ఈ దేశ సంస్కృతి, దీని పూర్వవైభవము దేశదేశాల ప్రజల నాకర్షించినవి. దూర దేశాల పండితులు, వైజ్ఞానికులుకూడా ఈ దేశాన్ని దర్శించి తమ తమ విజ్ఞానభాండాగారములను సుసంపన్నం చేసుకున్నారు. భారతప్రాచీన ఆర్థిక వ్యవస్థకు పునాదులు గ్రామపంచాయతీలే. గ్రామపంచాయతీలే ఇచటి ప్రజాస్వామ్యానికి వెన్నెముకగా వుండేవి. ఇచటి పంచాయతీ వ్యవస్థ ఈ దేశప్రజలకు శాంతియుత జీవనమును, సుఖసంతోషాలను ప్రసాదించింది. కాలగమనంలో తటస్థించే ఒడుదుడుకుల నెదుర్కొని నిలిచింది. ఇటీవలి కాలంలో గాంధీజీ ఈ వ్యవస్థను ఆదర్శప్రాయమైనదిగా పరిగణించి, విదేశీపరిపాలనప్రభావంవల్ల భారతభూమి పోగొట్టుకున్న శాంతి ఆనందాలను తిరిగి తేవడానికి మనం ఈ వ్యవస్థను సాధనంగా స్వీకరించాలని దేశీయులకు ఉద్బోధించారు.

మన దేశసంపద అంతా గ్రామాలపై ఆధారపడివుందనీ, కనుక గ్రామాల అభ్యున్నతిని సాధించాలనీ చెప్పి, మహాత్మాజీ ఆ లక్ష్యసిద్ధికై కృషి చేశారు. మన దేశ ఆర్థికవ్యవస్థను సుదృఢంచేసి, దేశాన్ని సిరిసంప

జలతో తులదూగునట్లు చేయాలంటే ఇది ఒక్కటే మార్గమని మహాత్ముడు విశ్వసించాడు. గ్రామపరిపాలనకూ, గ్రామంలో న్యాయనిర్వహణకూ పంచాయతీలే ప్రధానసాధనాలు. ప్రజలకు వీటిపై విశ్వాసం వుంది. వారు పంచాయతీలు చేసే నిర్ణయాలను, అవి ఇచ్చే ఆదేశాలను శిరసావహిస్తారు. కనుకనే పూర్వకాలంలో ఈ దేశం శాంతిసౌభాగ్యాలతో విలసిల్లుతూ, నిజమైన రామరాజ్యం ఈ దేశంలోనే వుందని పరదేశాలవారు భావించ గలిగినంతటి మహోత్కృష్ట స్థితిలో వుంది.

స్వాతంత్ర్యానంతరం ఇట్టి మన పూర్వవ్యవస్థలను పునరుజ్జీవింపజేసి, దేశీయులకు శ్రేయస్సౌభాగ్యాలను ఒనగూర్చవలెనని లక్ష్యంగా పెట్టుకున్నాము. దేశంలో పంచాయతీరాజ్యమును స్థాపించి తద్వారా గ్రామసీమల పునర్నిర్మాణం చేస్తామని మనం ప్రతిజ్ఞ గైకొన్నాము. ఈ లక్ష్యంతోనే వాస్తవమైన ప్రజాస్వామ్యంపై ఆధారపడ్డ మూడు తంతెల పాలకవ్యవస్థను మనకై మనమే రూపొందించుకున్నాము. అన్నిటికన్న దిగువ వుండేది గ్రామపంచాయతీ. అంటే ఇది మన పునాది అన్న మాట. పంచాయతీ సభ్యులు నేరుగా వయోజనులచే ఎన్నుకోబడువారు. వారు ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడ్డ ప్రతినిధులు. ఇక సమితిస్థాయిపైన, జిల్లాస్థాయిపైన పరోక్షమైన ఎన్నిక పద్ధతిని ప్రవేశపెట్టాము. అక్కడ పంచాయతీల ప్రతినిధులు, సమితుల ప్రతినిధులు సమావేశమై నిర్ణయాలు చేస్తారు. ఈ పద్ధతికి మరింత విశాలదృక్పథం కలిగించే ఉద్దేశంతో జిల్లా స్థాయిలో వుండే జిల్లా పరిషత్తులో రాష్ట్రశాసన సభ్యులను, పార్లమెంటు సభ్యులనుకూడా చేర్చుకోవడం జరిగింది. ఈ పద్ధతివల్ల ప్రత్యక్ష ఎన్నికలకు గడగవలసిన అవసరం లేకుండానే పంచాయతీ వ్యవస్థకు వాస్తవమైన ప్రజాస్వామిక రూపం తీర్చిదిద్దగలిగాము.

పంచాయతీరాజ్య మనేది ఒక కొత్త ప్రయోగం. ఈ ప్రయోగం ద్వారా మనం మన దేశ భవిష్యత్తునూ, భవితవ్యాన్నీ రూపొందించుకొన

జూస్తున్నాము. ఈ వ్యవస్థ ముఖ్యలక్షణ మేమిటంటే—ప్రజల సమ్మతి, వారి సమాధానము. సిద్ధాంతాలనూ, అభిప్రాయాలనూ అవలోడనము చేసిన ఫలితంగా చక్కని సమ్మేళన రూపంలో ఈ పద్ధతి చివరకు మనకు లభ్య మైంది. గ్రామపంచాయతీలు, పంచాయతీసమితులు రాష్ట్రశాసన సభలవలె, పార్లమెంటువలె కేవలం చర్చలు జరిపే సంస్థలుమాత్రమే కావు. వీటికి కార్యనిర్వహణ బాధ్యతకూడా వుంది. తాము చేసిన నిర్ణయాలను అవి అమలుజరుపుతవి. వాటికి శాసనబద్ధమైన విధిబాధ్యత లున్నాయి. వాటిని అవి నిర్వహిస్తూ వుంటాయి. ఈ దృష్టితో చూచినప్పుడు దేశపరిపాలనలో పంచాయతీలు, సమితులు అత్యంత ముఖ్యపాత్రను నిర్వహించే స్థితికి వచ్చాయని అంగీకరించకతప్పదు. ఇలా నిర్వహిస్తూ ఈ సంస్థలు స్వయం పరిపాలన అనే విద్యను అభ్యసిస్తున్నాయి.

నిజానికి దేశాభివృద్ధి అంటే ప్రతివ్యక్తి, అతని కుటుంబము అభివృద్ధి చెందడ మన్నమాట. చివరకు కలిగే పర్యవసానం ఇదే. అందుచేత ఈ కొత్త ప్రయోగంలో వ్యక్తికీ, అతని-లేక ఆమె కుటుంబానికీ అవశ్యక మైన పథకాలను, ప్రణాళికలను పంచాయతీరాజ్యపురోగమనంతో మేళ వించడం దీని వైశిష్ట్యమని చెప్పాలి.

కనుక పంచాయతీరాజ్య మనేది ఒక సమగ్రవిధానం. సాకల్యమైన ఉద్యమం. ఇది అన్ని స్థానిక సమస్యలకూ, గ్రామసమస్యలకూ సంబం ధించినట్టిది. ప్రతిప్రాంతము, ప్రతివ్యక్తి దీని పర్యవేక్షణ క్రిందికి రావడం జరుగుతుంది. ఇది ఒక్కొక్క ప్రాంతపు నాయకులను కూడగట్టి, వారి ఉత్సాహానికి దోహదము గావించి, సాధన సంపత్తిని సమీకరించి, క్రమేపీ బాధ్యతలను స్వీకరిస్తూ పోయి ప్రజల ఆశయాలకూ, ఆదర్శాలకూ ఒక ఆకార మిస్తుంది. కాబట్టే ఈ ఉద్యమం వివిధపథకాలకు ఎప్పటికప్పుడు లభ్యం కాగల ద్రవ్యంపైన, ఇతర సాధనసంపత్తులపైన ఆధారపడి సాగి పోతూ ఆయా పరిమితులకు లోబడి వృద్ధిచెందుతూ వుంటుంది. ఇది

ప్రజలకూ, వారి నాయకులకూ బాధ్యతాభావం కలుగజేస్తుంది. అట్టి భావం ఈ దేశంలో ప్రజాస్వామ్యపు పునాదులను పటుతరం చేస్తుంది.

అయితే ప్రజాస్వామ్యమనేది ఏకముఖంగా, ఏకపక్షంగా నిర్వహింపబడేది కాదు. దిగువన వుండే ప్రజలు తమ కేవో అవీ ఇవీ కావాలని కోరుకున్నంతమాత్రాన సరిపుచ్చుకోగలిగేది కాదు. ప్రజలు తమ అవసరాలను వెలిబుచ్చవలసిందే. కాని దానితోపాటు సాధనసంపత్తి ఎంత పరిమితమైనదో, అర్థబలం ఎంతవరకు వుంటుందోకూడా తెలుసుకోగలగాలి. ఇది చాలా ముఖ్యం. ఇవి రెండూ వున్నాయంటే ప్రజాస్వామ్యానికి సమగ్రత్వం, పరిపూర్ణత్వం సిద్ధిస్తాయి.

మరి పేదరికం గల దేశంలో ఇది కష్టసాధ్యం. కనుకనే ఈ విషయంలో హెచ్చుకృషి జరగాలి. ఇందుకై ఈ వ్యవస్థలపై ప్రజలకు, వారి నాయకులకు ఎనలేని విశ్వాసం వుండాలి. అట్టి విశ్వాసం యేర్పడాలంటే ఈ సంస్థలు, వీటికి చెందిన వ్యక్తులు అనుమానాలకు తావివ్వకుండా ప్రవర్తించాలి. అంతేగాక ఈ సంస్థలలోకి వారు ప్రవేశించే పద్ధతులుకూడా ఒకరు వేలుపెట్టి చూపే అవకాశమివ్వకూడదు. ఒకరు వేలుపెట్టి చూపగల పద్ధతులను అవలంబించడానికి తగు కారణాలు, కవ్వింపులు వుండవచ్చుగాక. అయినా వాటన్నిటికీ అతీతంగా వ్యవహరించాలి. లేకపోతే ప్రజాస్వామ్య మనే వృక్షపు వేళ్ళు తెగిపోయి, వృక్షమే అంతమయ్యే పరిస్థితి వస్తుంది. తుదకు ఈ వ్యవస్థల లక్ష్యమే దెబ్బతింటుంది.

నేడు అన్ని రాజకీయ పక్షాలవారినీ, ప్రజాసేవకులనూ ఎదుర్కొంటున్న సమస్య ఇది. కనుక దీని ఆంతర్యాన్ని బోధపరచుకొని వ్యవహరించినట్లయితే మానవస్వభావంలో గల ప్రజాస్వామ్య కాంక్షను తీర్చడానికీ, ఈ మహోద్యమాన్ని దీనికి గల శక్తి ప్రభావాల సహితంగా పెంపొందింపజేయడానికీ వీలేర్పడుతుంది.

437

మనం ఈ విధంగా మన దేశ ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మాణం గావించే కృషిలో నిమగ్నులమై వుండగా ఉత్తరాన మన దేశసరిహద్దులపై దురాక్రమణపరుల దాడి జరిగింది. ఈ సంఘటన మనల్ని దిగ్భ్రాంతులను చేసింది. ఈవిపత్తును ఎదుర్కోవడానికై దేశం యావత్తూ ఏకమై నిలిచింది. శత్రువును రణరంగంలో నేగాక ఇటు వ్యవసాయ క్షేత్రాలలో, అటు పారిశ్రామిక కర్మాగారాలలోనూ ఎదుర్కొని పరాభూతము చేయసన్నద్ధమైంది. గ్రామస్వచ్ఛంద సేవాదళములు, రక్షణసేవా కోశములు ఏర్పాటుచేయబడ్డవి. వీటి ముఖ్యోద్దేశాలు మూడు—(1) అధికాహారోత్పత్తి,(2) ప్రజలను విద్యావంతులను చేయడం, (3) గ్రామరక్షణ. ఈనాడు మన దేశ ప్రజాస్వామ్యం అగ్నిపరీక్ష నెదుర్కొంటున్నది. ప్రజాస్వామ్యంపై మనకు గల విశ్వాసం అచంచలమైనదై తే, నిజమైనదై తే పూర్వాలోచనలో, ఎంతో శ్రద్ధతో మనం అమలు జరుపుకుంటున్న మన పంచాయతీరాజ్య వ్యవస్థ మన ఆశలను, ఆశయాలను, ఆదర్శాలను సఫలం గావించాలి. ఈ పుస్తకం పంచాయతీరాజ్యంతో సంబంధం గలవా రందరూ చదువదగినది.

హైదరాబాదు
13-3-63

యం. చెన్నారెడ్డి

# ప్రస్తావన

లాల్ జీవాలా బంగళా. గంగానదీతీరాన రంగు ఇటుకలతో నిర్మింపబడ్డ చక్కని చిన్న కుటీరం. వెనుకవైపు దట్టంగా పెరిగివున్న చెట్టు చేమలకు ఆవల హరిద్వారం ఆలయాలు. ఎదుట గంగానది వినీలజలాలు. ముందువైపు అడవి. ఏనుగులకు ఆటపట్టయిన సాంద్రారణ్యం. దూరాన హిమాలయపర్వతాలు; వాటిపైన నీలాకాశము - వింతగొలిపే ప్రకృతి దృశ్యం!

భారతదేశప్రజలకు కుంభమేళాకన్న పెద్ద ఉత్సవం మరొకటి లేదు. పూర్ణకుంభోత్సవం హరిద్వారంలో జరుగుతుంది. అంటే గంగానదిపుష్కర మన్నమాట. ఇది పన్నెండేండ్లకొకమారు జరుగుతూ వుంటుంది. భగీరథుడు గంగానదిని ఉన్నత పర్వతసీమలనుండి మైదాన భూములకు తీసుకువచ్చా డని పురాణగాథ వుంది. గంగానది మైదానభూములకు దిగివచ్చు ప్రదేశం దృశ్యం అత్యంతరమణీయ మైనది. ఇంతటి గంభీరదృశ్యం భారతదేశంలో మళ్ళీ మన కెక్కడా కనిపించదు. ఆ తల్లి తన జన్మస్థానంనుండి అలా దిగి వచ్చి సకలభరతవర్ష ప్రజలకు శాశ్వతంగా మాతృదేవియై చల్లని చూపు చూస్తూవుంది. గంగాజలము ఎంత స్వచ్ఛంగా వుంటుందని!అడుగున వున్న గులకరాళ్ళను లెక్కబెట్టవచ్చు. కాని ఆ స్వచ్ఛతలోనే యేదో నిగూఢత వుంది. ఏదో మార్మికత వుందన్నట్లు గోచరిస్తుంది. గంగాజలంవలె శరీరా నికీ, ఆత్మకూ ఉపశమనం కలిగించే జలము మరొకటి లేదు.

1947 ఆగస్టు 15—భారతదేశానికి స్వాతంత్ర్యంవచ్చినపవిత్రదినము. నేను శారీరకంగా, ఆధ్యాత్మికంగా ఏదో రుగ్మతతో చిక్కుకున్నాను. దీర్ఘంగా ఆత్మవిమర్శ చేసుకోవడానికి నాకు ఇంత కాలమూ అవకాశమే లభించలేదు. 1960 అక్టోబరు నెల చివరన హరిద్వారం చేరుకొని గంగ ఒడ్డుకు వెళ్ళాను. నాపై నాకే ఎందుకో కోపం! దేశంలోనూ, దేశం వెలుపలా పరిస్థితులు విషమఘట్టానికి చేరుకున్నాయి. జీవితం భారమై పోతూవుంది. దాని క్రింద పడి నలిగిపోతానేమోనని అనిపించింది. చుట్టూ వున్న హైన్యమును, దైన్యమును తప్పించుకొని ఎక్కడికైనా పారిపోతే బాగుండు ననుకున్నాను. "ప్రస్తుతానికిగాని, ఇకముందుకుగాని ప్రజలకు మేలు చేకూర్చే సేవ యేమైనా నేను చేశానా? లేకపోతే వున్న బరువులకు తోడు నేను కొంత జరువుగా తయారయ్యానా?"-మానసిక వేదనతో నాకు నేనే ఈ ప్రశ్నలు వేసుకున్నాను.

స్వచ్ఛమైన నదీజలాలనుండి నా అంతరంగమును కలతపెట్టుతూ వున్న ప్రశ్నలకు సమాధానాలు కనుగొనడానికై నేను గంగానదీతీరానికి వచ్చాను. నివురుగప్పిన నిప్పువలె వున్న నా మనోవేదనను తీర్చుకోవడానికి మూలిగాను. రోజులతరబడి ప్రాతఃకాలమునుండి సంధ్యవేళవరకూ ప్రవహించే నీటికేసి అదేపనిగా చూస్తూ కూర్చునేవాణ్ణి. రుగ్మత తొలగిపోయింది. క్రమేణా తేరుకొని ప్రశాంతచిత్తుడ నయ్యాను. గంగమ్మతల్లి నేర్పగల గుణపాఠాలను ఏరి మూటగట్టాలని ప్రయాసపడ్డాను. నా కోసమనే ఇదంతా ఒక గాథవలె వ్రాసుకుపొయ్యాను.

మొదటిభాగం ఆరంభక్రమము. ఇందులో భారతదేశము, ప్రపంచము గతమునుండి నేడు యేస్థితికి చేరుకున్నాయో వివరింపబడింది. రెండవ

భాగం సిద్ధాంతప్రతిపాదన. మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటినుండి మనకు కలిగిన అనుభవములదృష్ట్యా, మనం చేసిన ప్రయోగముల రీత్యా ఈ క్లిష్ట స్థితినుంచి బైటపడే మార్గం చూపింపబడింది. ఆరంభక్రమము, సిద్ధాంత ప్రతిపాదనము ఒకే అంశానికి చెందిన రెండు భాగాలు. గంగానది లోతుల నుండి ప్రత్యక్షమైన భావాలు, సంఘటనలు మున్నగువాని చిత్రవిచిత్రా కృతులను చెరిపే ప్రయత్న మేదీ నేను బుద్ధిపూర్వకంగా చేయలేదు. ఈ తీర్థయాత్రలో లభించిన ప్రసాదమును గుణదోషసహితంగా తోడియాత్రికు లకు వారివారి వంతును అందజేయడమే నే నీ పుటలలో చేసిన రచన. నా ఈ వ్యక్తీకరణ విధానంలో ఏవైనా లోపా లుంటే అందుకు క్షంతవ్యు డను. నా వ్యక్తిత్వం, నా ఈ రచనా విధానం గంగానదిచే ప్రభావిత మైనవి. తత్ఫలితమే ఈ రచన.

---

# 1. పంచాయతీ రాజ్యం

## రామరాజ్యంలో పంచాయతీలు

రామరాజ్యం! దశరథ మహారాజుకుమారుడు రాముడు-వన వాసం చేసిన రాముడు - మహావీరుడైన రాముడు-ప్రజా సేవకుడైన రాముడు - సత్యానికి అవతారం రాముడు - దేవ త్వానికి చిహ్నం రాముడు: రామరాజ్యం ఎప్పుడు వుండేదో మనకు తెలియదు. మనం చదువుకునే చరిత్రలలో దాని భోగట్టా యేమీ వుండదు. రామరాజ్యం భోగట్టా మనకు రామాయణంవల్లనే లభిస్తున్నది. రామాయణం మహా కావ్యము. ఎన్నో యేండ్లూ పూండ్లూ గడిచినప్పటికీ అది కాలగర్భంలో కలిసిపోక నేటికీ నిలిచివుంది. ఆ యేటి కా యేటికీ దాని మహత్వం భారతదేశహృదయంలో సుప్రతిష్ఠిత మవుతూవుంది. ఈమహాకావ్యానికి కులమత జాతి విభేదాలు లేవు.

భారతజాతీయ పర్వములలో దసరా ఒకటి. ఈ పండుగ వేడుకలలో హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు, సిక్కులు, పార్శీవారు అంతా పాల్గొంటారు. సనాతనులు, ఆధునికులు అనే భేదం లేకుండా అంతా దీని

వేడుకలు చూచి ఆనందిస్తారు. వర్షఋతువు ముగియగానే దసరా వస్తుంది. దసరాపండుగ రాముని పుట్టుకతో ఆరంభమై రావణుని వధ, చెరనుండి సీతాదేవి విముక్తితో అంతమవుతుంది. ధర్మం గెలిచింది; అధర్మం పరాజితమైంది. ధర్మం-అధర్మం, మంచి-చెడ్డ అనేవి సర్వసమర్థుడైన దేవుడు కలిగించినట్టివే. జీవితం పరస్పరవిరుద్ధ శక్తులకు క్రీడారంగము. అధర్మాన్ని ధర్మము, చెడుగును మంచి విడువకుండా జయిస్తూపోతేనే మానవుడు బ్రతికి బట్టకట్టగలుగుతాడు; ప్రపంచం మనగలుగుతుంది. చెడుగును ఒక్కదానినే రూపుమాపడం సాధ్యంగాని పని. మంచి, చెడ్డ అనేవి ఒకే నాణెమునకు బొమ్మ-బొరుసు వంటివి. ఒకటి వున్నప్పుడు రెండవదికూడా తప్పక వుంటుంది. రామాయణం మనకు బోధించే నీతి ఇదే.

ఇంతవరకూ రామాయణమును మించిన మహాకావ్యం వ్రాయబడలేదు. భారతదేశమునకు గల పురావైభవము, సంస్కృతి సంప్రదాయములు గొప్పవి. ఇంతకన్న సంపన్నమైన సంస్కృతి తమకు వారసత్వంగా లభించిందని యే జాతికూడా చెప్పకోవడం లేదు. మానవ జీవితం, భౌతికప్రపంచం అశాశ్వతమైనవి. పుట్టినవాడు గిట్టక తప్పదు అనేది జీవితం తాలూకు కఠోరసత్యాలలో ఒకటి. మహాకావ్యంకూడా ఒకప్పుడు పుట్టినదే. కవితలు, నాటకాలు రోజూ వ్రాయబడుతూ వుంటాయి. కాని మహాకావ్యరచన ఎప్పుడోగాని జరగదు. అయితే మహాకావ్యమును అన్ని కాలాలవారూ చదువుతారు. కనుక మహాకావ్యం అమరమై, నిత్యమై విలసిల్లవలెనంటే అది ఎన్నటికీ మార్పు లేనట్టి విశ్వసూత్రమునకు

అనుగుణంగా వుండాలి. అంటే,అది తాత్కాలికముగాక సర్వ కాలీనమై వుండాలి.రామాయణంలో ఈ లక్షణాలన్నీ వున్నవి. ఈ మహాకావ్యమందంతటా జగత్సత్యాలే ప్రతిపాదితమై వున్నాయి.కాలం ఎట్టి అంతము,అంతరాయము లేకుండా నిరంతర ప్రవాహంవలె సాగివస్తూ వున్నట్లు ఈ కావ్యం చదివితే మనకు అనుభూతి కలుగుతుంది. ఈ విశిష్టలక్షణమే మానవుని బుద్ధిని తన వశము గావించుకుంటూవుంది. ఈ లక్షణమే గంగా నదికి గల మహత్వమును రామాయణమునకుకూడా కలుగ జేసింది. గంగానది మన మనస్సులలోను, ఆత్మలలోను గల మాలిన్యమును పోగొట్టుతుంది. ఏ రోగమునకైనా ఉపశమనం కలుగజేసే అంజనము వంటిది గంగ. రామాయణమూ అంతే.

రామాయణకాలంలో భారతదేశ జనాభా ఎంతో మనకు తెలియదు. ఇరవయ్యో శతాబ్ది ప్రథమార్ధ భాగంలో భారతదేశ జనాభా దాదాపు రెట్టింపు అయిందన్న సంగతి మనకు తెలుసు. యుద్ధాలు, రోగాలు, జాడ్యాలు, శిశు మరణాలు వంటి అనర్థాలున్నప్పటికీ ఈ రెట్టింపు సంభవించింది. రాముడు ఇంచుమించు చారిత్రకకాలంలోనే రాజ్యమేలి వుంటాడు. అప్పుడూ ఈ పుణ్యనదులే వున్నవి. అప్పటి భారతదేశపు భూవిస్తీర్ణం ఇప్పటి అంతే వుండేది. కాకపోతే అడవులు, చెట్టుచేమలు ఇప్పటికంటె ఎక్కువగా వుండేవి. అయితే నేటి కాలంతో పోల్చితే ఆ కాలపు జనాభా చాలా తక్కువ అని చెప్పాలి. అప్పుడు మానవులకూ, పశువులకూ ఆహారం సమృద్ధిగా లభించేది. ఇండ్లు కట్టుకోవడానికి కలప, రాళ్ళు, గడ్డి విస్తారంగా లభ్య

మయ్యేవి. చెట్ల పట్ట, నార మనుష్యులకు వస్త్రములుగా ఉప యోగింపబడేవి. ఆ వస్త్రములు బాగానే వుండేవి. ఆకాలపు మానవులు సామాన్యాహారమునే తీసుకొని, స్వచ్ఛమూ శుభ్రమూ అయిన నీరు త్రాగి, చిన్న చిన్న కుటీరాలలో నివసిస్తూ తీరిక వేళలలో కీర్తనలు, పాటలు పాడుకుంటూ కాలక్షేపం చేసేవారు. జీవితం అంత నిరాడంబరంగా, నిసర్గ ముగా వుండేది. ప్రజల అవసరాలన్నీ స్థానికంగానే తీరుతూ వుండేవి. ఇతరులపై ఆధారపడివుండవలసిన అగత్య మూండేది కాదు. డబ్బు, దాన్ని సంపాదించడంకోసం మానవుడు పడే తాపత్రయాలను ప్రజ ఎరుగరు. విద్యనేర్చుకోవడానికి ఎవరూ ఏమీ ఖర్చుపెట్టేవారు కారు. పిన్నలు పెద్దలవద్ద పాటలు, పద్యాలు నేర్చుకునేవారు. ఆ పాటలలో విజ్ఞానమూ వుండేది; తత్వమూ వుండేది. ఋషులు తపోవనముల ప్రశాంత తలో ఆ పాటలను రచించేవారు. రాజులు, ప్రభువులు వారి కుమారులను విద్యాభ్యాసంకొరకూ, జీవితాన్ని గూర్చి తెలుసుకోవడానికీ ఋషులవద్దకు పంపేవారు.

కనుక రామరాజ్యంలో ఇండ్ల తలుపులకు గడియ లుండేవి కావని చెబితే ఎవరూ ఆశ్చర్యపడనక్కరలేదు. సువిశాలములైన గ్రామసీమలు దట్టమైన అడవులతో నిండి వుండేవి. వాటికి కావలసినంత ఆహారం వుండేది. మాంసం తినే జంతువులకుకూడా ఆహారం సమృద్ధిగా లభించేది. మానవు లకు వన్యమృగముల బెడద వుండేది కాదు. ఎవరైనా నిర్భ యంగా తిరుగగలిగేవారు. ఆహారం పుష్కలంగా లభించేది. కరువుకాటకాలు వస్తే రాజుగారి ధాన్యాగారం నుండి ప్రజ

లకు ధాన్య మిచ్చేవారు. ఎవరికైనా సహాయం చెయ్యాలంటే దానధర్మాల రూపంగా చేసేవారు కారు. కరువు వచ్చినప్పుడు రాజుగారే చొరవ తీసుకొని రహదార్లు, ఆలయములు, తటాకములు నిర్మింపజేసేవారు. అట్టి స్థితిలో తను ప్రాపంచిక సంపదను, ఆస్తిపాస్తులను పెంపొందించుకోవడానికి ఎవరైనా ఎందుకు తాపత్రయపడతారు? పైగా అలాంటి తాపత్రయం తెలివితక్కువ పనిగా భావింపబడేది. కాబట్టే ఒకరి ఆస్తిపై మరొకరికి చూపు వుండేది కాదు. ఇటువంటి సత్యకాలంలో ప్రజలకు తినడానికి తగినంత ఆహారం లభింపకపోతే, మానవ జీవితం నిరాడంబరంగా వుండకపోతే అంతకన్న దౌర్భాగ్యం వేరొకటి వుండదు!

రాముడు అయోధ్యకు రాజు. రాజే కాదు; ప్రజా సేవకుడు. రాజ్యం మొత్తానికీ రాముడు ఒకవంక రాజు, మరొక వంక ప్రజాసేవకుడైనట్లే ప్రతిగ్రామానికీ ఒక అధిపతి వుండేవాడు. అతడు ప్రజాసేవకుడుగా కూడా వ్యవహరించేవాడు. అతణ్ణి గ్రామముఖ్యుడు అనిగాని, లేదా సర్‌పంచ్ (ప్రెసిడెంటు) అనిగాని అనేవారు. పంచ్ (పంచాయతీ)లోని ఇతరసభ్యులు ఆయనకు సలహాదారులుగా వుండేవారు. గ్రామస్థులందరూ బహిరంగముగా సమావేశమై అందరి సమ్మతితో పంచాయతీ సభ్యులను అయిదుగురిని ఎన్నుకొనేవారు. ఈ విషయంలో దాదాపు అందరూ ఏకాభిప్రాయంతో వ్యవహరించేవారు. జీవితావసరాలు అందరికీ సులభంగా అందుబాటులో వుండేవి. వాటిని పొందే స్వేచ్ఛ ప్రతివారికీ వుండేది. 'ఆస్తి' అన్న మాటకు అర్థం వుండేది కాదు. ఆస్తికి ప్రాముఖ్యమే లేదు.

పైగా ఆస్తిని ఒక తగులాటకంగా, బాదరబందీగా భావించే వారు. ఎన్నిక ప్రచారమంటూ చేయవలసిన అవసరమే వుండేది కాదు. ఉత్తముడైనవానిని పెద్దగా భావించి అతనినే తమ నాయకుడుగా ఎన్నుకునేవారు. పంచాయతీసభ్యులైదుగురూ కలిసి సమావేశమైనప్పుడు అక్కడ పరమేశ్వరుడు వుంటాడని ప్రజలు భావించేవారు. దేశాధిపతి - అనగా రాజు, గ్రామాధిపతి-అనగా సర్‌పంచ్ ప్రజాభిమతము ననుసరించి వ్యవహరించేవారు. ప్రజల కోర్కెను తీర్చేవారు. ప్రజానీకము కోరినట్లయితే ఎంతటి త్యాగానికైనా సంసిద్ధులయ్యేవారు. రాజుకూ, సర్‌పంచ్‌కూ వ్యక్తిగతమైన రాజకీయా లేవీ వుండేవి కావు. అవసరాలు ఎక్కువగా వుండి లభ్యమయ్యే సామగ్రి తక్కువగా వున్నప్పుడే, ఏమీ లేకుండా వుండడానికి బదులు దొరికినంతమటుకే చాలు అన్న ధోరణిలో ప్రజ లున్నప్పుడే వ్యక్తిగత రాజకీయాలు దాపురిస్తాయి. కనుకనే రామరాజ్యంలోని పరిస్థితులు ఇలాంటి వైపరీత్యాలకు తావివ్వలేదు. సర్‌పంచ్ గ్రామపరిపాలకుడుగా, గ్రామసేవకుడుగా వుండేవాడు. 'అయ్యా, ఈ ముండ్ల కిరీటాన్ని తాము ధరించండి. దీనితో వచ్చే గౌరవమర్యాదలను తాము స్వీకరించండి' అని పదిమందీ ఆయనను పదేపదే కోరి ప్రోద్బలం చేయవలసిన స్థితి వుండేది. పోటీలేదు; కక్షలులేవు; స్పర్థలులేవు. పార్టీలు అంతకన్నా లేవు.

అయితే రామరాజ్యం భూతలస్వర్గం కాదు. నేడున్నట్లే ఆనాడూ జననమరణాలు, సుఖదుఃఖాలు వుండేవి. రోగాలు మాత్రం చాలా తక్కువగా వుండేవి. మనుష్యుల ఆయుర్దా

యము ఎక్కువగా వుండేది. వారినికూడా అంటురోగాలు బాధిస్తూవుండేవి తిండి - బట్ట, ఇల్లూ-వాకిలీ అన్నీ వుండేవి. ప్రజలలో వివేకము, ఇంగితము వుండేవి. కావలసినంత తీరిక, విరామము వుండేవి. ప్రజలు నిరాడంబరంగా జీవించేవారు. ఆ జీవితంలో ఆనందము వుండేది; సంతృప్తి వుండేది. ఇన్ని వున్నప్పటికీ- రాజ్యానికి వారసుడైన రాముడికి మరుసటిరోజుపట్టాభిషేకం జరుగుతుందనగా అతనిని వనవాసం చేయ పంపవలసిందని దశరథుని ముద్దులభార్య కోరింది! నేటి మన లోకంలో వలెనే అప్పటి చాకలి, అతని భార్యా జగడమాడుకొనేవారు; ఒకరిపై ఒకరికి అపనమ్మకాలు, అసూయ వుండేవి.

ఈ నాడు మన భారతదేశంలో ఈశాన్యసరిహద్దు ఏజెన్సీప్రాంతము వుంది. మధ్యప్రదేశ్, ఒరిస్సారాష్ట్రాలలో బస్తర్, కేంజహార్, కోరాపుట్, కలహాండీ వంటి ప్రదేశము లున్నవి. ఈ ప్రదేశాలు మనకు తెలిసిన నాగరికత సులభంగా చొరరాని విధంగా వున్నాయి. ఇటువంటి ప్రదేశాలు ఇతర రాష్ట్రాలలోకూడా వున్నవి. వీటి జనాభా చాలా తక్కువ. రామరాజ్యకాలంలో అయోధ్య ఎలా వుండేదో ఈ ప్రదేశాలనుబట్టి మనం ఊహించుకోవచ్చు. కొండజాతులవారుండే ఈప్రదేశాలలో చక్కగా నిర్వహింపబడుతూ వున్న పంచాయతీలు నేడున్నవి. ఈ ప్రదేశాలన్నింటిలో ఈశాన్య సరిహద్దు ఏజెన్సీప్రాంతము మరీ అటవీప్రదేశము. అచటి నేలలు సాగులేని కన్నెనేలలు. ఇచ్చటి పంచాయతీలు గ్రామ శాంతి భద్రతల వ్యవహారాన్నికూడా చూస్తూవుంటాయి. ప్రతి కుటుంబమునకు జీవనోపాధి, విద్య, ఆరోగ్యం, తదితర సదు

పాయాలనుకూడా కనిపెట్టివుంటాయి. ఏదైనా క్లిష్టమైన వ్యవహారం విచారణకు వచ్చినప్పుడు పంచాయతీసభ్యులు ఏక గ్రీవంగా నిర్ణయం చేయజాలకపోయినట్లయితే వారు గ్రామంలో అందరికన్న పెద్దదైన వృద్ధస్త్రీని మధ్యవర్తిత్వం నెరపి వ్యవహారాన్ని పరిష్కరించవలసిందని అభ్యర్థించేవారు. ఆమె చెప్పిన తీర్పే శాసనము. దానిని దేవుడుకూడా ఆక్షేపించగలిగేవాడు కాడు!

ఈశాన్యసరిహద్దు ఏజెన్సీ ప్రాంతంలో వ్యక్తిగతమైన ఆస్తి దాదాపు లేదనే చెప్పాలి. అచటి ప్రజలు సమష్టిగా జీవితావసరాలను సమకూర్చుకుంటారు. అత్యవసరవస్తువుల విషయంలోనేగాక, జీవితావసరాలన్నింటి విషయంలోకూడా వారు స్వయంసమృద్ధులైవుంటారు. భారతదేశంలోని గిరిజన ప్రాంతాలన్నీ ఇంచుమించు ఇట్లాగే వున్నవి. మరీ మారుమూలల వుండే గ్రామాలకూ, ఉన్నతమైన హిమాలయపర్వత శ్రేణులమధ్య వుండే గ్రామాలకూ, మైదానభూములకూ సంబంధమే వుండదు. ఇచ్చట మానవజీవితం నాగరికతకు సంబంధించిన ఆడంబరాలూ, పటాటోపాలూ లేక బహు సామాన్యంగా వుంటుంది. రామాయణంలో మనం చదివే ప్రాచీనరాజ్యస్థితిగతులు ఈ ఇరవయ్యోశతాబ్ది మధ్య కాలంలో సైతము వున్నాయి. అవి ఏవంటే—

1. తక్కువ జనాభా.

2. నేడు మన కనుభవమైన నాగరికతకు కొన్ని ప్రదేశాలు దూరమైవుండడం.

3. దైవభక్తి, దేవునిపై తిరుగు లేని విశ్వాసం.

4. ఆధునిక విద్యాసదుపాయాలు లేకపోవడం.

నేటికి మున్సిఫయేండ్ల క్రితం అస్సాం రాష్ట్రంలోని ఖాసీ కొండప్రాంతంలో గల షిల్లాంగుకు వెళ్ళే ప్రయాణీకులు తమ సామానులను బరువులుమోసే కూలీకి ఇచ్చి అతని పేరు, పేట, వూరు వివరాలు అడిగి తెలుసుకోకపోయినా పరవాలేక పొయ్యేది. ప్రయాణీకుడు అతని గమ్యస్థానం చేరుకోనేసరికి కూలీ అంతకు ముందే సామానుతో అక్కడికి చేరి ఆయన రాకకోసం ఎదురుచూస్తూ వుండేవాడు. కాని ఇప్పు డట్టిపరిస్థితి లేదు. ఖాసీ కూలీకి ఇప్పుడు ఆధునికవిద్యాసౌకర్యం లభించింది. అతనూ దర్జీవారు కుట్టిన దుస్తులు వేసుకుంటున్నాడు. అతనూ ద్రాక్షసారాయం రుచిమరిగాడు. తన అంతరాత్మను జోకొట్టి నిద్రబుచ్చే విద్య అతనూ నేర్చుకున్నాడు. షిల్లాంగుకూ, అస్సాములోని మైదానభూములకూ ఇప్పుడు మంచి ట్రంకు రోడ్డే గాక ఇతరత్రా రహదార్లు కూడా ఏర్పడ్డాయి. ఇప్పు డక్కడి మనుష్యుల చూపులలో ఆ అమాయకత్వము, ఆ విశుద్ధత కానరావు. ఒకప్పుడు మంచి ఆరోగ్యంతో వున్న మనుష్యులు ఇప్పుడు రోగగ్రస్తు లవుతున్నారు. సహజమైన చిరునవ్వుకు బదులు కళ్ళలో కపటము, కుత్సితము కనిపిస్తాయి. స్మృతికర్తల యుగం రావడంతో రామరాజ్యపు పంచాయతీలు సమన్వయపు నొప్పులతో తీసుకుంటున్నాయి.

పూర్వకాలపు పంచాయతీలు

నేను నాలుగేండ్ల పిల్లవాడుగా వున్నప్పుడు మా గ్రామానికి టీకాలు వేసేవారు మొట్టమొదటిసారిగా వచ్చారు. అంతకు

మునుపు 'మశూచినుంచి మమ్మల్ని కాపాడు తల్లీ'అని అమ్మ వారిని ప్రతిసంవత్సరం కొలిచేవాళ్లు. కాని టీకాలు వేసేవారు వచ్చి మశూచికీ, అమ్మవారి ఆగ్రహానికీ సంబంధంలేదని చెప్పే శారు. మశూచికి చింతామణివలె పనిచేసే దివ్యౌషధము నొకదానిని అమ్మవారు ఒక దొరగారికి ఇచ్చిందని కూడా చెప్పారు. ఒక రోజున గ్రామంలోని పిల్లల్నీ, పెద్దల్నీ ఒకచోట చేర్చారు. ఒకాయన పదునైన చిన్న కత్తితో మా ఎడమ చేతుల దండలను గోకాడు. అలా గోకిన చోట చీమువలె కన్పించే రసి వేసి రుద్దాడు. కొన్నాళ్ళ తరువాత మమ్మల్ని తనిఖీచేయడానికై జిల్లాకేంద్రంనుంచి ఒక దొరగారు వచ్చారు. అప్పటికి మా చేతులు టీకాలు వేసినచోట పొంగి పుండ్ల య్యాయి. ఆ నొప్పికి మేము యేడ్చాము. మా గ్రామానికి సర్‌పంచ్ మా నాన్నగారే. ఆయన గ్రామస్థులందరినీ వచ్చి వరుసగా నిల్చోమన్నారు. దొరగారు పట్నంనుంచి సైకిలుపై వచ్చి మమ్మల్నందరినీ చూచారు.నాజీవితంలో నేను సైకిలును చూడడం అదే మొదటిసారి. టీకాలవల్ల నా చెయ్యి ఎంతో నొప్పిగా వున్నా ఆ సైకిలు నాకు ప్రపంచంలో తొమ్మిదవ అద్భుత మనిపించింది.

ఆ తరువాత ఐదవ జార్జి చక్రవర్తిపట్టాభిషేకమహో త్సవం సందర్భంగా మా గ్రామంలో ఏర్పాటుచేయబడిన విందు నా కిప్పటికీ జ్ఞాపకముంది. దానికికూడా మా నాన్న గారే నిర్వాహకులు. అప్పుడు నాకు ఆరేండ్లు. భోజనానికి కూర్చున్నవారికి పాయసం, పూరీలు వడ్డించిన దృశ్యం నా కిప్పటికీ కళ్ళముందు ప్రత్యక్షమవుతూవుంటుంది. ఏమిటో,

ఆ వేడుకలో, ఆ ఉత్సాహంలో 'మరొక మారు వడ్డించం' డన్నాను. ఆ మాట విని మా నాన్న దిగాలుపడి నాకేసి చూచాడు. ఇది జరిగి ఇప్పటికి యాభై యేండ్లు గడచినా ఆయన ఆనాడు నన్ను పట్టి చూచిన వైనం నాకిప్పటికీ బాగా జ్ఞాపకముంది. సర్‌పంచ్ కొడుకునైన నేను మొహం వాచివున్న వాడికిమల్లే 'రెండవమారు వడ్డించం' డనిఅడగడం-అందులోనూ పదిమందిలో అడగడం ఆయనకు ఆశ్చర్యమూ, నామోషీ కలిగించాయి.

ఆ పిమ్మట మా గ్రామంలో పొరుగువారి యింట్లో జరిగిన దొంగతనంకూడా నాకు జ్ఞాపకముంది. ఆ యింటి యజమానిని మేము 'మామయ్యా' అని పిలిచేవాళ్ళం. దొంగలు ఇంట్లో వున్న విలువైన వస్తువుల నన్నిటినీ ఎత్తుకుపొయ్యారు. అది చలికాలం. ఉదయంవేళ ఠాణానుంచి హెడ్డుకానిస్టేబులు ఇద్దరు పోలీసులను వెంటబెట్టుకొని అక్కడికి వచ్చాడు. దొంగలు పడ్డ యింటి యజమాని వాఙ్మూలాన్ని కాపీయింగు పెన్సిలుతో వ్రాసుకుంటున్నాడు. పాపం, ఆ యిల్లుగలాయనను హెడ్‌కానిస్టేబులూ, పోలీసులూ తిట్టిన తిట్లు నా చెవులలో ఇప్పటికీ మార్మ్రోగుతున్నాయి. ఒక వంక వారి తిట్లూ, దురుసుమాటలూ వింటూనే మరొకవంక పైపూత సహితంగా కాపీయింగ్ పెన్సిలునూ, ఒకేసారి అనేక కాపీలు తీస్తూ ఇంద్ర జాలం చేస్తూవున్న కార్బన్‌కాగితమునూ ఆశ్చర్యంగా చూస్తు న్నాను. పోలీసులు తన అన్నపట్ల అంత దురుసుగా ప్రవర్తి స్తున్నా ఆయన తమ్ముడు వారి విందు భోజనానికై గొర్రెను కోసి కూర వండుతున్నాడు. మా నాన్నగారు సర్‌పంచ్

అనడంచేత ఆయన పోలీసులవద్ద కూర్చొని వారికి వివరాలు తెలియ జెప్పుతున్నాడు.

ఆ రోజులలోనే ఒకమారు సబ్ డివిజనల్ ఆఫీసర్ మా గ్రామానికి వచ్చాడు. ఆయన ఇంగ్లీషువాడు. ఆయనకు ఘనంగా స్వాగతమివ్వడానికై మా నాన్న గ్రామస్థులందరినీ రప్పించి పెద్ద సభ ఏర్పాటుచేశాడు. మా యింట్లో అప్పుడు ఒక్కటే కుర్చీ వుండేది. బల్ల లేదు. గ్రామపాఠశాలలో వున్న మేజాబల్లను ఎరువు తెచ్చాము. దానిపై పరచడానికి నల్లని మఖ్మల్ గుడ్డను, గాజుజారీని కొన్నాము. యస్. డి. ఓ. గారు మాతో భోజనానికి కూర్చుంటారట. ఆయన కేమేమి కావాలో! ఏర్పాట్లు ఎలా వుండాలో! అంతా ఒకటే హడావిడి. దగ్గరి బస్తీ నుంచి రొట్టెలుకూడా తెప్పించారు. మా నాన్న సెకండ్‌హాండ్ షాపుకెళ్ళి ఒక నల్లకోటు కొనుక్కొని అది వేసుకున్నాడు. యస్. డి. ఓ. దొరగారు చాలా ఉల్లాసంగా కనిపించాడు. కాని ఆయన మేము పెట్టిన ఆహారపదార్థా లేవీ తినలేదు. తన ఆహారాన్ని తన వెంటే తెప్పించుకున్నాడు. అయితే మా నాన్నగారికి ఒక్క ఇంగ్లీషు ముక్క రాకపోయినప్పటికీ ఆయనను చాలా గౌరవంగా చూచాడు. గ్రామస్థులు తమ సర్‌పంచ్ దొరగారితో కలిసి అంత స్వేచ్ఛగా తిరగడం, దొరగారు ఆయన్ని అంత మర్యాద చేయడం చూచి ఉప్పొంగిపోయి తమ కది గర్వ కారణంగా భావించారు. దర్బారు ముగిసింది. మా నాన్నగారూ, గ్రామంలోని యావన్మంది జనులూ దొరగారిని వూరి పొలిమేరలవరకూ సగౌరవంగా సాగనంపివచ్చారు.

మన అసహాయోద్యమం తొలిరోజులలో నేను చూసిన ఒక దృశ్యం నా కిప్పటికీ జ్ఞప్తికి వస్తున్నది. అది 1916-18 సంవత్సరముల మధ్య జరిగిన సంగతి. గ్రామంలో ఎవరూ విదేశీవస్త్ర బహిష్కరణోద్యమంలో పాల్గొనకుండా, ఎవరూ చట్టము నతిక్రమించి ఉప్పు తయారుచేయకుండా చూడవల సిందనీ, అందుకు తగు కట్టుదిట్టాలు చేయవలసిందనీ మా నాన్నగారికి పైనుంచి ఆజ్ఞ వచ్చింది. కాని ఈ ఉత్తర్వులను మొట్టమొదట ధిక్కరించినవాడిని నేను! పాఠశాలకు వెళ్ళడం మానేశాను. దేశీయవస్త్రములు ధరించాను. ఇంగ్లీషు వారి ఉప్పును (ఆ రోజులలో నేను ఉప్పుకు ఆ పేరు పెట్టాను) వాడడం మానివేశాను. సర్‌పంచ్ కుమారుడనై యుండి ఇంగ్లీషు ప్రభువులపై అలా తిరుగుబాటు చేయడం చూచి మా మామయ్య నావాళ్ళు చితకగొట్టాడు. కాని మా నాన్న మాత్రం నన్ను కొంత అర్థంచేసుకున్నాడు. అయితే నే నిలా చేస్తున్నందుకు తా నేమి చేయాలో తోచక ఉపేక్ష వహించాడు. నేను మా గ్రామంలోని యువకులందరినీ కూడగట్టుకొని అసహాయోద్యమంలో, శాసనోల్లంఘనంలో పాల్గొనవలసిందని వారిని ప్రబోధిస్తూవచ్చాను. సర్‌పంచ్ పదవికి రాజీనామా ఇవ్వవలసిందిగా మా నాన్నను కోరాను. కాని మా నాన్న అలా చేయక, సర్కారువారు గ్రామంలో మాపై యేదైనా చర్య తీసుకున్నట్లయితే తమ పదవికి రాజీనామా ఇస్తానని మాటయిచ్చారు. ఎలాగో 1918 ఉద్యమం గడిచింది. మాపై ఎవరూ చేయివెయ్యలేదు. మా నాన్న సర్‌పంచ్ పదవిలోనే వున్నాడు.

సర్‌పంచ్ గ్రామానికి ముఖ్య ప్రతినిధి. ఇటు గ్రామస్థులకూ, అటు పరిపాలకులైన బ్రిటిషు ప్రభుత్వం వారికీ మధ్య ఆయన సంధానకర్త. గ్రామ శాంతిభద్రతలను ఆయన గ్రామ చౌకీదారు (తలారి) ద్వారా పరిరక్షిస్తూ వుంటాడు. ఒకవేళ పరిస్థితి ఆయన తాహతుకు మించిపోయి ఆయన దానిని అదుపులో పెట్టజాలని పక్షంలో పోలీసు ఠాణాకు సంగతి సందర్భాలు తెలియపరిచేవాడు. గ్రామానికి వచ్చే దొరలకు, అధికార్లకు దర్బార్లు ఏర్పాటుచేయడం, ప్రభుత్వానికి సంబంధించిన ఇతర ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పాటుచేయడం మున్నగు పనులకు ఆయన గ్రామప్రజలను సమీకరించేవాడు. జిల్లా కేంద్రపట్టణం అప్పుడే కొత్తగా యేర్పడింది. న్యాయస్థానాలు ఇంకా సరిగా పనిచేయనారంభించలేదు. ప్లీడర్లు ముగ్గురు మాత్రమే వుండేవారు. నాలుగు మోటారుకార్లు వుండేవి. ఒకటి ఆ వూరు జమీందారుగారిది. రెండవది బ్రిటిషు సివిల్ సర్జనుది. మూడవది సెషన్సు జడ్జీగారిది. నాల్గవది కలెక్టరు గారిది. ఈ నలుగురు పెద్దల కార్లూ వేగంగా పోతూవుంటే చిన్నపిల్లలమైన మేము వాటివెంటబడి చాలాదూరం పరుగెత్తేవాళ్ళం.

పదేండ్లపాటు వేరొకచోట ఉన్నతరువాత నేను మళ్ళీ ఆ బస్తీకి వెళ్ళాను. వెళ్ళిచూస్తే నిజంగా అల్లావుద్దీన్ ఇంద్రజాలం యేమైనా జరిగిందా అనిపించింది. ముగ్గురు ప్లీడర్లకు బదులు మూడువందలమంది ప్లీడర్లు వున్నారు! న్యాయస్థానాల సంఖ్యకూడా పెరిగింది. మోటారుకార్లు ఎన్నో వున్నాయి. వెనుకటి గుర్రపుబండ్లు కనిపించవు. వాటి వాడకం అపురూప

మైంది. మా వూళ్ళో మోతుబరి ఆసాములు చాలామంది పట్టణంలో కాపరాలు పెట్టారు. అసలు పట్టణం చుట్టుపట్ల వుండే పల్లెల కాపరస్థులు చాలామంది పట్టణానికి తరలి వెళ్ళారు. దొరలకు, ఇంకా గొప్ప గొప్పవారికి దర్బార్లు ఏర్పాటు చేయడాని కలవాటుపడిపోయిన దర్బారీ పంచాయతీలు మరొక రకం పంచాయతీలుగా మారాయి. గ్రామప్రజలలో తగాదాలు పెరిగాయి. శాసనమును త్రోసిరాజని తమ ఇష్టప్రకారం నడవవచ్చుననీ, ఒకవేళ ఏదైనా నెత్తిమీదికి వస్తే తను తరఫున వాదించి పని చేయడానికీ, పట్టణంలో వున్న ప్లీడర్లలో సమర్థుడైనవాని నొకడిని పెట్టుకుంటే తంటా తొలగిపోతుందనీ వక్రస్వభావం గల వ్యక్తులు తెలుసుకున్నారు. అవసరమైతే డబ్బిచ్చి కూట సాక్షులను కూడా తయారు చేసుకునేవాళ్ళు. అలా కూట సాక్ష్యం చెప్పడమే తన వృత్తిగా పెట్టుకున్న కొందరు వ్యక్తులు వుండనే వున్నారు. ఒక కేసులో మా నాన్నగారిని కోర్టుకు లాగారు. నిజానికి ఆ కేసుకు బలమేమీ లేదని నాకు తెలుసు. కాని కల్పించి అబద్ధాలు చెప్పే సాక్షులు తయారయ్యారు. న్యాయస్థానంవారు మా నాన్నకు జరిమానా విధించారు. ఏదో విధంగా మా నాన్నపై దెబ్బతీయడమే ప్రతికక్షుల ఉద్దేశం. అందులో వారు సఫలీకృతు లయ్యేసరికి వారి ముఖాలలో ఎక్కడలేని సంతోషం కనిపించింది. ఎదుటి మనిషిని నొప్పించి చంకలు ఎగరవేసే ఘనులు వారు!

మా గ్రామంలో సుమారు అరవై కుటుంబాలు

వుంటాయి. మొదటినుంచీ గ్రామమంతా ఉమ్మడి కుటుంబము వలె వుంటూవుండేది. గ్రామంలో ఒక్క కుటుంబంవారు మాత్రమే మాకు బంధువులు. తక్కినవారెవరూ మాకు బంధువులుకారు. కాని ప్రతికుటుంబము, చివరకు చాకలి, మంగలి, కుమ్మరి, కాలినాలి, మాల మాదిగ అంతా మాకు మా బంధువులనలెనే అనిపించేవారు. ఏ కులంవారైనా సరే, తాతా అనో, బాబాయి అనో, మామా అనో పిలుచుకునే వాళ్ళం. ఇటువంటి గ్రామకుటుంబం నా కళ్ళముందే విచ్ఛిన్నమైపోయింది. ఒక కుటుంబం మరో కుటుంబంతో దెబ్బలాడుకోవడం మొదలైంది. ఇట్లా గ్రామంలో ఎన్నో తెగలేర్పడ్డాయి. ఒక తెగవారికీ మరొక తెగవారికీ స్పర్థలూ, కలహాలూ పెరిగాయి, ఒక కుటుంబంలోనే పెద్దలపట్ల పిన్నలకుండే గౌరవం క్రమేణా అంతరించిపోయింది. ఒకప్పుడు గ్రామంలో మా నాన్నగారి మాటకు తిరుగులేదు. ఆయన నాయకత్వాన్ని ఎవరూ కాదనలేదు. ఇప్పుడు ఆ పెద్దరికం ఆయనకు లేకుండాపోయింది. బహుశా ఆయన కూడా గ్రామంలో ఏదో ఒక పక్షాన్ని బలపరిచేవాడో యేమో! ఈ విధంగా పరిస్థితి మరీ చెడిపోయింది.

గ్రామంలో ఇలా కక్షలు, ముఠాలు, వైషమ్యాలు పెరిగిపోవడంతో, ఆర్థికస్థితి మారడంతో ఏ మాత్రం ఆలోచన గల మనిషైనా పట్నం వెళ్ళి బ్రతకడమే మంచిదని అనుకోవడం మొదలుపెట్టాడు. దీనితో జనం పట్టణాలకు వలస పోవడం ఆరంభమైంది. పిల్లలు, వితంతువులు, ముసలివాళ్ళు, ముఠాకక్షలలో మునిగితేలుతూ వుండేవాళ్ళూతప్ప తక్కిన

వాళ్ళంతా పట్టణాలకు వెళ్ళిపోయ్యారు. ఈవిధంగా ఒకప్పుడు రామరాజ్యం వెలసినచోట పిశాచాలు పెత్తనం చేయడం మొదలెట్టాయి. ఇదంతా నా కళ్ళముందే జరిగింది. నేనూ వూరు విడిచి దూరంగా వెళ్ళాను. గ్రామ పరిస్థితిని మార్చేందుకు నేనేమీ చెయ్యలేకపోయాను. ఎక్కడో 1500 మైళ్ళ దూరంలో నా పని నేను చూచుకుంటూ వుండేవాడిని. రెండేండ్లకొకమారు మా గ్రామానికి వెళ్ళేవాణ్ణి. చిత్రమేమిటంటే—గ్రామస్థుల కప్పటికీ నేనంటే కొంత ఆదరభావముంది. నేను అక్కడ వున్న నాలుగురోజులూ ముఠా పోట్లాటలు కొంత సద్దుమణిగేవి. ముఠాలన్నీ కొంతకాలం సంధిచేసుకున్నట్లుగా తగ్గివుండేవి. కాని నే నా గ్రామం వొదిలిన మరుక్షణమే మరింత ఉధృతంగా కలహించుకునేవాళ్ళు. 1947 ఆగస్టు 15 వ తేదీన మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు మన గ్రామపంచాయతీలు యిట్టి హీనస్థితిలో వుండేవి.

నేటి పంచాయతీలు

అస్సాంరాష్ట్రంలో గారో హిల్సు అనే జిల్లా వుంది. ఆ జిల్లాలో గారో లనే కొండజాతివా రున్నారు. కనుకనే దానికాపేరు వచ్చింది. నే నీ జిల్లాలో మారుమూలన వున్న ఒక గ్రామానికి వెళ్ళిచూచాను. గారోహిల్సుజిల్లా కిప్పుడు మైదాన భూముల నాగరికతతో సంపర్క మేర్పడింది. ఆ గ్రామం సర్పంచ్ నన్ను కొత్తగా కట్టిన పంచాయతీ భవనానికి తీసుకెళ్ళాడు. నేను భవనంలోకి పోయి చూతునుగదా, చిన్న న్యాయస్థానం ఒకటి కనిపించింది. సర్పంచుకు చిన్న కచేరీ

గది ఏర్పాటు చేశారు. సాక్షులకోసమని కొయ్యబోను అమర్చి వుంది. అన్ని హంగులూ వున్నాయి. గారోహిల్సు జిల్లాకు ఈ విధంగా స్వాతంత్ర్యం అవతరించినందుకు సర్పంచు, గ్రామస్థులు ఎంతో సంతోషం కనపరుస్తున్నారు. మేజస్ట్రేటు కోర్టు ఆ గ్రామానికి వచ్చేసింది! సబ్ డివిజన్ కేంద్రములో ప్రజల కేమాత్రం అందుబాటులో లేకుండా మేజస్ట్రేటు ఎంత ఠీవిగా, దర్జాగా కూర్చునివుంటాడో సర్పంచ్ కూడా ఇప్పుడు అలాగే కూర్చోవచ్చు!!

మావి వెనుకబడివున్న గ్రామాలు. వాటిలో నాగరికతకు అత్యావసరంగా కావలసిన హంగులు లేవు. రోడ్లు లేవు. పారిశుధ్య సౌకర్యం లేదు. ప్రజారోగ్యాన్ని కనుక్కునే నాథుడు లేడు. వైద్యసదుపాయాలు లేవు. విద్య గరపేందుకు మంచి పాఠశాలలు లేవు. మరి ఇవన్నీ ఆధునిక మానవునికి అత్యావసరమైనవి. కాని పల్లెల వెంటబడి పోతూవుంటే అక్కడక్కడా మనకు కొన్ని మంచి వూళ్ళు కనిపిస్తాయి. అవి చూడడానికి శ్రేయస్సు మేటవేసిన లంకలవలె వుంటాయి. చిన్నపట్టణంలో వుండే వసతులు, సౌకర్యాలు అన్నీ వాటిల్లో వుంటాయి. మరి ఇటువంటి వూళ్ళు ఎట్లా యేర్పడ్డాయి? అక్కడివారిని విచారిస్తే జిల్లాబోర్డు వైస్‌ప్రెసిడెంటుగానో, లేక తాలూకాబోర్డు ప్రెసిడెంటుగానో, లేదా శాసనసభ్యుడుగానో వున్న వ్యక్తులు ఆ వూళ్ళవారేననీ, కనుకనే అవి పచ్చపచ్చగా వున్నాయనీ తెలియవస్తుంది. తనకు మాలిన ధర్మము, మొదలుచెడ్డ బేరమూ వుంటాయా అన్న సామెత ఒకటి వుంది.

అంటే వ్యక్తి మొదట తన బాగు చూచుకుంటాడు. తరువాత తన కుటుంబం బాగుపడే విధ మాలోచిస్తాడు. ఆపిమ్మట స్వగ్రామంసంగతి ఆలోచిస్తాడు.ఇవన్నీ అయినతర్వాత ఇరుగు పొరుగు గ్రామాలనుగూర్చి, తాలూకానుగూర్చి, జిల్లాను గూర్చి, చివరకు స్వరాష్ట్రాన్నిగూర్చి ఆలోచిస్తాడు.ఇది మానవ సహజమైన స్వభావం. దీని కెవ్వరూ ఆక్షేపించనక్కర లేదు. అయితే ఇటువంటి అభిమానాలు న్యాయాన్నీ, ధర్మాన్నీ,నీతినీ అతిక్రమించిపోకూడదు. ఒకరికి అన్యాయం చేసి స్వజనులకు శ్రేయస్సు చేకూర్చాలనే దృష్టి మంచిది కాదు. అయితే పరాయివారు పరిపాలిస్తూవున్న కాలంలో మన కీజ్ఞానం కలుగ లేదు. ఈ దేశం సంపన్నమైనది కాబట్టే పరాయివారు వచ్చి దీనిని తమ వశం చేసుకున్నారు. ఇక్కడి సంపదను కొల్లగొట్టి తమ దేశాన్ని సంపత్సమృద్ధం చేసుకున్నారు. వలసప్రభువులు నెలకొల్పిన స్థానికస్వపరిపాలనా వ్యవస్థలు ఉభయసామాన్య మైన సంప్రదాయాలను అనుకరించాయంటే అందుకు మనం ఆశ్చర్యపడవలసిన పని లేదు.

జీవితంలో మంచీ,చెడూ రెండూ వున్నాయన్న సంగతి మనకు తెలుసు. బ్రిటిషువారికీ, మన దేశంలో వారి పరి పాలనకూ కూడా ఈ సూత్రం వర్తిస్తుంది. భారత దేశంలో బ్రిటిషుప్రభువుల ప్రతినిధులు రెండు తరహాలుగా వుండేవారు. ఒకరకంవారు నిజాయతీ పరులు; కష్టించి పనిచేసేవారు; స్వతంత్రభావాలు గలవారు. తమ పాలనక్రింద వున్నవారిలో కూడా ఇట్టి సద్గుణములు పెంపొందవలెనని వారు కాంక్షించే వారు. కాని, కాలం గడిచేకొద్దీ ఈరకం మనుషుల సంఖ్యక్రమేణా

తగ్గిపోయింది. రెండవరకంవారు దొరలు. దొరలకూ, వారి దొరసానులకూ దర్బారువైభవమంటే వల్లమాలిన మోజు. వారి అట్టి వైభవం వారికి వారి దేశంలో లభ్యం కాదు. మధ్య యుగాల భూస్వామికవ్యవస్థ, వలసపరిపాలన వున్న ప్రాంతాలలో మాత్రమే అటువంటి వైభవం సాధ్యపడుతుంది. కనుకనే ఈరకం వ్యక్తుల సంఖ్య నానాటికీ పెరగజొచ్చింది. వీరు వలస పరిపాలన శాశ్వతంగా వుండవలె ననే లక్ష్యంతో పనిచేసేవారు. ఇక్కడ తిష్ఠవేసుకొని వుండడానికి చేయనలసిన వన్నీ చేసేవారు.

మొదటిరకంవారు పంచాయతీలు, తాలూకాబోర్డులు, జిల్లాబోర్డులు ఏర్పాటుచేశారు. భారతదేశప్రజలు పార్లమెంటరీ సంప్రదాయాలను పెంపొందించుకొని విశాలదృక్పథం గలవారు కావలెనని వారి కోరిక. ఇచటి ప్రజలలోని ఆటవిక తత్వము, భూస్వామ్యవ్యవస్థలక్షణాలు రూపుమాసిపోవలెనని వారు మనసారా వాంఛించారు. రెండవరకంవారు ఈ కొత్త వ్యవస్థలు కూలిపోవలె నని కోరుకునేవారు. ఈ వ్యవస్థలు తమ మాతృదేశసంస్థలకు హీనమైన నకళ్ళుగా వుండి సరిగా పనిచేయలేని స్థితిలో వీటిని వుంచేందుకు సర్వదా ప్రయత్నిస్తూ వుండేవారు. కాబట్టే కలెక్టరు జిల్లాబోర్డుకు అధ్యక్షుడుగా వుండేవాడు. ప్రజాప్రతినిధి ఉపాధ్యక్షుడుగా వుండేవాడు. తాలూకాస్థాయిలోకూడా ఇదే వరుస. ఈ సంస్థలలో పనిచేసే ఉద్యోగులు, ఇతరసిబ్బంది దిట్టమైనవారు కారు. మధ్యములు. వారి జీతాలుకూడా మధ్యస్థంగానే వుండేవి. ఈ వ్యవస్థలకు ఎన్నికైన ప్రజాప్రతినిధులకు క్రమేపీ దర్బారుప్రాముఖ్యం

బోధచేసేవారు. ఆ బోధలలో పడి వీరు పైనుంచి వచ్చే దారలకు దర్బార్లు యేర్పాటుచేస్తూ తమకు ప్రజలు దర్బార్లు చేయాలని అభిలషించేవారు. అలా నోరుతెరచి అడిగేవారు కూడా. పరిపాలనకు సంబంధించిన తంతెలలో పంచాయతీ చివరి తంతె. అట్టడుగున వుండే వ్యవస్థ అది. దానికి డబ్బు లభించే మార్గాలు చాలా తక్కువ. ఒకటీ అరా ఏదైనా వనరు వుంటే దానిమూలకంగా వచ్చేది గ్రామతలారిజీతానికి కూడా చాలేది కాదు!

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వలసప్రభువులు ఖాళీ చేసిన కుర్చీలపై భారతనాయకులు కూర్చున్నారు. ఇది భారత రాజధానిలోను, రాష్ట్రరాజధానులలోనూ జరిగింది. అయితే గ్రామసీమలు వీటికి చాలా దూరంగా వున్నవి. భారతనాయకులు తాము ఆక్రమించుకొన్న పదవులలో పాదుకుపోయివున్న బ్రిటీషు సంప్రదాయాలను దులిపివేయాలని శక్తికొలది గట్టి ప్రయత్నంచేశారు. వలసపాలనదృక్పథాన్ని మార్చివేసి మనది స్వతంత్ర సర్వసత్తాకజాతి అన్న దృక్పథాన్ని కలిగించడానికి శాయశక్తులా కృషిచేశారు. స్వాతంత్ర్యం వచ్చిన తొలి దశలో కొన్నేండ్లవరకూ మన నాయకులు ఛిన్నాభిన్నమై పోయిన యింటిని చక్కదిద్దడంలో నిమగ్నులై వున్నారు. దానికి తోడు పరిపాలనా సమస్యలను ఆకళింపు చేసుకోవడం కూడా వారి కొక ముఖ్యకార్య మైంది. ఈపను లన్నీ ఒక్కసారే చేయవలసి వచ్చినందువల్ల గ్రామసీమలకు పోయి ప్రజలను కలుసుకొని సమష్టికృషిలో వారితోపాటు పాల్గొనే తీరిక నాయకులకు లేకపోయింది. ఈ విధంగా ప్రజలు తమ

నాయకులు పదవులలోకి వచ్చిన వైభవాన్ని తిలకించారుగాని వాటిని వహించడంలో నాయకు లెదుర్కొన్న ఇబ్బందులను, పడ్డ కష్టాలను తెలుసుకొనే అవకాశం వారికి లభించనే లేదు.

గాంధీహిల్సులోని పంచాయతీలవలెనే "నేటి పంచాయతీలు" కూడా వైభవమునూ, దర్జానూ పంచుకొనేందుకు ఎక్కడ లేని మోజూ పెంచుకున్నాయిగాని చెమటోడ్చి కష్టించడం వాటికి తెలియదు. అలా కష్టించాలనే కోర్కె వాటికి స్వచ్ఛందంగా కలుగలేదు. ఈ పంచాయతీలకు పౌరబాధ్యతలుగాని, పరిపాలనా సంబంధమైన బాధ్యతలుగాని లేవు. వీటికి గల సాధనసంపత్తి బహుఅల్పము. న్యాయపంచాయతీలు గ్రామ శాంతిభద్రతల వ్యవహారమును చూస్తూవుండేవి గనుక వాటికి కొంత అధికారమైనా వుంది. కాబట్టే న్యాయపంచాయతీలు పెంపొందాయి. వికాసపంచాయతీలు నానాటికీ తీసికట్టు అయ్యాయి. స్వాతంత్ర్యానికి పూర్వం రాజకీయపార్టీలు గ్రామసీమలనుండి పోషణ, పుష్టి పొందవలసి వుండేది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత శక్తి, అధికారాలు పైనుంచి రావడం మొదలైంది. రాజకీయపార్టీలు వాటి వెనుకటి సంబంధబాంధవ్యాలనుండి క్రమేపీ దూరమైపోవడం మొదలు పెట్టాయి. మంచికో, లేక చెడ్డకోగాని పంచాయతీ ఎన్నికలలో పార్టీలు ప్రాముఖ్యం వహించలేదు. పార్టీలకు బదులు కులము, ధనము ప్రాబల్యం వహించాయి. న్యాయపంచాయతీలను కలతలు,కలహాలుఆవరించాయి.వికాస పంచాయతీల చాయలకే ప్రజలు పోలేదు. ఎందుకంటే వాటిలో ఆకర్షణ లేదు. పంచాయతీ ఎన్నికలలో ఏకగ్రీవ ఎన్నిక అనేది లేకుండాపోయింది.

ప్రజలపై కొత్త పన్నులు వేయడానికి రాష్ట్ర ప్రభుత్వాలు వెనకాడుతున్నవి. అయితే కేంద్రప్రభుత్వం పన్నులు విధిస్తే అవేమీ అనుకోవు. కాని కేంద్రప్రభుత్వం వసూలుచేసే పన్నులలో వాటికి వాటామాత్రం కావాలి. పంచాయతీలు ప్రజలకు దగ్గిరగా వుండేవికదా. అందుచేతనే ప్రజలనుండి పన్నులు గాని, లేదా వస్తురూపంలోనో, డబ్బు రూపంలోనో విరాళాలుగాని వసూలు చేయడానికి పంచాయతీలు మరీ వెనుకాడుతాయి. నానాతిప్పలు పడి ప్రజలనుండి ధనం సేకరించడంకంటె ఒక మంత్రిగారిద్వారానో, లేక పలుకుబడిగల శాసనసభ్యునిద్వారానో తమ గ్రామానికి హెచ్చు మొత్తమునుగాని, లేక ప్రత్యేక కార్యక్రమమునుగాని మంజూరు చేయించుకోవడం సులభమైన పని అనిపిస్తుంది. పనులు చేయించే కంట్రాక్టర్లు సాధారణంగా పట్టణాలలో, నగరాలలో వుంటూవుంటారు. పంచాయతీలకు అప్పగించిన పనులను చేయించే బాధ్యత, అధికారం తప్పనిసరిగా గ్రామముఖ్యునికో, లేదా సర్‌పంచ్ (పంచాయతీ ప్రెసిడెంటు)కో వుంటాయి. గ్రామముఖ్యుడు, లేదా సర్‌పంచ్ 'వెనుకటి' సంప్రదాయాన్ననుసరించి కంట్రాక్టర్లకు ఉదారంగా ఫీజు ఇవ్వడమేగాక, చేయించే పనులు తమకు సౌకర్యం కలిగించేటట్టుగా, దానివల్ల తమకు మేలు జరిగేట్టుగా చూచుకుంటారు. పంచాయతీ ఇన్‌స్పెక్టరు కేవలం పర్యవేక్షణ చేసే ఉద్యోగిమాత్రమే. మరి పాపం ఇన్‌స్పెక్టరుకు కూడా ఆ గ్రామానికి వెళ్ళినప్పుడు బస ఏర్పాటు, బహుశా ఉచిత భోజ

నమూ కావాలిగదా. ఈ సదుపాయాలను గ్రామముఖ్యుడు, లేదా సర్పంచ్ తప్ప మరెవరు కల్పిస్తారు? తనకు భోజన భాజనాలు ఏర్పాటుచేసేవారు అవతల అక్రమాలు చేసినా ఆ ఇన్స్పెక్టరు 'అదేమి'టని ప్రశ్నించి వారిని కోపపడగలడా?

గ్రామ పంచాయతీల ప్రస్తావన వచ్చినపుడు పట్టణ ప్రజలు వాటినిగూర్చి చాలా హేళనగా మాట్లాడుతూ వుంటారు. కాని నియాన్ లైట్లు, కాంచనముమీది కాంక్ష గ్రామాలలోని ప్రతిభావంతులను ఆకర్షించి చెడగొట్టా యన్న సంగతిని వారు విస్మరిస్తారు. గ్రామంలో గూండాల పెత్తనం వుంటే దానికి విరుగుడు చూపేవా రెవరూ లేరు. ఒక ప్రజా స్వామికవ్యవస్థను మరొక ప్రజాస్వామిక వ్యవస్థమాత్రమే పర్యవేక్షణ చేయగలుగుతుంది. అంతేగాని ప్రజాస్వామిక వ్యవస్థను ఎక్కడో దూరంగా అడుపాజ్ఞలలో వుండే ప్రభు త్వోద్యోగి పర్యవేక్షణ చేయడం పొసగని సంగతి. అది ఉభయులనూ చెడగొడుతుంది. వలస ప్రభువులు అదృశ్య మయ్యారు. కాని వారి విధానం మాత్రం భారతదేశా న్నింకా వీడిపోలేదు. వలసపాలన స్థిరపడడానికీ, విచ్ఛిన్నమైపోతూ వున్న దేశీయ విధానంలో కలిసిపోవడానికీ కొంతకాలం పట్టింది. ఇలా స్థిరపడడానికి కొంత వ్యవధి అవసరమైంది. అలాగే వలస ప్రభువుల నిష్క్రమణకూ, మనం ఎంతో దిట వుగా మన సొంతం చేసుకున్నటువంటి వలసవిధానపు అడుగు జాడలు అదృశ్యమగుటకూ మధ్య కొంత వ్యవధి లేకపోతే అది అసహజంగానే వుంటుందికదూ!

---

# 2. సహకారము

భారతదేశంలో సహకార సంస్థలు

గ్రామపంచాయతీలు ప్రజాసంస్థలు. అవి పౌరుల అవసరాలనూ, సమాజ ఆవశ్యకతలనూ తీర్చడమేగాక శాంతి భద్రతలను కూడా కాపాడుతూవుంటాయి. కాని పౌరుల అక్కరలు, సమాజావశ్యకతలూ తీరి శాంతిభద్రతలు నెలకొన్నంత మాత్రంచేతనే గ్రామావసరాలు పూర్తిగా తీరిపోవు. జనాభా మితిమీరి పెరిగిన కారణంచేత జీవనప్రమాణం సాధించడమటుండనిచ్చి అందరికీ జీవనోపాధి లభిస్తే చాలు ననే స్థితిలో వున్నాము. అదీగాక, పాశ్చాత్యులు యంత్రయుగం ప్రసాదించిన సంపదను మనం అనుభవించకుండా అడ్డుదగిలి మన దేశాన్ని వారి వేటస్థలంగా చేసుకున్నారు. మన అవసరాల కనుగుణంగా తిండి, బట్ట, ఇల్లు నంటి సౌకర్యాలు విస్తారంగా యేర్పడవలసివుంది. జీవితాని కవసరమైన సాంస్కృతిక సదుపాయాలుకూడా కావలసివున్నవి. ఇవన్నీ సమకూరాలంటే మన ఆర్థికవ్యవస్థ పెంపొందాలి. సమాజపు సాంఘికావసరాలను తీర్చే వ్యవస్థకే ఆర్థిక బాధ్యతలుకూడా అప్పగించ

డానికి వీలులేదు. అప్పు డావ్యవస్థ మరీ సంక్లిష్టమైపోయి అలవిగాని దవుతుంది. కనుక గ్రామ ఆర్థికావసరాలను తీర్చ డానికి వేరొక వ్యవస్థ కావాలి. అదే సహకారవ్యవస్థ. ఈ వ్యవస్థలనే మనం సహకారసంస్థ లని అంటున్నాము.

సహకార మనేది వుంటే సహకారసంస్థలు వాటంతట అవే పెంపొందుతాయి. వాటికి రిజిస్ట్రేషను అక్కర లేదు. హిందూ ఉమ్మడి కుటుంబం సహకారానికి చక్కని నిదర్శనం. ఒక స్త్రీ, ఒక పురుషుడు కలిసి, ఇల్లు వాకిలి యేర్పరచు కుంటారు. వారి దొక సంసారము. వారితో వారి సోదరులు, వదినెలు, మరదళ్ళుకూడా చేరుతారు. ఇట్లా కుటుంబాలు యేర్పడుతాయి. అంతా కలిసి కష్టపడి పనిచేసి తమతమ సంపాదనలను ఒకచోట పెట్టుకుంటారు. ఆ రాశిలోనుంచి ఎవరికి కావలసినవి వారు తీసుకుంటూవుంటారు. అంతా ఒక ఇంట్లోనే వుంటారు. ప్రభుత్వంలోగాని సమాజంలోగాని, వారికి రిజిస్ట్రేషన్ అక్కర లేదు. ఇతర కుటుంబములనుండి డిపాజిట్లు తీసుకొని పూచీ వహించడానికీ, ప్రభుత్వసమ్మతితో తమ. వాటాల మూలధనమున కెన్నోరెట్లు మొత్తమును రిజర్వు బ్యాంకునుండిగాని, లేదా ఇతర సంస్థలనుండిగాని అప్పు తీసు కోవడానికీ సహకార సంఘములకు ప్రభుత్వంవారి లైసెన్సు కావలెనంటే అందుకు రిజిస్ట్రేషన్ అవసరమవుతుంది. కాని పరస్పరము కలిసి ఉత్పత్తి చేసినదానిని పరస్పర సమ్మతితో ఎవరికి కావలసిన వాటాను వారు తీసుకొనేటువంటి సహకార పద్ధతిలో చిక్కు లుంటాయా? ఉండవు. "అసలు లేనిదాని కంటె ఏదో ఒకటి వుండడం నయం" అన్న వాటం ఇక్కడ

వుండదు. కాంచనంమీది కాంక్ష లేదు. మంచివాళ్ళు ఏవో ఆకర్షణలకు లోబడి పెడదారిబట్టే ప్రమాదం లేదు. చెడ్డ వ్యక్తులు దూరంగా వుంటారు. సహకార సంస్థలు పెంపొందుతాయి. సహకారవిధానం గంగానదివలె నిండుగా, గంభీరంగా ప్రవహిస్తూవుంటుంది.

కాని నేడు భారతదేశంలో వున్న సహకారసంస్థలు దేశీయసంస్థలుకావు. అంటే వాటిమూలం ఇక్కడిది కాదు. అవి నేటికిరమారమియాభైయేండ్లక్రితం విదేశాలనుండి వచ్చాయి. అప్పుడు వలసప్రభుత్వం పని మూడు పువ్వులూ ఆరు కాయలుగా వుండేది. ఆ పరిపాలకులు చాలా తెలివికలవారు. శరీరము, బుద్ధి, ఆత్మ కలిగివుండి ప్రాచీనమైన సంప్రదాయాలు కూడా కలిగివున్న ప్రాచీన జాతిని తాము పాలిస్తున్నా మన్న సంగతి వారికి తెలుసు. రాజ్యాధికారమును కొంత దేశీయ ప్రజలకు కూడా పంచి ఇవ్వనిదే వలస పరిపాలనను శాశ్వతంగా సాగించడం అసాధ్య మన్న సంగతికూడా వారికి తెలుసు. అయితే ఆయువుపట్లను గోల్పోవ్యే ప్రమాదం లేకుండా పైపై అధికారమును మాత్రమే భారతీయులకు ఎలా పంచి పెట్టడమా అన్నది వారికొక సమస్య అయింది. సమాజం యొక్క చిన్నచిన్న అవసరాలను తీర్చేటందుకై ఒక వంక స్థానిక స్వపరిపాలన అంటూ పంచాయతీ బోర్డులు, మునిసిపాలిటీలు పెట్టారు; మరొకవంక వ్యవసాయదార్లకూ, వస్తువుల వాడకందార్లకూ కొద్దిపాటి అవసరాలను తీర్చడానికి సహకారసంఘాలు పెట్టించారు. అయితే ఈ పరిమిత రంగాలలోనే కొన్ని రాష్ట్రాలు చాలా చక్కని అభివృద్ధిని సాధించ

గలిగాయి. అందుకు కారకులు ఆయా రాష్ట్రాలలోని సమర్థులైన నాయకులే అని చెప్పాలి. తక్కిన రాష్ట్రాలలో సహకార సంస్థలు నామ మాత్రంగానే వుండిపోయ్యాయి.

ఈ సహకార సంఘాలపైన అధిపతి రిజిస్ట్రారు. ఆయన పెద్దజీతం తీసుకొనే ప్రభుత్వోద్యోగి. అయితే ఆయన కేవలం అధికారి మాత్రమే. వ్యవసాయం, పశుసంవర్ధనం, వైద్యం, ఆరోగ్యంవంటి శాఖలైతే అధికారి తాను సాధించిన విశేషములనుబట్టి, లేక చేసిన పనులనుబట్టి వుండడమో, వూడడమో జరుగుతుంది. కాని సహకార రంగం అటువంటిది కాదు. సహకారం జీవిత ప్రాథమిక సూత్రం. ఇది ప్రతి వారికీ తెలిసివుండాలి. పని గొప్పదిగానే భావింపబడజొచ్చింది. కాని దానికి నిలకడ లేదు. కనుకనే సహకార ఆచార విధులను యేర్పరచడంలో రిజిస్ట్రారు చాలావరకు కృతకృత్యు డయ్యాడంటే మనం ఆశ్చర్యపడ నక్కరలేదు. ఈ విధంగా కొన్ని రాష్ట్రాలలో సహకార సంస్థల పెరుగుదల బోడిబోడిగా జరిగింది. కొన్నిటిలో పురుగు కొరికినట్లుగా వుండిపోయింది. పరపతి సౌకర్యాలు కలిగించడానికి పూనుకొన్న చోట సహకార సంఘాలు బాగా పెంపొందాయి. సహకార మార్కెటింగును ఏర్పాటు చేయడానికి కూడా చెదురువాటుగా కొన్ని ప్రయత్నాలు జరిగాయి. సహకార సంస్థల సంఖ్య పెరిగింది కాని సహకారంమాత్రం అపురూపమైంది. అది వేరుతన్నుకొని నిలబడలేకపోయింది. కారణ మేమంటే విత్తనం దేశీయమైనదికాదు; విదేశాలనుంచి దిగుమతి అయినట్టిది. ఆ విత్తనాన్ని దేశీయ శీతోష్ణస్థితికీ, భౌగోళిక పరిస్థితికీ అనుగుణంగా

సంస్కరించడం జరగలేదు. విత్తనాన్ని తెచ్చిన అధిపతులు వలస ప్రభుత్వంవారి జీతం తినే ఏజంట్లు. ఏవో కొన్నిటిని మినహాయించి తక్కిన సహకారసంస్థలన్నీ దర్బారు దస్తాను నిలబెట్టడానికే దోహదం చేశాయి. మనకు మొగలుల పరిపాలనలోనే దర్బారు పద్ధతి అలవాటైంది. కొత్త దర్బారు మన కంత చెడ్డదిగా అనిపించలేదు. దానికీ మనం అలవాటై పోయ్యాము!

### స్వాతంత్ర్యానంతరం సహకారసంస్థలు

స్వాతంత్ర్యోదయం కావడంతో అన్ని రంగాలలోనూ కార్యకలాపాలు ఆరంభమయ్యాయి. సహకార రంగంలోకూడా కార్యకలాపాల ఆవశ్యకత కలిగింది. మన రాజ్యాంగం ప్రకారం సహకారం రాష్ట్రప్రభుత్వానికి సంబంధించిన అంశం. తొలిదశలో కేంద్రప్రభుత్వం ఈ విషయంలో ఏమీ చేయలేదు. చేసే తీరిక కూడా కేంద్రప్రభుత్వానికి లేదు. అది ఎన్నో ముఖ్యసమస్యలతో సతమతమవుతూ వుండేది. భారమంతా ఇండియా రిజర్వుబ్యాంకు వహించి ఒంటరిగానే అద్భుతమైన పని చేయగలిగింది. ఇంతకుముందు చెప్పినట్లు భారతదేశంలోని సహకారసంస్థలు ఎక్కువగా వ్యవసాయరంగానికే – అందులోనూ పరపతి సౌకర్యాల కల్పనకే పనిచేశాయి. రిజర్వుబ్యాంకు భారతదేశానికి జాతీయ బ్యాంకు. ప్రభుత్వం దేశవ్యాప్తంగా అధికాహారోత్పత్తి పథకమునకు ప్రారంభించింది. దీనికి పరపతి సౌకర్యాలను విస్తృతం చేయడం మిక్కిలి అవసరమైంది. గ్రామాలలో రైతులకు

అప్పులివ్వడానికి వడ్డీవ్యాపారస్థు లున్నారుగాని వారు ఎంత డబ్బుని ఇవ్వగలరు? పైగా వాళ్ళు తీసుకునే వడ్డీ గూబ పగ లేసేంతగా వుంటుందయ్యె. ఈపరిస్థితిలో రిజర్వుబ్యాంకుముందు కొచ్చి సహకార సంస్థల పరపతి విభాగానికి సహాయపడింది.

కేంద్రబ్యాంకులు, శిఖరాగ్ర బ్యాంకుల పెరుగుదలకు తోడ్పడటానికై రిజర్వు బ్యాంకుల వాటాల మూలధనంలో ప్రభుత్వంకూడా క్రమేణా భాగస్వామి అయింది. కొన్నేళ్ళ క్రిందట రిజర్వు బ్యాంకుచే నియమింపబడ్డ గ్రామీణ పరపతి పరిశీలక సంఘంవారు గ్రామాలలో పెద్దరకపు సహకార సంఘాలు నెలకొల్పబడవలెననీ, వాటి వాటాల మూలధన ములో ప్రభుత్వంకూడ కొంత పెట్టుబడి పెట్టవలెననీ సిఫారసు చేసింది. తరువాత వెంటనే చాలా సహకార సంఘాలు నెల కొల్పబడ్డవి. క్రమేణా పరపతిసౌకర్యాలు బాగా విస్తృత మయ్యాయి. సహకార సంస్థల కార్యకలాపాలు ఈ విధంగా విస్తృతం కావడానికి ముఖ్యంగా రిజర్వు బ్యాంకువారి చొరవ, కృషియే ముఖ్యకారణమని చెప్పాలి. అంతేగాక రాష్ట్రాల లోని కేంద్రబ్యాంకులకు, శిఖరాగ్ర బ్యాంకులకు పర్యవేక్షణ సదుపాయం కలిగించడానికై రిజర్వుబ్యాంకు ఒక వ్యవస్థను కూడా సృష్టించింది. పరపతి సౌకర్యాలు వృద్ధిజెందేసరికి వస్త్రపరిశ్రమ, గృహవసతి, రవాణా, వినిమయదార్లు, మార్కెటింగువంటి అనేక ఇతర రంగాలలో కూడా తగు ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. ప్రాసెసింగ్ రంగంలో కూడా సహకార సంస్థలు పుట్టుకొచ్చాయి. ఇందుకు చక్కెర ఉత్పత్తి సహకార సంఘాలు చక్కని నిదర్శనములు.

సహకార విధానం సుదృఢంగా పెంపొందవలెనంటే మొదట సహకారోద్యోగులకు తగు శిక్షణ యివ్వాలి. సహకార సంఘాల సభ్యులకు విద్య గరపి విషయాలన్నీ తెలియజెప్పవలసిన అవసరం వుంది. కనుకనే సహకార సంఘాలలో పనిచేసేవారికి శిక్షణ సౌకర్యాలు విస్తృతం చేయబడుతున్నవి. ఇట్లా శిక్షణ పొందేవారిలో ప్రభుత్వ సిబ్బంది, సహకార సంస్థల సిబ్బంది కూడా వుంటున్నారు. సహకార సంఘాల కార్యదర్శులకు, ఆడిటర్లకు, ఇన్స్పెక్టర్లకు, ఎక్సటెన్షన్ ఆఫీసర్లకు, ప్రభుత్వంలోను, ప్రభుత్వేతరమైన సహకారోద్యమంలోను పనిచేసే ఉన్నతాధికారులకు, పెద్ద పదవులలో వున్నవారికికూడా కొత్త శిక్షణకేంద్రాలు ఏర్పడ్డవి. సహకార సంఘాల సభ్యులకు వారి పాత్రను, వారి బాధ్యతలను తెలియజెప్పేందుకై విస్తృతమైన శిక్షణ కార్యక్రమం అమలులోకి వస్తూవుంది. సహకారమనే అంశము రాష్ట్రాలకు సంబంధించిన దవడంచేత రెండేండ్ల క్రితంవరకూ మామూలు విషయాలను చూచేందుకు కేంద్రప్రభుత్వంలో ఒక చిన్న సెక్షన్ మాత్రమే వుండేది. పరపతి వ్యవహారాన్ని రిజర్వు బ్యాంకు చూస్తూవుండేది. రాష్ట్రాలు తమ అధికారం క్రింద వున్న సహకారసంస్థలను పాలిస్తూవుండేవి. కేంద్రప్రభుత్వం ఈ రంగంలోకి ప్రవేశించిం దంటే రాష్ట్రాల ప్రతినిధులకు సామాన్య వేదికగా ఉపకరించడం కోసమే.

నేటి సహకారసంస్థలు

సహకార పరపతి సౌకర్యాలను విస్తృతంచేయడంలో రిజర్వుబ్యాంకు తీసుకున్న చొరవ ఇంతకు ముందరి విభాగంలో కొంత విశదంచేయబడింది. క్రమేణా పెద్దరకపు గ్రాను సహకార సంస్థలు ఏర్పడ నారంభించాయి. ఇందువల్ల ప్రభుత్వం ఒక చేతితో చిన్నరకపు సహకారసంఘాలను నిర్మిస్తూ మరొక చేతితో వాటిని తీసివేసి వాటికి బదులుగా చిన్న చిన్నవాటిని కలిపి పెద్దరకపు సహకార సంఘాలు ఏర్పాటుచేయ నారంభించింది. సహకార విధానము, దాని సంప్రదాయాలు పెంపొంది సక్రమమైన నాయకత్వం వున్న ప్రదేశాలలో పెద్దరకపు సహకార సంఘాలు ఎంతో బాగా పనిచేశాయి. అయితే దేశంలో చాలా ప్రాంతాలలో సహకారముగాని, సహకార నాయకత్వంగాని లేని స్థితి వుంది. రిజిస్టరైన సహకార సంఘాలు మాత్రం వున్నాయి. అట్టిప్రాంతాలలో పెద్దరకపు సహకార సంఘాలు మరొక విధంగా సదుపాయంగా వున్నాయనిపించాయి. వాటామూలధనంలో ప్రభుత్వం కూడ భాగస్వామి కావడంవల్ల నగదుడబ్బు లభించనారంభించింది. అంతేగాక అన్ని విధములైన లావాదేవీలలో ప్రభుత్వం కూడావాటాదారుఅయింది. సభ్యులకుఇంకా పెద్దపెద్ద ఋణాలు ఇచ్చే వీలు కలిగింది. పద్దుమార్పిడులలో బకాయీలను, గడువుమించిన బాకీలను ఒక్కరోజులో పరిష్కారం చేసే అవకాశం యేర్పడింది. కళ్ళకొద్దీ అప్పులు తీసుకొనేవారు సహకారపరపతి ఉద్యమం అంత త్వరగా వ్యాప్తి చెంది నందుకు సంబరపడుతూ వుండేవారు.

సహకారం విషయంలో బాగా ముందంజవేసిన కొన్ని ప్రాంతాలలో విస్తృతీకరణ కార్యక్రమం ఎట్టి చెరుపూ లేని రీతిలో సక్రమంగానే అమలుజరిగింది. తక్కిన ప్రాంతాలలో జరిగిన విస్తృతి సిసలైనది కాదు. అది కొంత కృత్రిమంగా జరిగింది. ఈ విషయం అక్కడక్కడా విచారణలు జరుపగా అట్టి ప్రాంతాలలో పెద్దరకపు సహకారసంఘాలు చిన్నపాటి బ్యాంకులలాగా తయారయ్యాయనీ, అయితే వాటి పనిలో మాత్రం అసమర్థత మాత్రమే కనిపిస్తున్నదనీ తేలింది. సభ్యత్వం బాగా పెరిగిన మాట నిజమే కాని సభ్యత్వం ఎవరికి వచ్చింది? సంఘంలో ఆర్థికంగా సంపన్నులైన వారికి సభ్యత్వం లభించింది. నిజంగా సహకారోద్యమం వల్ల సహాయం పొందవలసిన వారికి సభ్యత్వం లేకపోవడమో, ఒకవేళ వున్నా వారికి అవసరమైన సహాయం లభించకపోవడమో జరిగింది. స్థితిమంతులు మరింత సంపన్నులయ్యారు. ఏమీ లేనివారు ఎక్కడ వున్నారో అక్కడే వుండిపోయారు. దీనితో సహకారసంఘాలలో సహకారస్వభావం త్వరితగతిని లోపిస్తూ పోతూ వుందన్నసంగతి తేటతెల్లమయింది. ఈ స్థితిని నిలువరించవలసిన అగత్యమేర్పడింది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆహారోత్పత్తికి నిర్ణయించబడిన లక్ష్యం చాలా పెద్దది. ఆ లక్ష్యాన్ని సాధించాలంటే పరపతిసౌకర్యాలను విస్తృతంచేయవలసి వచ్చింది. పెద్దమొత్తాలలో రసాయనిక ఎరువులను, విత్తనాలను సేకరించి పంపిణీ చేయవలసివచ్చింది. ఈ పని సక్రమంగా, నిజాయితీతో చేయాలంటే ప్రభుత్వవ్యవస్థపై ఆధారపడివుండడం మంచిది

కా దనిపించింది. ఇటువంటి పనులను సహకారసంఘాలే అవ లీలగా చేయగలవు. అందుచేత పరపతి సహకార సంఘాలను తప్పనిసరిగా సర్వీసుసహకార సంఘాలుగా మార్చవలసిన అవసరం కలిగింది. పెద్దరకపు సహకార సంఘాలను ఏర్పాటు చేయడానికి అంతకుమునుపు నిర్ణయమైన విధానాన్ని అమలు జరపకుండా నిలిపివేయవలెనని 1958లో జాతీయ అభివృద్ధి మండలి తీర్మానించింది. ప్రభుత్వం ప్రత్యేకంగా కల్పించుకొని గ్రామీణపరపతి సౌకర్యాలను విస్తృతంచేసేటందుకై పథక బద్ధమైన కార్యక్రమము నొకదానిని అమలుజరపాలి. పెద్ద రకపు సహకారసంఘాలకు బదులుగా గ్రామసహకార సంఘాలు ఏర్పడాలి. గ్రామసహకార సంఘాలు నిల దొక్కుకొని సుస్థిరంగా వుండగలుగుటకై వాటికి బహువిధ కార్యకలాపాలను కల్పించి ప్రతిరైతుకుటుంబపు అవసరాలన్ని టినీ అవి తీర్చేటట్లు చేయాలి. పరపతిసౌకర్యాలు విస్తృతం కావాలి. కాని కొత్త పథకంక్రింద తలపెట్టబడ్డ కొత్త సహకారసంఘాలు పరపతిసౌకర్యం కలుగజేయడంతో పాటు ఇంకా అనేకపనులను చేయాలి. ఆహారధాన్యాల వ్యాపా రాన్ని ప్రభుత్వమే చేపట్టాలని అంతకుక్రితం ప్రభుత్వం ఒక నిర్ణయం గైకొంది. కాని బాగా అభివృద్ధిజెందిన సహకార రంగము దేశంలో లేకపోవడంవల్ల ఆ నిర్ణయాన్ని అమలు జరిపేందుకు చర్య లేవీ తీసుకోబడలేదు.

1959 సంవత్సరం ఆరంభంలోనే భారతప్రభుత్వంలో సహకారమంత్రిత్వశాఖ ఒకటి ఏర్పాటు చేయబడింది. ఆ శాఖ చేయవలసిన పనులుకూడా కొత్తగా నిర్దేశింపబడ్డవి.

వ్యవసాయావసరాలు దినదినాభివృద్ధి జెందుతూ వున్నవి. కనుక త్వరితగతిని పరపతిసౌకర్యాలను కల్పించవలసిందిగా కొత్తగా యేర్పాటుచేయబడ్డ సహకార మంత్రిత్వశాఖను కోరడం జరిగింది. గ్రామసహకారసంఘాలు వుండాలి. కాని వాటిని సాధ్యమైనంతవరకు వేగంగా సర్వీసుసహకార సంఘాలుగా మార్చాలి. కొత్త సంస్థలు విత్తనాలు, రసాయనిక ఎరువులు, ఇనుము, ఉక్కు, పైరుల తెగుళ్ళకు మందులు మొదలగువాటిని పంపిణీచేస్తూ క్రమేణా వ్యవసాయ పనిముట్ల అమ్మకము, అద్దెకివ్వడము, సాంకేతికసహాయం వంటి ఇతరపనులనుగూడా చేపట్టాలి. మార్కెటింగ్, ప్రాసెసింగ్ రంగాలను సత్వరం విస్తృతంచెయ్యాలి. ఇప్పుడు సమాజానికి ముఖ్యాధారమైన వస్తువుల పంపిణీని టోకు వ్యాపారస్థులు, చిల్లరవ్యాపారస్థులు గుత్తతీసుకొన్నట్లుగా తమ యిష్టమొచ్చినట్లు వ్యవహరిస్తున్నారు. అప్పుడు టోకు వ్యాపారం, చిల్లరవ్యాపారం ఇప్పటికంటే కొంత బాగు పడతాయని ఆశించవచ్చు.

సహకారోద్యమం ఎక్కడో కొన్నిచోట్ల తప్ప ఇతరత్రా కొన్ని స్వార్థపరవర్గాల ఉద్యమంగా తయారైంది. స్వార్థపరులైన రాజకీయనాయకులు, చెడునడత గల ప్రభుత్వోద్యోగులు కొన్నిచోట్ల ఈ ఉద్యమాన్ని తమ చేతులలో పెట్టుకొని, దీనికి అపకీర్తి తెస్తున్నారు. ఇది ఎవరికీ చెందని బిడ్డలాగా అయింది. ఈ దుష్టప్రభావాన్ని తొలగించవలసిన అగత్య మేర్పడింది. సహకారోద్యమం ప్రజోద్యమం కావాలి. అది ప్రభుత్వం చెప్పుచేతలలో వుండాలి అంటే కుదరదు.

ప్రజోద్యమం కావాలనుకున్నపుడు ప్రభుత్వఅజమాయిషీ, నిర్వహాకము పనికిరావు. ఎటో ఒకవైపు వుండాలి. నేడున్న పరిస్థితిలో ప్రభుత్వఅజమాయిషీ వర్ధిల్లి సహకార ఆదర్శం రూపుమాసిపోయేట్టుగా వుంది. ఈ నాడు సహకారసంస్థలకు ఒక వైపు ప్రజలు, మరొకవైపు ప్రభుత్వమూ, రిజర్వు బ్యాంకూ పెద్దపెద్ద పెట్టుబడులు పెట్టడం జరుగుతూవుంది. ప్రజావ్యవస్థ యేర్పడి అది బాధ్యతలను వహించేందుకు ముందు కొచ్చేటంతవరకూ సహకారోద్యమంపై ప్రభుత్వం తన అజమాయిషీని వదులుకోజాలదు. దేశస్వాతంత్ర్యంతోపాటు వచ్చిన వెల్లువలో సహకారోద్యమంలోకి సజ్జనులు మొదలు దుర్జనుల వరకూ - అన్ని తరహాల మనుషులూ జొరబడ్డారు. చాలా సంఘాలను వెంటనే రద్దుపరచవలసి వచ్చింది. ఇటు వంటివి జరిగేసరికి ప్రజాశ్రేయస్సుకు కొంతైనా భంగం కలు గకపోదు. దానితో సహకారోద్యమంపై ప్రజలకుగల నమ్మకం కొంత సడలటం తప్పదు. క్రింది సహకార సంస్థలపై పర్య వేక్షణ సల్పడానికి పైన రకరకాల సంస్థలకు తగు ఏర్పాటు చేయవలసి వచ్చింది. ప్రజలకు సంబంధించిన ఉద్యమంలో దేనినీ గాలికి వదలడానికి వీలులేదు. దేనినీ శూన్యంగా వుంచ కూడదు. ప్రభుత్వనాయకత్వం లేకపోతే ప్రజానాయకత్వ మైనా వుండాలి. లేకపోతే కాపరిలేని గొర్రెలచంద మవు తుంది. చెడ్డ వ్యక్తులు నాయకులై, ప్రజలు వారిపై వుంచిన విశ్వాసాన్ని మంచి అవకాశంగా తీసుకొని సంస్థలను తమ స్వార్థానికి వినియోగించుకుంటారు.

దురదృష్టవశాత్తూ ఇటీవలి ద్రవ్యోల్బణంలో ఉన్నత

సంస్థలు పుట్టుకొచ్చాయి. అఖిలభారత స్థాయిపైకూడ సంస్థలు ఏర్పడ్డాయి. అఖిల భారత సంస్థలకు రాష్ట్ర శిఖరాగ్ర సంస్థలు సభ్యు లయ్యాయి. అది సహజమే. కాని విడ్డూర మేమిటంటే అవి ప్రాథమిక సహకార సంఘాలనూ, సహకారోద్యమంతో యెట్టి సంబంధమూ లేని సంస్థలనూ కూడా సభ్యులుగా రిజిష్టరు చేసుకున్నాయి. ఇలాగే రాష్ట్రస్థాయిలోనూ, దాని కింకా దిగువ స్థాయిలోనూ జరిగింది. అట్టడుగునుండి పైన జాతీయ స్థాయివరకూ సహకార సంస్థలపై అజమాయిషీ ఎక్కడో కొన్నిచోట్ల తప్ప ఇతరత్రా అంతటా కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో వుండిపోయింది. అంటే సంకుచితమైన వలయాలు స్థిరపడిపోయా యన్నమాట. ఆ వలయాలను నిర్మూలించడం సాధ్యంకాని పని అయిపోయింది. పోనీ దిగువస్థాయినుంచి వచ్చే నాయకత్వాన్ని రానిస్తారా అంటే ఆ నాయకత్వం వచ్చి తమ అధికారాన్ని కాస్తా కైవసం చేసుకుంటుందేమోనని ఎక్కడ లేని భయం. అయితే దేశంలో అనేక ప్రాంతాలలో సహకారోద్యమానికి ఉత్తమమైన కృషి చేసి ఆ సేవలోనే అసువులు బాసి అమరులైన మహానుభావు లెందరో వున్నారు. కాని వారి సంఖ్య తక్కువ. సహకార సంస్థలను స్వార్థానికి వినియోగించుకొని ప్రజాశ్రేయస్సుకు భంగం కలిగించిన సందర్భాలు హెచ్చు. పైగా మరొక విశేషమేమిటంటే, ఎవరికి సహాయం అవసరమో, ఎవరికొరకైతే సహాయం ఉద్దేశింపబడిందో అది వారికి లభ్యం కాదు. అవినీతి ప్రబలినచోటనే ప్రభుత్వజోక్యం పనికిరా దన్న కేకలు హెచ్చుగా వినవస్తాయి.

ఈ స్థితిలో సహకార సంస్థలపై అజమాయిషీని నిజాయతీతో, సమర్థవంతంగా పనిచేసే ప్రజాస్వ్యవస్థలకు మార్పిడిచేసే పనికి అత్యంత ప్రాధాన్య మివ్వవలసివున్నది.

సహకార సంస్థలు, గ్రామ పంచాయతీలు కలసి మెలసి పనిచేయవలసిన సమస్యకూడా మనముందు వున్నది. ఈ రెండు పెద్ద వ్యవస్థలు ఇంతవరకూ మందకొడిగా పడివున్నవి. వీటిని హఠాత్తుగా కార్యరంగంలోకి దింపడం జరుగుతున్నది. వీటి కార్యక్షేత్రము ఇంచుమించు ఒకటే కనుక ఈ రెండు వ్యవస్థల పరస్పర సంబంధమును, ఇవి ఒకదాని కొకటి మద్దతుగా వుండవలసిన విధమును నిర్వచింపకపోయినట్లయితే రెండూ ఒకదానితో నొకటి పోటీపడి ఘర్షణ పడవచ్చు. సహకారోద్యమం దేనితోనూ కలగలుపుకాకుండా స్వచ్ఛంగా వుండవలెనని వాదించేవారు సహకార సంస్థలను పంచాయతీల దరిదాపులకే తీసుకుపోవడం ససేమిరా ఒప్పుకోరు. ఇది ఇట్లా వుండగా అటు పంచాయతీ - ఉద్యమ నేతలు సమన్వయం పేరుతో సహకారోద్యమాన్ని మ్రింగివేయ ప్రయత్నిస్తున్నారు. మనం పైన వుండి వూరికే పెత్తనం చెలాయిస్తున్నప్పుడంటే ఈ రెండు సంస్థలనూ ఒకదాని కొకటి దూరంగా వుంచవచ్చు కాని ప్రజాజీవితంలో వీటిని దూరంగా వుంచవీలుపడదు. కారణ మేమిటంటే, ప్రజాజీవిత రంగంలో వీటి కార్యకలాపాలు నిత్యం ఒకదానితో ఒకటి తారసిల్లుతూ ఒకదాని నొకటి అనుసరిస్తూ పోతూవుంటాయి. మరి యివి ఒకదాని నొకటి లోబరచుకోకుండా వేటి కవి స్వతంత్రంగా పనిచేస్తూనే పర

స్వరం సమన్వయంతో వ్యవహరించేట్టు చేయడం ఎలా అన్నది నేడు మనల్ని ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య.

అయితే ఇటువంటి జటిల సమస్యలకు పరిష్కారాలు అంటూ వుండకపోవు. అవి చాలా త్వరగా కూడా పరిష్కరింపబడతాయి. సహకారోద్యమం ఎదుర్కొంటూ వున్న ముఖ్య సమస్య డబ్బు కాదనీ, విజ్ఞానం లేకపోవడం కాదనీ, మనకిప్పుడు నమ్మకంగా తెలిసింది. సహకారోద్యమంలో మనల్ని ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య సహకారమే. అంటే సరియైన వ్యక్తులనుంచి సక్రమమైన సహకారం ఎలా లభ్యమవుతుందా అన్నదే నేటి మన సమస్య. పుణ్యకాలం కాస్తా గడచిపోకమునుపే మనకు అటువంటి సహకారం లభిస్తుందా? మరి బాగా పాతుకుపోయివున్న రాజకీయ, ఆర్థిక అభివృద్ధి నిరోధక శక్తులను స్థానభ్రష్టులను చేయడమనేది దేశవ్యాప్త విప్లవంలో ఒక భాగమై వుంటుంది. దీనిని యితర రంగాలతో నిమిత్తం లేకుండా సహకార రంగంలో మాత్రమే సాధించ వలను పడుతుందా?



# 3. నూతన ప్రజాస్వామ్యం

సామ్యవాద పద్ధతేనా?

సామ్యవాదం అంటే సోషలిజం. అసలు సోషలిజం అంటే ఏమిటి? ఈ ప్రశ్న మనకే అబ్బురంగా వుంది. దీనికి స్పష్టమైన సమాధానం చెప్పుకోవడం కష్టం. భారత దేశ ప్రజలమైన మనకు ఉమ్మడి కుటుంబపు సోషలిజం తెలుసు. ఉమ్మడి కుటుంబంలో అందరికంటె పెద్దను కుటుంబపు పెద్దగా అంగీకరించి ఆయన, లేక ఆమె చెప్పినట్లు మనం నడచు కొంటూ వుంటాము. కుటుంబములోనివారు సంపాదించి తెచ్చిన వాటిని తల్లి అందరికీ పంచి పెడుతుంది. ఎవరి కెంత అవు సరమో అంత ఇస్తుంది. ఒక కుటుంబంలో తెలివి తేటలు గలవా రుంటారు; మందకొడి మనుషు లుంటారు. శరీర దార్ఢ్యం గలవా రుంటారు; అంగవైకల్యం గలవారు, లేదా ముసలివారు ఉంటారు. కాని అందరి అవసరాలూ తీర్చబడుతూ వుంటాయి. తెలివి తేటలతో సంపాదించేవారికి బాగా పెట్టి తక్కినవారి సంగతి పట్టించుకోకపోవడ మంటూ వుండదు. ఎవ రెంత సంపాదించినా, అంతా తమ సంపాదనలను ఒకచోట

కూడబెట్టుకుంటారు. ఎవరి కెంత అవసరమో అంత తీసుకొని వాడుకుంటారు. అయితే సమష్టి సంపాదననుంచి ఎంత తనకు లభ్యమవుతుందో దానిని దృష్టిలో పెట్టుకునే వాడుకుంటారు. న్యాయం, సమానత్వం వుండేవి. పెట్టేది తల్లి; నిర్ణయం చేసేది కుటుంబపు పెద్ద.

అయితే పూర్వపు సోషలిష్టు కుటుంబం ఇప్పుడు లేదు. బస్తీలలో, పట్టణాలలో డబ్బు సంపాదించుకోవచ్చు ననే ఆశతో కుటుంబంలో తెలివితేటలు గలవారు, ప్రయోజకులూ తమ గ్రామాలు విడచి పట్నాలలో కాపురాలు పెట్టారు. అసలు సంపాదన ఏమీ లేకుండా చేతులు ముడుచుకు కూర్చోవడంకంటె ఎంతో కొంత రాబడి వుండటం గుడ్డిలో మెల్ల కదా అనే ఉద్దేశంతో వీరు పట్టణాలకు ఎగబ్రాకారు. ప్రయత్నించడమే తరువాయి, కావలసినంత వచ్చిపడుతుం దనుకున్నారు. ఇందువల్ల పూర్వపు ఉమ్మడి కుటుంబం విచ్ఛిన్నమైపోయింది. పరిశ్రమలు యింకా వృద్ధిజెందే కొలది, జీవన ప్రమాణం పెరిగేకొలది కుటుంబం యింకావిచ్ఛిన్నమైపోతూనే వుంటుంది. కొండజాతులవారు, వెనుకబడ్డ జాతులవారు నివసించే ప్రాంతాలలో మాత్రమే ఉమ్మడికుటుంబాలింకా నిలిచివున్నవి. దేశంలో పేదరికం మాత్రమే వున్నప్పుడు, లేదా జీవనాధారానికి సరిపోనుమాత్రమే వున్నపుడు పంచవలసిందీ వుండదు, వితరణా వుండదు. అట్టి సందర్భంలో సోషలిజం మనల్ని అట్టే బాధించదు. సంపద వున్నప్పుడు మాత్రమే, ప్రతి ఒక్కరికీ అందజేయడానికి తగిన సంపద లేక తిన, కుడువ మాత్రమే వున్నప్పుడు, పంచే మనిషి, లేదా

కుటుంబపు పెద్ద కుటుంబంలో ఒక మనిషికీ మరొక మనిషికీ మధ్య విచక్షణ చూపవలసి వచ్చినప్పుడు, తనకు సరిగా పెట్టు పోతలు లేవన్న కారణంతో కుటుంబాన్ని వదలి దొరికినంత మేరకే సంపాదించుకోవడానికి ప్రయత్నాలు చేసే వీలున్నపుడు మాత్రమే సోషలిజం సమస్యలు ఉత్పన్నమవుతాయి. సమాజపు సంపదను పంచిపెట్టేవారికీ, నిర్వాహకంచేసేవారికీ వారి వారి ఇష్టాయిష్టాలు వున్నాయా, వారు తమవరకేమో పెద్ద వాటా వేసుకొని తక్కినవారికి వారుచేసే పనికి తగ్గ ప్రతిఫలం మాత్రమే ఇవ్వాలని చూస్తే అప్పుడు ఈ సమస్య మరీ జటిల మవుతుంది.

ఇలాంటి విషమావస్థ నేటికి 43 యేండ్ల క్రిందట రష్యాలో వచ్చింది. రష్యాదేశ మనే కుటుంబానికి అప్పుడు 'జార్' పెద్దగా వుండేవాడు. అప్పుడు ఆయన రష్యా భాగ్య విధాత. సంపదను పంచిపెట్టేందుకు ఆయన మధ్యవర్తులను నియమించాడు. ఆ పెద్దలు తమకూ, తమ చెప్పుచేతలలో వుండేవారికీ జాతియొక్క సంపదలలో అత్యధికభాగాన్ని పంపిణీ చేసేవారు. పైగా అది తమ గుత్త హక్కు అన్నట్లు వ్యవహరించేవారు. ప్రజలకు తిన తిండి లభించడమే అంతంతమాత్రంగా వుండేది. ఇక వారికి గల సోషలిజం యేమిటయ్యా అంటే, తమ పరలోకస్థితి బాగా వుండాలని వారు ఆదివారంనాడు చేసే ప్రార్థనలు. వాటి కయ్యే ఖర్చులను జారుచక్రవర్తి భరించేవాడు. కొద్దిమందికి ఎనలేని ఐశ్వర్యం, బహుజనులకు పేదరికం–ఇదీ ఆనాటి పరిస్థితి. ఇట్లా తీవ్రమైన హెచ్చుతగ్గుల వల్ల ఒకరిపై ఒకరికి కార్పణ్యాలు, కలహాలు రేగాయి. కృత్రి

మము, అసహజము అయిన ఇట్టి విపరీతస్థితి ఎంతకాలం వుంటుంది? ఆ బుడగ కాస్తా ఒక శుభముహూర్తాన ఠప్పుమని పగిలిపోయింది. జారుచక్రవర్తినీ, ఆయనచుట్టూ వున్న ఉప గ్రహాలనూ బహిరంగంగా వీధులలో తుపాకీలతో కాల్చి వేశారు. చివరకు వారి పసిపిల్లలనుసైతం విడువలేదు. వారి నామరూపాలు లేకుండా అందరినీ తుదముట్టించారు. చరిత్రలో అది అనన్యమైన సంఘటన. వెంటనే, చచ్చినవారి దివాణాలలో భోషాణాలలో పేరుకుపోయివున్న ఐశ్వర్యాన్ని ప్రజలకు పంచి పెట్టారు. అయినా అందరికీ పంచిపెట్టదగినంత సంపద అక్కడ మాత్రం వుందా? లేదు.

ఒకప్పుడు మూగవారై పడివున్న ప్రజానీకం ఈ విధ్వంసంతో మేల్కొని విజృంభించారు. వారిని వెంటనే అదుపులో పెట్టడం అత్యావశ్యకమైంది. వజ్రసంకల్పం గల నాయకులు గూడ వారికి అప్పుడు వున్నారు. పరిస్థితులు చేయిదాటి పోక మునుపే నాయకులు త్వరపడి ఒక క్రమం నెలకొల్పారు. తత్ఫలితంగా నేటి సోవియట్ సోషలిష్టు రిపబ్లికుల సమాఖ్య యేర్పడింది. నేడు భారతీయులం మనం యేస్థితిలో వున్నామో 1917లో రష్యా యింతకన్నా మరీ పేదగా వుండేది. ఏవిధంగా చూచినా వారి పరిస్థితి మరీ హీనం. ఈనాడు రష్యాదేశం తన ప్రజలకు తిన తిండి, అవసరమైన సౌకర్యాలు కల్పించ గలుగుతూవుంది. ఇతరుల కెవ్వరికీ తీసిపోని యుద్ధతంత్రాన్ని అది నిర్మించుకొంది. తక్కిన ప్రపంచంతో సరిదీటుఅయింది. సైగా రష్యా తనకు మిగులుగా వున్న వస్తుసంపదను మన పంచవర్ష ప్రణాళికలకు యిచ్చి సాయపడుతూవుంది. మరింత

సాయపడతా నంటూంది. ఇంకా అనేక అభివృద్ధిచెందని దేశాలకు కూడా సహాయం చేస్తా నంటూవుంది. చైనాలో కూడా మొదట ఇలాగే జరిగింది. అక్కడకూడా విప్లవం వచ్చేముందు పరిస్థితులు రష్యాలో లాగే వుండేవి. రష్యా తొలిదశలో, అంటే 1930 ప్రాంతంలో ఎట్టి కష్టాలనుభవించిందో ఆ కష్టాలను చైనా ఇప్పుడు ఇంకా అనుభవిస్తూ వుంది. చైనా ఎలా అభివృద్ధిజెందుతుందో మనకు తెలియదు. అయితే అది క్రమశిక్షణ గల జాతి. ప్రపంచంలో మరి యే దేశంలోనూ లేనంత జనాభా చైనాలో వుంది. ప్రపంచ జనాభాలో నాల్గవవంతుమంది ఒక్క చైనాలోనే వున్నారు. రష్యావలెగాక చైనా అధోగతిపాలవుతుం దనడానికి ప్రస్తుతం కారణాలు కన్పించవు.

రష్యాదేశం సంపత్సమృద్ధులతో తులతూగుతున్నప్పటికీ, శక్తివంతమైనప్పటికీ అచ్చట ప్రజలు ప్రభుత్వం విధించే పకడ్‌బందీ అజమాయిషీక్రింద వుండవలసిన స్థితిలో వున్నారు. రష్యాదేశం దాని ప్రస్తుత ఆర్థికప్రమాణాన్ని సాధించడానికి ఎంతమంది మనుషులను ఆహుతిగావింపవలసి వచ్చిందో ఇప్పటికీ సరిగా అంచనా కట్టలేకుండా వున్నాము. ఒకసారు చెరపెట్టబడిన మానవాత్మను తిరిగి సులభంగా విముక్తం గావించడ మంటే అది దాదాపు అసాధ్యమనే చెప్పాలి. పంజరానికి అలవాటుపడ్డ పక్షికి అదే హాయిగా వుంటుంది. దానిని వదలిపెట్టినా అది పోదు. ఇప్పుడు రష్యా తన ప్రజలను సన్మార్గానికి తెచ్చి స్వాతంత్ర్యప్రియులను చేయడానికి ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తున్నది. అయితే అది

అంత సులభమైన పనిగా కనిపించడంలేదు. క్రిందికి పోవడం ఎప్పుడూ సులభమే. పైగా దానికి ఎన్నో దగ్గరదార్లుంటాయి. కాని పైకి ఎక్కడమే కష్టమైన పని. ఆ మార్గం సుదీర్ఘమైనది. అది సాఫీగా వుండదు. ఎన్నో మలుపులు, వంకలు వుంటాయి. పైకి ఎక్కేటప్పుడు దగ్గరదారిగుండా పోవడమంటే గుండె బరువు అనిపిస్తుంది. దాన్ని భరించడం ఎవరికైనా కష్టమే.

భారతదేశచరిత్ర ఎత్తుపల్లాలతో, ఒడుదుడుకులతో కూడుకొని వున్నది. అయితే ఇది అవిచ్ఛిన్నంగా వస్తూ వున్నది. దగ్గరదార్లవల్ల కలిగే ప్రమాదాలను మనము ఎల్లప్పుడూ గుర్తిస్తూ వస్తున్నాము. హృదయమందిరాన్ని అధిరోహిస్తూ మనం అడ్డదారులను విషాన్ని వర్జించినట్లుగా వర్జిస్తూ వస్తున్నాము. వలసపాలకులపై మనం సాగించిన స్వాతంత్ర్యసమరంలో సైతం అడ్డదారి అయినటువంటి హింసను అవలంబించక దూరపుదారి అయిన అహింసను అవలంబించి ఎన్నో కష్టాలపాలై ప్రాణాలొడ్డి శాశ్వత యశస్సు నార్జించుకున్నాము. అసలు హింసాత్మకమైన పద్ధతులే మనకు నిషిద్ధములు. అష్టకష్టాలతో కూడిన ఈ మార్గంలోనుంచి బాపూజీ మార్గదర్శినలై మనల్ని నడిపించుకు వెళ్ళాడు. విదేశీయులపై మనం ప్రయోగించని ఆయుధాన్ని మన ప్రజలపై ఎలా ప్రయోగించగలము? అక్కడ నిషేధం పెట్టు కున్నపుడు ఇక్కడా నిషేధం విధించుకోవలసిందే. పరాధీనత నుండి విముక్తులమైన తర్వాత మనం అవలంబించిన విధానం అనన్యమైనది. ఇట్టి విధానాన్ని ఇంతకుముందెవరూ అనుసరించ లేదు. భారతదేశంలోని సంస్థానాధీశులు, జాగీర్దార్లు, జమీం

దార్లు బ్రిటిషుపాలకులకు ముఖ్యాధారంగా వుండేవారు. రెండవ ఆధారం ప్రభుత్వయంత్రాంగం. స్వాతంత్ర్యానంతరం మనం ఈరెండిటినీ వుంచామేగాని, తుదముట్టించలేదు. మనం నిర్మింపతలపెట్టిన నూతన ప్రజాస్వామ్యంలో సంస్థానాధీశులు, జమీందార్లు కూడా సాధారణ పౌరులవలె నివసించడానికి సిద్ధపడి క్రొత్త పరిస్థితులతో సరిపెట్టుకున్నారు. ప్రభుత్వోద్యోగులు వారికంటె యింకా ముందుకు నచ్చి క్రొత్త యజమానుల క్రింద మారిన తమ పాత్రను నిర్వర్తించడంలో ప్రశంసనీయంగా ప్రవర్తించారు.

హింసను త్యజించండని బాపూజీ మనకు హితవు చెప్పాడు. అందుకు కారణాలు కూడా చెప్పాడు. శరీరంలో ఎక్కడైనా గడ్డలేస్తే దాన్ని పదునైన చురకత్తితో కోసివేయవచ్చు. అయితే ఆ గడ్డ పుట్టుకురావడానికి కారణమేమిటో దాన్ని తొలగించకపోతే అటువంటి గడ్డ మరొకచోట మరింత ఉధృతంగా పుట్టుకొస్తుంది. మన చెడుగులకు మూలమైన రోగమొక పెద్ద దీర్ఘవ్యాధి. అది కొన్ని శతాబ్దాలుగా వుంటూ వున్నది. దాని రోగమూలం అనేక తలలుగల రాక్షసివంటిది. అది మనం విన్న నాయనమ్మ కథలలోని రక్తపు రాక్షసి నంటిది. ఆ రాక్షసి తల నరికితే నెత్తురుచుక్క పడినచోటల్లా ఒక కొత్త రాక్షసి పుట్టుకొస్తుంది. ప్రతి కొత్త రాక్షసికీ ఎన్నో శిరస్సులు. అవి దేశమంతటా ప్రజాజీవితానికి సంబంధించిన దారులన్నింటిలో ప్రవేశిస్తాయి. రోగక్రిములు మన శరీరతత్వంలోకి చొచ్చుకుపొయ్యాయి. అవి పైకి కనిపించకుండా లోలోపలే తొలిచివేస్తాయి. వాటిని కనిపెట్టి

పట్టుకోవడం కష్టం. ఈ పిచ్చికుక్క-కాటురోగం ఎంతగా వ్యాప్తమైందంటే, మనలో ప్రతి ఒక్కరం దానితో తీసుకుంటున్నాము. ఈ దీర్ఘవ్యాధికి చికిత్సయేమిటి? దీనినుంచి మనం ఎలా విముక్తుల మవుతాము?

భారతదేశపునర్నిర్మాణము పునాది మొదలుకొని జరుగవలసివచ్చింది. ఒకవంక పరిశ్రమలను, వ్యాపారాన్ని క్రొత్త పద్ధతిలో వ్యవస్థీకరించవలసివచ్చింది. మరొకవంక రైతాంగపు సమస్యలను ఎదుర్కొనవలసివచ్చింది. ప్రాతిపదికగా వుండే పరిశ్రమలను ప్రారంభించవలసివచ్చింది. సాగునీటికి, విద్యుచ్ఛక్తికి ప్రాజెక్టులను నిర్మింపవలసివచ్చింది. డబ్బు చేసుకోవడంలో మన భారతదేశంలోని పెట్టుబడిదారులు ప్రవీణులని చెప్పాలి. తాము పెట్టిన పెట్టుబడిని కొద్దికాలంలోనే రెండింతలు, మూడింతలు చేసుకొనడం వారికి బాగా తెలిసిన విద్య. మన దేశంలో పనివారలు తమ పనితనాన్ని గర్వకారణంగా ఎంచడం ఇంకా సరిగా మొదలుకాలేదు. అలాగే పారిశ్రామికులు గూడా తమ వృత్తిని గర్వకారణంగా భావించుకోవడం అలవరుచుకోవలసివున్నది. అయితే ఇందుకు అక్కడక్కడ కొన్ని అపవాదములు లేకపోలేదు. పైవేలు రంగములో గుత్తవ్యాపారాల్లో తప్ప ఇతర వ్యాపారాలకు, పరిశ్రమలకు స్వతంత్రించి పూనుకొనేవారు అంతగా కనిపించరు. ఒకవేళ అలాంటివారు వున్నా, పెట్టుబడి లభించడం కష్టంగా వుంది. ఈ లోపాన్ని పూరించడానికి ప్రభుత్వము తప్పనిసరిగా కార్యరంగములోకి దిగవలసి వస్తున్నది.

ప్రభుత్వ వ్యాపార పారిశ్రామిక రంగం త్వరితగతిని విస్తరిస్తూపోతున్నది. పెద్దపెద్ద ఫ్యాక్టరీలు కట్టబడుతున్నవి. బ్రహ్మాండమైన జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు నిర్మింపబడుతున్నవి. ఇంకా ఎన్నో ఆరంభింపబడుతున్నవి. పరిపాలనా సంబంధమైన అజమాయిషీ, సాంకేతిక పర్యవేక్షణ, ఆధునిక శాస్త్రీయ నిర్వహణకు సంబంధించిన పరిజ్ఞానము మన కింకా బాగా పట్టుబడకపోయినప్పటికీ, వాటిని మనము సంపాదిస్తూవున్న వేగంకంటె మరింత వేగంతో మన ప్రాజెక్టులు, ఫ్యాక్టరీలు నిర్మితమవుతూవున్నవి. దేశానికి ముఖ్యమైన రంగాలన్నిటిలో ప్రభుత్వము ప్రాబల్యం వహించి దాదాపు గుత్తపద్ధతికి పూనుకున్నదని ఒకవంక కొందరు గోల పెడుతున్నారు. కాని, ఈ ఆరోపణకి తగిన ఆధారాలు కనిపించవు. కొత్త పరిశ్రమలను ప్రారంభించి వాటివల్లవచ్చే లాభ నష్టాలను భరించేందుకు వెరిగా సిద్ధపడటం లేదు. ప్రభుత్వరంగం ఈవిధంగా విస్తరిస్తూపోతూంటే ప్రైవేటురంగం సమాజాన్ని తమ చేతిలో పెట్టుకోవడానికి వీలుగా వ్యాపారవాణిజ్యాలపై గుత్తనెగపజూస్తున్నది. 1958-59 సంవత్సరములో మన దేశములో పంటలు బాగా పండి ఆహారోత్పత్తి పుష్కలమైంది. మన దేశచరిత్రలో ఆహార ధాన్యాల ధర ఎన్నడూ మించిపోలేదు. ప్రభుత్వము ఆహార ధాన్యాల వ్యాపారాన్ని చేపట్టజూచింది. అందుకు నిర్ణయంకూడా గైకొంది. భూములులేనివారికి, కొద్దిపాటి భూమి గలవారికి లాభంగా వుండేందుకై ఉమ్మడి సహకారసేద్యమును ప్రారంభించవలెనని తీర్మానం చేయబడింది. ప్రభుత్వం తలపెట్టిన ఈ పనులను ఎవరో ఒకరు

విమర్శించని రోజంటూ లేదు. కొందరు వీటిపై కత్తిగట్టి నృత్తిశే కిస్తూ వున్నారు.

భారత దేశంలో పత్రికలు చాలావరకు ప్రైవేటు పెట్టుబడిదారుల యాజమాన్యము క్రింద వున్నవి. భారత దేశ పత్రికా రచయితలు ప్రపంచంలో ఎవ్వరికీ తీసిపోరు. ఐతే, వారు మాత్రం ఏం చేస్తారు? జీతభత్యా లిచ్చేవారికి అనుకూలంగా వ్రాయాలి కదా! అంతా అలాగే వ్రాస్తున్నారని నేను అనడం లేదు. దీనికి కొన్ని అపవాదములు వున్నవి. మరొక విశేష మేమిటంటే, మన దేశంలో పత్రికలు పెద్ద పట్టణాల నుండి వెలువడుతవి. పత్రికాధిపతులు తమ విలేఖరులకు భత్యాలిచ్చి గ్రామసీమలకు పంపి అక్కడేమి జరుగుతుందో చూచి వచ్చి వ్రాయండని కోరరు. నెలజీతాలు లేని విలేఖరులద్వారా జిల్లాల వార్తలు తెప్పించుకొని వాటిని క్లుప్తంగా ప్రచురిస్తూ ఉంటారు. ఆ వార్తలు వ్రాసి పంపినవారికి ఏదో కొంత ముట్టజెప్పుతూ వుంటారు. ఆ విలేఖరులు తాము ప్రత్యక్షంగా చూడకపోయినా వారివల్లా, వీరివల్లా విని వార్తలు వ్రాసి పంపుతారు. మంత్రులూ, ప్రముఖులూ వస్తే వారి ఉపన్యాసాలను వ్రాస్తారు. కాని భారత దేశంలో నూటికి 82 వంతుల భాగము గ్రామాలే! ఇంత పెద్ద భాగములో జరిగే కార్యక్రమాలు ఎప్పటి కప్పుడు పత్రికలద్వారా దేశమంతటికీ తెలియకపోతే ఇక ప్రజాస్వామ్య మేమిటి? కాని, పత్రికలు కొద్దిమంది చేతుల్లో వున్నవి. ఆ కొద్దిమందికి బహుళ సంఖ్యాకులపై శ్రద్ధకాని, అభిమానంకాని లేవు. అటువంటప్పుడు దేశం ఎలా బాగుపడుతుంది?

నాకు తెలిసిన ఒక సంగతి ఇక్కడ ఉదాహరిస్తాను. ప్రభుత్వంవారి తోటలో కాసే పచ్చి బొప్పాయ కాయలకు అకస్మాత్తుగా పెద్ద ధర పలుకుతూ వుంది. దీనికి కారణము ఏమిటా అని ఒక ఉన్నతోద్యోగి విచారణ మొదలుపెట్టాడు. చివరకు తెలిసిన దేమిటంటే, ప్రపంచ మార్కెట్లలో నల్ల మిరియం ధర విపరీతంగా పెరిగిందట. ఇది తెలిసిన కలకత్తా వ్యాపారి ఒకడు మిరియాల వ్యాపారానికి పూనుకున్నాడట. బొప్పాయికాయ విత్తులను ఎండబెట్టితే, వాటికీ, నల్లమిరియాలకూ తేడా కనిపించదు. రుచిచూస్తేనే గాని, ఏది ఏగింజో తెలియదు. అందుచేత ఆ వ్యాపారి నల్లమిరియాలను, బొప్పాయి విత్తులను కలిపి ఎగుమతిచేసి, అలా వచ్చిన లాభంతో ఒక దేవాలయం కట్టించి, ఇహమూ, పరమూ బాగా ఉండటానికి ప్రయత్నించడంలో తప్పేమిటి అనుకున్నాడు. నిజం చెప్పాలంటే ఈనాడు భారతదేశంలో స్వచ్ఛమైన పాలు, వెన్న నంటివి అపురూపమై పోయాయి. ఏది చూచినా కల్తీసరుకే! చాలా మంది వర్తకులు సరుకులను కల్తీచేయడంలో బహు నేర్పరులు. వాళ్ళను చూచి పిశాచాలే అసూయ జెందుతా యనుకుంటాను. వంటలకు వాడే నూనెలో ఇంజన్లకు, మోటార్లకు వాడిన నూనెను కలపడం జరుగుతున్నది. మందులు కూడ కల్తీమందులే! వీటిని తయారుచేసే ముఠాలవారు విపరీతమైన లాభాలు గడిస్తున్నారు. మద్య నిషేధమున్న రాష్ట్రాలలో ఇజారాదారులు నిషేధాన్ని తొలగించవలెనని ఒకటే మోయన ఆందోళన చేస్తూవుంటారు. శాసనాన్ని ఉల్లంఘించేవారిని అప్పుడప్పుడు మన దేశంలో అరెస్టు

చేస్తూ వుంటారు. అయితే వాళ్ళు ముఖ్యులు కారు. వాళ్ళ వెనుక కొందరు ప్రముఖులు వుంటారు. వాళ్ళూ అసలు నాయకులు. వాళ్ళు పైనవుండి వీరిచేత ఆట ఆడిస్తూ వుంటారు. ప్రభుత్వోద్యోగంనుంచి రిటైరు అయినవాళ్ళకు పెద్దపెద్ద జీతాలిచ్చి తమ ఉద్యోగులుగా ఎవరు నియమిస్తున్నారో కాస్త ఆలోచించండి. అట్లా ఎందుకు నియమించుకుంటున్నారు? స్వేచ్ఛావ్యాపారం వుండవలెనని వాదించే వారికి రిటైరయిన ప్రభుత్వోద్యోగులు పెన్నిధివంటివారు. ప్రజా వ్యవహారాలలో నీతి, నిజాయతీ అనేవి అనేక విషయాలతో ముడిపడి వుంటవి. ఉన్నతోద్యోగి లంచం పుచ్చుకోడు. అలా పుచ్చుకున్నాడంటే తెలివి తక్కువ వా డన్నమాట. కాని మర్యాదకు సాటిమానవుడు చూపే ప్రేమను, అభిమానాన్ని ఎలా తిరస్కరించ గలడు? "ఏదో మర్యాదకోసం తమ దర్శనార్థం వచ్చానండీ" అనే మాట భారత దేశంలో తరచు మనం వింటూ వుంటాము. దీని అర్థమేమిటి? నియంతృత్వపరిపాలన వున్న దేశంలో రంగంలోకి శాసనం రావలసిన పనే లేదు. పరిపాలనా సంబంధమైన సాక్ష్యం వుంటే చాలు. కాని మన భారత దేశంలో శాసనానికి గౌరవ మున్నది. ఏదైనా, శాసనం ప్రకారం జరగాలని మనం వాదిస్తూ వుంటాము. అయితే శాసనమార్గం అనేది కంటకావృతమైనది. శాసనంయొక్క ముఖ్యధ్యేయాన్ని కాలానుగుణంగా, లేదా ప్రభుత్వం నిర్ణయించిన లక్ష్యానికి అనుగుణంగా రూపొందించడ మనేది కడు దుర్ఘటమైన కార్యం. దీనికి అడుగడుగునా శిఖండి బండలే అడ్డం వస్తూవుంటాయి. ఈ విధంగా ప్రభుత్వం ప్రబోధించే

సామ్యవాద పద్ధతి సమాజం అనే ధ్యేయానికీ, స్వేచ్ఛా వ్యాపారులు బలపరిచేటువంటి, న్యాయవాదులు న్యాయ స్థానాలలో అనుసరించేటువంటి ప్రాచీన ధర్మశాస్త్రానికీ బాహాటంగా ఘర్షణ జరిగే అవకాశాలు వున్నాయి.

కొత్త ఢిల్లీ

ప్రజాస్వామ్యమనగా ప్రజలకు పరిపాలనాధికారం వుండడం. మన దేశంలో ప్రజల పరిపాలన అనేది పూర్వం లేదనే చెప్పాలి. ఒక వేళ వున్నా, చాలా అరుదు. అయితే రాజులు ప్రజాభిమతమును పాటించిన సందర్భాలు కొన్ని వున్నవి. రాజులు కేవలం రాజ్యాధిపతులుగా మాత్రమే వుండి రాజ్య పాలన వ్యవహారాలలో తమకు సలహా లిచ్చేందుకై ప్రజా ప్రతినిధులను నియమించుకునేవారు. భారత దేశం ఎక్కడ వుందీ అంటే గ్రామాలలోనే అన్న సంగతి గాంధీ గారికి తెలుసు; కనుక భారత దేశాన్ని పునరుజ్జీవింప జేయవలెనంటే గ్రామాలను ఉద్ధరించాలి. ప్రభుత్వం గ్రామం పునాదిగా పైకి వ్యాపించాలి. వ్యక్తి స్వాతంత్ర్యం వుండవలెనని గాంధీజీ ఆకాంక్షించాడు. కనుక పర్యవసానంగా పరిపాలనా వికేంద్రీకరణ జరుగుతుందనీ, ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుందనీ ఆయనకు తెలుసు.

భారత రాజ్యాంగ నిర్మాతలు గాంధీజీ బోధలను దృష్టియం దుంచుకొని వ్యవహరించారు. నవభారత రాజ్యాన్ని క్రింద గ్రామంనుంచి పైకి రాజధాని వరకూ నిర్మింపవలసి వచ్చింది. నిర్మాణమంటే ప్రజాజీవితానికి సంబంధించిన ప్రతి

దశను, ప్రతి స్థితిని పునర్నిర్మాణం చేయడ మన్నమాట. గ్రామ ప్రజలకు వ్యవసాయం, పశుసంవర్ధనం, ఆరోగ్యం, విద్య, గ్రామ పరిశ్రమలు, రాకపోకలు, వార్తాసౌకర్యములు, స్త్రీలు, శిశువుల సంక్షేమ కార్యకలాపాలు, సాగునీరు, పంచాయతీలు, సహకారం మున్నగు విషయాలలో ప్రభుత్వ సహాయం అవసరం. గ్రామాలు దేశరాజధాని అయిన ఢిల్లీకి చాలా దూరంలో వున్నవి. ఢిల్లీకీ, గ్రామాలకూ అసలు పోలికే లేదు. ఉభయసామాన్యమైన లక్షణాలే కనపడవు. గ్రామ వ్యవహారాలను ఢిల్లీ పాలింప జాలదు. కనుకనే మన దేశ రాజ్యాంగంలో అలాంటి విషయాలన్నీ రాష్ట్రాలకూ, కేంద్రానికీ, ఉభయత్రా సంబంధించిన అంశములుగా పేర్కొనబడ్డవి. ఇవి రాష్ట్రాలకూ, కేంద్రానికీ, ఉభయత్రా సంబంధించిన అంశములు కూడా కావు. మన రాజ్యాంగం ప్రకారం ఆర్థిక వ్యవహారాలు, కరెన్సీ, విదేశ వ్యవహారాలు, దేశరక్షణ, వార్తా సౌకర్యాలు, రైల్వేలూ కేంద్ర జాబితాకు సంబంధించిన అంశాలు. భారీపరిశ్రమలు, తత్సంబంధ విషయాలు, ఆహారం పంపిణీ మున్నగునవి రాష్ట్రాలకూ, కేంద్రానికీ ఉభయత్రా సంబంధించిన అంశాలు. మన రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగంలో గ్రామ పంచాయతీలకు చిన్న గూడు ఒకటి ఏర్పాటుచేశారు. భారత రాష్ట్రాలే పెద్దవి. అటువంటప్పుడు రాష్ట్ర రాజధానులకు పంచాయతీలు కడుదూరంగా వుంటాయి. వాటిపట్ల శ్రద్ధవహించడం వీలవుతుందో లేదో అన్న విషయాన్ని మన రాజ్యాంగ నిర్మాతలు ఆలోచించినట్టు లేదు. పంచాయతీలు అంగబలంతో బాధ్యతా

యుతంగా పనిచేయవలెనంటే వాటిని ఒక అల్లికక్రిందికి తేవ డం అవసరమన్న సంగతి వారికి తట్టనే లేదు.

భారత దేశానికి రాజధాని క్రొత్త ఢిల్లీ. మన కేంద్ర ప్రభుత్వానికి కార్యస్థానం అదే. క్రొత్తఢిల్లీ నేటికి యాభై యేండ్లక్రితం పాతఢిల్లీ శివారులలో కట్టబడింది. పాతఢిల్లియే పాత పట్టణం. అందులో ఒక కోట వుంది. మొగలుప్రభువులు ప్రజలకు దూరంగా ఆ కోటలో నివసిస్తూ శత్రువులనుండి రక్షణ యేర్పరచుకొని, ఈ దేశాన్ని పాలించారు. వారు దీవానే ఆమ్, దీవానే ఖాస్ అను రెండు మందిరములలో దర్బార్లు జరిపేవారు. యమునానదీతీరంవైపున గుమికూడిన ప్రజలకు దర్శనమిచ్చేవారు. క్రొత్తఢిల్లీని నిర్మించిన బ్రిటిషు శిల్పి బ్రిటిషువారి వైభవాన్ని చిరస్థాయిగా వుంచవలె నను కున్నాడు. ఇప్పుడు మనం దేనిని రాష్ట్రపతిభవనం అని అంటు న్నామో, అది బ్రిటిషువారి హయాములో వైస్రాయి భవనంగా వుండేది. వైస్రాయిభవనానికి చుట్టూ క్రొత్త ఢిల్లీ నిర్మింపబడింది. సౌత్ బ్లాకు, నార్త్ బ్లాకు భారతదేశంలో బ్రిటిషురాజరికానికి రెండు స్తంభాలుగా కన్పిస్తూవుండేవి. ఈ రెండు బ్లాకులు వాస్తుశిల్పంలో బృహత్తరమైనవి. మహా సౌధములవలె వీటిని నిర్మించారు. ముందుముందు భవనాన్ని విస్తరించేందుకు వీలుగాకుండా అవి నిర్మింపబడ్డాయి. రాజ్యాధి కారం లండనులో కేంద్రీకృతమై వుండేది. అక్కడినుంచి వచ్చే ఉత్తరువులను అమలుజరిపేటందుకు పూర్తి వికేంద్రీ కరణ చేశారు. ఢిల్లీలో ప్రభుత్వయంత్రాంగవిస్తరణ, కేంద్రీ రణ అవసరం లేదనుకున్నారు. కాని రెండవ ప్రపంచ

యుద్ధం వచ్చేసరికి వారి అంచనాలన్నీ తప్పు అని తేలింది. ఆగ్నేయాసియా యుద్ధరంగానికి ఢిల్లీ ప్రధాన కేంద్రమైంది. యుద్ధవ్యూహములను పన్నుటకూ, శత్రువుల భోగట్టా తెలుసుకోవడానికీ ఢిల్లీలో యుద్ధసాధనాలను అమితంగా కేంద్రీకరించి విస్తరింపజేయవలసివచ్చింది. అప్పటికప్పుడు కట్టిన మిద్దెలలో కేంద్రసచివాలయం తాలూకు కొత్త ఆఫీసులు పెట్టారు. వీటినే 'టెంపొరరీ హట్ మెంట్సు' అంటారు. కాని ఈనాటికీ ఇవి కేంద్రకార్యాలయాలుగానే వున్నవి.

1947 ఆగష్టు 15-వ తేదీన బ్రిటనునుండి ఇండియాకు అధికారం మార్పిడి జరిగేసరికి ప్రభుత్వంలో ఒక కొత్తదశ ఆరంభమైంది. భారతదేశానికి ప్రత్యేకరాజ్యాంగం అవలంబింపబడడంతో మరింత మార్పు వచ్చింది. యుద్ధకాలంలో పెరిగిపోయిన పరిపాలనావ్యవస్థను చాలావరకు తగ్గించివేస్తారని అనుకున్నారు. నిజమైన ప్రజాస్వామ్యం అమలుజరగాలంటే అలా తగ్గించివేయడం అవసరమే. కాని దానికి భిన్నంగా జరిగింది. కేంద్ర అధీనంలో గల వ్యవహారాలకు ఒక్కొక్కదానికి ప్రత్యేకమంత్రిత్వశాఖ ఢిల్లీలో వుండడం అవసరం కదా. కాని చిత్ర మేమిటంటే, ఆయేటి కాయేటికి మంత్రిత్వశాఖలు విస్తరిస్తూపొయ్యాయి. ప్రతివ్యవహారానికీ—అది కేంద్రానికి సంబంధించినది కానివ్వండి, రాష్ట్రానికి చెందినది కానివ్వండి, లేదా ఉభయులకూ సంబంధించినది కానివ్వండి—ఒక ప్రత్యేకమంత్రిత్వశాఖ యేర్పడింది. విస్తరించడంలో మంత్రిత్వశాఖలు ఒకదానితో ఒకటి పోటీపడుతూ పొయ్యాయి. ఒక్కొక్క శాఖలో ఉద్యోగులు కూర్చునే

స్థలం, వారికి నెలవారీ లభించే జీతాలు చూచుకొని యేశాఖ కాశాఖ తాను చాలా విస్తృతమయ్యానని ముడుసుకొని పోవడం మొదలెట్టింది. ఢిల్లీలో ఆఫీసులు పనిచేసే రోజున ఉదయం 10 గంటలవేళా, సాయంకాలం 5 గంటలవేళా రోడ్లపై కారు వేసుకొనిగాని, సైకిలు తొక్కుకుంటూగాని, నడచిగాని పోవడం చాలా కష్టం. ఉదయం ఆఫీసులకు పోయే జనాన్ని, సాయంత్రం ఆఫీసులనుంచి వచ్చే జనాన్ని చూస్తే హరిద్వారంలో గంగాపుష్కరం ఊరేగింపుజనం జ్ఞాపక మొస్తుంది. ఒక బిడారు కదలిపోతున్నట్లుంటుంది. ఉదయం 10 గంటలప్పుడూ, సాయంకాలం 5 గంటలప్పుడూ రోడ్లపై కన్పించే జనసందోహాన్ని చూస్తే భారతదేశంలో విద్యావంతు లైన వారిలో అసలు నిరుద్యోగు లెవరైనా వున్నారా అని పిస్తుంది. కొత్తఢిల్లీ అంతటా ఇప్పుడు నిర్మితమైన పలు అంతస్తుల భవనాల ముందర నార్తుబ్లాకు, సౌతుబ్లాకు వెలవెల బోతాయి. ఇంకా భవనాలు కట్టుతున్నారు.స్థలం లభించడమే ఒక పెద్ద సమస్య అయిపోయింది. ఒకప్పుడు కొత్తఢిల్లీ ప్రపంచంలో ఉద్యాననగర మని పేరుపొందింది. ఎక్కడ చూచినా విశాలమైన ఖాళీస్థలాలు, చెట్టుచేమలు వుంటాయని పేరు. కాని ఆ ఉద్యానాలన్నీ వేగంగా అదృశ్యమైపోయేట్టు వున్నాయి. చదునుగా వున్న స్థలాలలో బంగళాలు లేస్తు న్నాయి. బంగళా లున్నచోట పలుఅంతస్తుల భవనాలు ఆకాశాన్నంటుతూ లేస్తున్నాయి. పాకిస్తానునుంచి లక్షలాది కాందిశీకులు వచ్చివేస్తున్న సమయంలో వారికి ఢిల్లీయే ఆశ్రయ మిచ్చింది. ఒకప్పుడు ఢిల్లీజనాభా 4 లక్షలు. కాని

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కొన్నేండ్లలోనే 20 లక్షలకు పైగా పెరిగిపోయింది. ఢిల్లీపట్టణం నిరాశ్రయులకు ఆశ్రయమివ్వటమేగాక, నిరుద్యోగులకు సత్రంగాకూడా మారినట్లు అనిపిస్తూవుంది.

మంత్రిత్వశాఖలకు యేవో పనులు, విధులు వుంటే తప్ప లేకపోతే అవి అర్థరహిత మవుతాయి. కనుకనే ఒక కొత్త మాట పుట్టింది. దానితో లైసెన్సు దొరికినట్లయింది. అదే 'సమన్వయం.' దీనికి కొత్తగా సృష్టింపబడ్డ ప్రణాళికా సంఘం ఇంకా దోహదం చేసింది. కేంద్రప్రభుత్వానికి ఎంత పెంచినా పెరుగగల ఆదాయపువనరులు లభ్యమయ్యాయి. దీనికి తోడు రాష్ట్రాలు వాటంతట అవే కొన్ని ఆదాయాలను కేంద్రానికి అప్పగింతపెట్టడానికి అంగీకరించాయి. అయితే ఒక షరతు. ఏమిటంటే, కేంద్రం పన్నులు వసూలుచేయాలి. అలా వసూలుచేసిన ధనంలో ఆయారాష్ట్రాలకు ఎంత వాటా ఇవ్వాలో అంత ఇచ్చేసెయ్యాలి. ఈ బాధ్యతను కేంద్రం సంతోషంగా స్వీకరించింది. సెంట్రల్ రెవిన్యూబోర్డు అంతు లేకుండా పెరిగి విస్తరించింది. కొత్త ప్రజాస్వామ్యం రావడంతో పరిపాలనకు సంబంధించినవీ, సంబంధం లేనివీ అనేక క్రొత్త సంస్థలు పుట్టుకొచ్చాయి. జాతిమొత్తానికి ప్రణాళికా సంఘం ఎన్నో పథకాలు, ప్రణాళికలు సిద్ధంచేసింది. రాష్ట్ర ప్రణాళికలలోకూడా చాలా భాగం కేంద్రమిచ్చే ఆర్థిక సహాయంపైనే ఆధారపడి వుంటున్నాయి. కేంద్రం డబ్బిచ్చే ప్రణాళికలకు కేంద్రంనుంచి పర్యవేక్షణ అవసరమైంది. ఇంత విశాలమైన దేశం పెద్ద సిబ్బంది

లేకుండా ఢిల్లీనుంచి ఎలా పాలింపబడుతుంది? అందులోనూ, ప్రణాళికలు అమలుజరుగుతున్నపుడు! అందుచేత భారీ ప్రయత్నాలలో నిమగ్నమైవున్న కేంద్రమంత్రిత్వశాఖలు రాష్ట్రాలనుంచి పరిపాలనలోనూ, సాంకేతికంగానూ, సమర్థులైన ఉద్యోగులను తెప్పించుకున్నాయి. మరికొన్ని సందర్భాలలో తాము వదులుకోవాలని చూస్తూవున్నవారినీ, తమకు సమస్యగా తయారైన ఉద్యోగులనూ కేంద్రానికి పంపడం మొదలుపెట్టాయి. ఈవిధంగా కేంద్రం ఒకవంక మెరికలవంటి సమర్థులైన ఉద్యోగులకూ, మరొకవంక వినోదాలతో కాలక్షేపంచేసే కులాసాజీవులకూ నిలయమైంది. ఈ రెండు రకాలవారూ కురుక్షేత్రయుద్ధం ఆరంభించారు. అసిస్టెంట్లు, గుమాస్తాలు, ప్యూనులు, దఫ్తరీలు, ఫరాషులు, ఊడ్పుపనివారు- ఇంకా రకరకాల పనులవారు కురుక్షేత్రరంగంలో పదాతిదళంగా పనిచేస్తున్నారు. పార్కిన్సన్ మహాశయునికి ఇంతకంటే చక్కని పరిశీలనాకేంద్రం వేరొకటి లభించగలదా?

రాష్ట్రాలలో సమర్థులైన ఉద్యోగులు లేకపోయేసరికి అవి కేంద్రాన్ని కాదనలేని స్థితికి వస్తాయి. వాటి కార్యదక్షత కూడా తగ్గిపోతుంది. కొత్త ఢిల్లీకి, రాష్ట్రరాజధానికి మధ్య మనుషుల రాకపోకలు మార్పిళ్ళు ఎక్కువయ్యేసరికి రాష్ట్రాలకు అంగబలముకూడ సన్నగిల్లిపోయింది. ఈ పరిస్థితిలో కేంద్రం అధికంగా పర్యవేక్షణ చేయవలసిన అవసరం వస్తుంది. ఈ విధంగా ఈ వలయం విస్తరిస్తూపోతున్నది. బ్రిటిషువారి హయాములో గ్రామప్రాంతాలకు, పట్టణప్రాంతాలకు మధ్య ఎటువంటి వ్యత్యాసాలు వచ్చాయో ఇప్పుడు రాష్ట్రాలకూ,

కేంద్రానికీ మధ్య అటువంటి స్థితే వస్తుంది. రాష్ట్రంనుంచి కేంద్రానికి వచ్చే అధికారి మూడేండ్లు, లేదా ఐదేండ్ల డెప్యుటేషన్‌పై వస్తారు. ఐతే ఒకమారు ఢిల్లీకి వచ్చి కాపురం పెట్టిన ఉద్యోగి ఇక అక్కడనుంచి వెళ్ళిపోవడానికి ఇష్టపడడు. సాయంకాలంవేళ చాణక్యపురి మనోహరంగా వుంటుంది.

ఎక్కడనుంచి అయితే నేమి, రోజుకు రెండు ఆహ్వానాలు వస్తాయి. అచ్చయివుండే అఫిషియల్ డైరెక్టరీ ఇందుకు వాటంగా వుంటుంది. ఇవిగాక అంతర్జాతీయరంగం వుండనేవుంది. విదేశాలలో అంతులేకుండా సభలు, సమావేశాలు జరుగుతూనేవుంటాయి. మరి అంతర్జాతీయరంగంలో భారతదేశప్రతిష్ఠ నానాటికీ పెరుగుతూనేవుందికనుక వాటిల్లో పాల్గొనక తప్పదు. ఇంకా ఐక్యరాజ్యసమితి, తదితరసంస్థలు ఉన్నతశిక్షణకు ఏవో కొన్ని ఏర్పాట్లు చేస్తూనేవుంటాయి. ఆ శిక్షణపొందటానికి కొందరు అధికారులను పంపాలి. ఇవిగాక మరికొన్ని అంతర్జాతీయసంస్థల ఆధ్వర్యాన అభివృద్ధి చెందనట్టి దేశాలలో పనులు నిర్వహించడానికి కొందరు ఉద్యోగులను పంపవలసివుంటుంది. ఎన్ని అవకాశాలు!!

కొత్తఢిల్లీ చూపు అప్పుడే విశాలవిశ్వం పైకి ప్రసరిస్తోంది. అంతర్జాతీయసంస్థలో ఉద్యోగమంటే మాటలా! పెద్దజీతం, బోలెడు సదుపాయాలు. వీటితో సమానమైనవి మరెక్కడ వుంటాయి? ఆ ఉద్యోగాలకు బాధ్యతలు చాలా తక్కువ. భౌతికంగా గాని, పత్రికలద్వారాగాని రాళ్ళు విసరడమంటూ వుండదు. విదేశాలలో అంత విలువ గల ఉద్యోగియై అంత తక్కువ శ్రమతో అంత పెద్దజీతం సంపాదిస్తూవుంటే

ఇక ఆఫీసువేళల్లో ఎక్కువ పనిచేయండని ఎవరైనా ఎలా కోరగలుగుతారు? అసలే భారత దేశంలో పరిస్థితులు, ఇక్కడి శీతోష్ణస్థితి మనిషి ఎక్కువ పాటుపడి పనిచేయడానికి తగినవిగా లేవు. కష్టపెట్టి పనిచేయించి, ఒక ఉద్యోగి ఆరోగ్యాన్ని చెడ గొట్టే హక్కు స్వతంత్రప్రభుత్వానికైతేమాత్రం వుంటుందా? వేతనాలు పెంచండని కోరుతారు. దిగువస్థాయిన సిబ్బంది సంఘాలు ఏర్పాటుచేస్తారు. ఆఫీసర్ల సంఖ్య హెచ్చుతుంది. ఎందుకంటే తిరగబడే ధోరణిలో వున్న సిబ్బందిచేత పని చేయించే అధికార్లు ఎక్కువమంది వుండాలికదా. ఆఫీసర్లకు పర్యవేక్షణ అవసరం. వారుమాత్రం ఆకాశంనుంచి ఊడి పడతారా? పనిలో నాణ్యత, సమర్థత తగ్గిపోతాయి. కాగి తాలపై రంగుల రాట్నాలు పెరుగుతాయి. రాష్ట్రాలలో అసలే అయోమయత్వం. దానికి తోడు కేంద్రంనుంచి రక రకాల సర్క్యులర్లు! ఆ సర్క్యులర్లు చదివితే, అబ్బా! ఎంత తెలివిగా వ్రాశారు అనుకుంటాముగాని, ఒకదానికీ, మరొక దానికీ పొంతన వుండదు. దీనితో రాష్ట్రాలుకూడా చెప్పిన మాట వినకుండా తయారవుతాయి. కొత్తఢిల్లీసచివాలయంలో సిబ్బంది మరీ పెరుగుతుంది. ఇలా విషవలయం విస్తృతి జెందుతుంది. పన్నులు పెరిగిపోతాయి. ప్రజలు గోల పెడ తారు. జరిగే పని తక్కువ. రాష్ట్రాలు మాత్రం తక్కువ తిన్నాయా?

భారతదేశ మొక ఉపఖండము. ఇది సువిశాలమైన భూమి. దీనికి మూడువైపుల సముద్రమున్నది. ఉత్తరమున హిమాలయపర్వతము లున్నవి. ఉత్తరమున కాశ్మీరుమొదలు

దక్షిణమున మద్రాసురాష్ట్రంలోని కన్యాకుమారివరకు రెండు వేల మైళ్ళ దూరం. అలాగే పడమట గుజరాతులోని కచ్ మొదలు తూర్పున నాగాల్యాండ్‌లోని కోహిమావరకు రెండు వేల మైళ్లు. ఇంత విశాలమైన భూభాగ మిది. మధ్యన అక్కడక్కడ పర్వతాలు, నదులు, అడవులు వున్నవి. యుగ యుగాలుగా భారతదేశం సాంస్కృతికంగా ఏకదేశమై వర్ధిల్లుతూ వచ్చింది. పరిపాలనా విషయకంగా కూడా ఇది బ్రిటిషువారి పాలనలో ఏకదేశ మైంది. రకరకాల ప్రాంతా లున్నప్పటికీ, ఎన్నో భాష లున్నప్పటికీ, తీరుతీరుల ప్రజ లున్నప్పటికీ, ఈ దేశ ఐక్యత చెక్కుచెదరకుండా వస్తున్నది. ఇటువంటి ఐక్యత వున్న దేశంలో, కేంద్రంలో ఏమి జరిగినా అది దేశం నలుమూలలకూ వ్యాపిస్తుంది. స్వాతంత్ర్యానంతరం ప్రభుత్వం పలుఅంతస్తుల భవనాలలోకి విస్తరించడమునేది ఒక్క ఢిల్లీలోనే జరుగలేదు. ఢిల్లీని చూచి రాష్ట్రాలుకూడా నేర్చుకున్నాయి. అక్కడా సిబ్బంది పెరిగిపోయింది. సెక్రటేరియట్ భవనాలు చాలడం లేదు. కొత్త సచివాలయాలు కట్టారు. మంత్రులకూ, ఉపమంత్రులకూ, పెరిగిపోయిన ప్రభుత్వ సిబ్బందికీ భవనాలు, ఇండ్లు కట్టు తున్నారు. కొన్ని రాష్ట్రాలకు కొత్తగా రాజధానులే నిర్మింప వలసి వచ్చింది. సిబ్బంది ఎందుకు పెరిగిందయ్యా అంటే– ప్రభుత్వం చేయవలసిన పని భూమిశిస్తు వసూలుచేయడం, శాంతి భద్రతలు కాపాడడమేగాక ఇంకా అనేకరంగాలకు విస్తరించింది. ప్రజాసంక్షేమమునకు వెచ్చించడానికే భూమి శిస్తు వసూలు చేస్తున్నారు. పునర్నిర్మాణానికి వీలు కలిగించ

డానికే శాంతిభద్రతలు కాపాడుతున్నారు. ప్రభుత్వం అన్ని రంగాలలోనూ పునర్నిర్మాణబాధ్యతలు వహించాలి.

రాష్ట్రాల శాసనసభలలో, శాసనపరిషత్తులలో, ఢిల్లీలోని లోకసభలో, రాజ్యసభలో మొత్తం రమారమి నాల్గు వేలమంది ప్రజాప్రతినిధులున్నారు. రాజకీయపక్షాల వ్యవస్థలలో రమారమి మరి యింతమంది వుండివుంటారు. అలా వుంటేనే పార్టీవ్యవస్థలు పనిచేయగలుగుతాయి. దేశంలో నాయకుల సంఖ్య ఎప్పుడూ మితిమీరి లేదు. ఇండియన్ సివిల్ సర్వీసునలెనే కాకలు తీరిన నాయకత్వంకూడా నానాటికీ తగ్గిపోతూవుంటుంది గాని యథాప్రకారము వుండదు. కొత్త నాయకులకు అనుభవం తక్కువ. వారు ప్రజలకు అంతగా తెలియదు. ఆయేటికాయేడు గడచిపోయేకొలది బ్రిటిషువారి హయాంలో ఎన్నిమార్లు జైలుకు వెళ్ళారు? అనే ప్రశ్నతో ఒక నాయకుడి అనుభవాన్ని కొలిచే పద్ధతి అంతరిస్తూవుంది. గ్రామసీమలలో వున్న అవిద్య, అజ్ఞానముల దృష్ట్యా కొత్త గీటురాళ్లు వ్యాప్తిలోనికి రావటం లేదు. గ్రామపంచాయతీలలో తాలూకాబోర్డులలో, జిల్లాబోర్డులలో పదవులలోకి వచ్చే కొత్తనాయకులకు కొన్నిరకాల గీటురాళ్లు వుండవచ్చు. అయితే బ్రిటిషువారి పాలనలోనే ఈ సంస్థలు రెండవశ్రేణిలో, వుండేవి. వీటిని మొదటి శ్రేణి సంస్థలుగా భావించేవారుకారు. స్వాతంత్ర్యం వచ్చినతర్వాత పార్లమెంటు, రాష్ట్రశాసన సభలు అసలురంగాన్ని ఆక్రమించుకున్నాయి. స్థానికసంస్థలకు డబ్బువనరులు తగ్గాయి. ద్రవ్యోల్బణం కారణంగా చిక్కులు, బరువులు పెరిగాయి. స్థానికసంస్థలు తమ సిబ్బందికి నెల

జీతాలే చెల్లించలేని స్థితికి వచ్చాయి. అసలే స్థానికసంస్థల ఉద్యోగులు పనికి అంతంతమాత్రమువారని ప్రతీతి. వాళ్ళ జీతాలూ అంతే. ఈ స్థితిలో ప్రభుత్వయంత్రాంగం విస్తృతం కావడంచేత అది స్థానికసంస్థల సిబ్బందిని కొందరిని తీసుకోగలిగింది. దీనితో వారి సామర్థ్యం మరీ క్షీణించింది. వారిలో వారు తగాదాపడటం తప్ప చేసిందేమీ లేదు. పైగా పదవుల వల్ల వచ్చే పలుకుబడికోసం తదితర లాభాలకోసం నేనంటే నేనని పోటీలు పడటం మొదలైంది. స్నేహభావం పోయి స్వార్థం బలిసింది. ప్రజాసంస్థలన్నీ కీచులాటల కేంద్రాలుగా మారాయి.

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై చాలా బరువు వేశాయి. ప్రజాజీవితంలో ప్రతిదశను పునర్నిర్మించవలసివచ్చింది. అభివృద్ధి పథకాల కన్నిటికీ ధనాన్ని సమకూర్చేందుకు విదేశాలనుండి ధారాళంగా అప్పులు తీసుకోబడ్డవి. దేశంలోని బాధ్యతలతోపాటు దేశము వెలుపలి బాధ్యతలుగూడ పైన పడ్డాయి. ఎట్టి జాప్యమూ లేకుండ పనులు జరగవలసివచ్చింది. అన్ని ప్రాంతాలవారు ఏవేవో పనులు తమతమ ప్రాంతాలలో జరగాలని కోరుతూ వచ్చారు. వాటికి ఆలస్యం కూడదు. జాప్యం అంతకన్నా పనికిరాదు. పాతవ్యవస్థలు పరిపాలన అనే శకటానికి అయిదవ చక్రంగా తయారయ్యాయి. దానితో బండికి ముందునడక కుంటుపడింది. బ్రిటిషువారి పరిపాలనాకాలంలోను దాని తర్వాతను అనేక విషయాలు జరిగాయి. మార్పులువచ్చాయి.

కాని జిల్లాకలెక్టరు హోదామాత్రం చెక్కుచెదరకుండా నిలిచివుంది. కలెక్టరు ఇప్పటికీ జిల్లాకు అధిపతి. కలెక్టరు స్థాయిలోనే ప్రభుత్వంయొక్క శక్తిసోమతలు వ్యక్త మవుతూవుంటాయి. అంటే, కలెక్టరు ప్రభుత్వాధికారానికి ప్రతినిధివంటివాడు. "జిల్లాలో ప్రభుత్వ కార్యక్రమాలన్నింటికి కలెక్టర్ని నేరుగా బాధ్యుడుగా ఎందుకు చేయకూడదు? కొత్త ప్రజాస్వామ్యంలో స్థానికసంస్థలు నేటి కాలానికి పొసగనివిగా కన్పిస్తాయి కదా, వాటిని ఎందుకు రద్దుచేయకూడదు? కలెక్టరు, ఆయన ఉద్యోగిబృందము ప్రజలచే ఎన్నుకోబడ్డ రాష్ట్రప్రభుత్వం క్రింద పనిచేస్తా వుంటారుకదా. జిల్లాబోర్డులను, తాలూకాబోర్డులను రద్దుచేసి నప్పటికీ కలెక్టరుద్వారా జరిగే పరిపాలన ప్రజాస్వామ్య బద్ధమైవుండదా? "అజమాయిషీవిధానము పకడ్‌బందీగా లేక పోయినా, ప్రభుత్వానికీ, ప్రజలకూ మధ్య దూరం ఎక్కువైనప్పటికీ, అది ప్రజాస్వామ్యబద్ధమయ్యే వుంటుంది" అని రాష్ట్రాలలోని మన నాయకులు భావించారు. అధికార యంత్రాంగం ఈ భ్రమను హెచ్చింపజేసింది. ప్రతిరాష్ట్రంలోనూ జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు రద్దుచేయబడ్డవి. ఇక గ్రామాలలో మిగిలింది పంచాయతీలు మాత్రమే. ఈ పంచాయతీలు ఒకవైపు తమ దర్బారులను జరుపుకొంటూ మరొకవైపు న్యాయాన్యాయాలు చూస్తూ కాలం గడుపుకు వస్తున్నాయి. అభివృద్ధి వ్యవహారాలను జరిపిస్తూ వాటి పాలనను నిర్వహిస్తూ, నమ్మదగిన ప్రభుత్వఏజన్సీద్వారా

సౌకర్యాన్నిబట్టి నడిపింపజేయటం బహు సులభంగానే వుంటుంది.

గతవిభాగంలో వివరింపబడ్డ కేంద్రవిశేషాలురాష్ట్రాలలో కూడా కనిపించడం మొదలుపెట్టాయి. జిల్లాబోర్డులు, తాలూకా బోర్డులురద్దుకావడంతో రాష్ట్రప్రభుత్వాలు ఇతోధిక బాధ్యతలనువహింప వలసివచ్చింది. బాధ్యతలు ఎక్కువయ్యేసరికి దానికి తగినట్లుగా ప్రభుత్వ వ్యవస్థను విస్తృతీకరింపవలసి వచ్చింది. పై అధికారుల సంఖ్యను హెచ్చించడ మనేది కొత్త శాఖలను సృష్టించకుండా, కొత్త మంత్రులను, డిప్యూటీమంత్రులను, పార్లమెంటరీ కార్యదర్శులను వేయకుండా జరిగే పని కాదు. ఇలా ఈ రంగుల రాట్నాన్ని విస్తృతం చేసేకొద్దీ వారంతా పదవికి సంబంధించిన వ్యాపకాలలో పడి ప్రజలకు దూరమై పోతారు. పని నానాటికీ మందకొడిగా సాగుతూవుంటుంది. పని చురుకుగా జరగాలంటే కొత్తపద్ధతులను ప్రవేశపెట్టాలి. కొత్త ప్రయోగాలు చేయాలి. కొత్త శాఖలను సృష్టించాలి. కొంతమందికి అప్పటికప్పుడు ప్రమోషనులు ఇవ్వాలి. స్తోమత గల కలెక్టర్లు కమీషన ర్లవుతారు. సబ్ డివిజనల్ ఆఫీసర్లు కలెక్టర్లుగా వస్తారు. రాష్ట్రరాజధాని బలిసిపోతుంది. కండరములు లావెక్కుతాయి. రక్తనాళములు మరీ కుంచించుకుపోయి రక్తం ప్రవహించడం కష్టతర మౌతుంది. దానితో గుండె జబ్బు వస్తుంది. అదే రానున్న దుస్థితికి సూచన.

---

# 4. దేశవిషయాలు

కలెక్టరు ఆఫీసు

ఇక ఇంటిదగ్గర సంగతులు ఎలా వుంటాయో చూద్దాము. రద్దుచేయబడిన జిల్లాబోర్డులు, తాలూకా బోర్డులు నేరుగా కలెక్టరు అధికారం క్రిందికి వస్తాయి. ఈ విధంగా రాష్ట్రరాజధానిబలుపు జిల్లాదాకా ప్రాకుతుంది. మన పురావస్తువిశేషాలనుగూర్చి, పంచవర్ష ప్రణాళికలను గూర్చి, అభివృద్ధినిగూర్చి జరుగుతూవున్న ప్రచారాన్ని గమనించి విదేశాలనుండి ప్రముఖవ్యక్తులు కేంద్ర, రాష్ట్రరాజధానులకు రావడం మొదలుపెడతారు. ఈ ప్రముఖులందరికీ జిల్లాకలెక్టరు స్వాగతం చెప్పాలి. వారితో కలిసి ఆయన వూళ్ళు తిరగాలి. వచ్చిన ప్రముఖులకు జరిగిన స్వాగతసత్కారాలనుబట్టి కలెక్టరు సామర్థ్యం నిర్ణయింపబడుతుంది. ఈ వ్యవహారాలన్నింటిలో కలెక్టరు ఉత్తేజకుడుగా వ్యవహరించాలి. ఇక సమయం దొరికితే 'నువ్వెంత' అని ధిక్కరించే రాజకీయనాయకులు వుండనే వుంటారు. వారిని ఏదో వ్యాపకంలో వుంచాలి. లేదా కనీసం వారు కొంటెపనులు చేయ

కుండానైనా చూడాలి. జిల్లాకలెక్టర్లకు 'ప్రముఖవ్యక్తుల' తోనే, 'ముఖ్యరాజకీయనాయకుల'తోనే చాలా సమయం గడచిపోతుంది. ఇవిగాక కలెక్టరు 'జిల్లాకార్యక్రమానికి సమన్వయాధికారి' అన్న అదనపుబాధ్యతనుకూడా మనం ఆయనకే అప్పగిస్తున్నాము. మరి జిల్లాబోర్డులు, తాలూకా బోర్డులు లేవుకదా! అవి మోయవలసిన బాధ్యతలనుకూడా కలెక్టరే తనమీద వేసుకోవలసివస్తుంది. రాష్ట్రాల శాఖలకు వాటివాటి ప్రతినిధులుగా వ్యవహరించే ఆఫీసర్లు వుండరు. రాష్ట్రరాజధానులలో వివిధశాఖల మధ్య తప్పనిసరిగా సమన్వయం వుంటుందన్న పూచీ యేమీ లేదు. మంత్రులమధ్య, శాఖలమధ్య విధిగా యేకాభిప్రాయం వుంటుందని చెప్పలేము. అభిప్రాయభేదాలు పెద్దగా కలిగి 'నువ్వేం చేశావు?' అంటే 'నువ్వెంత' అనుకునే సందర్భాలు వుండకపోవు. పైస్థాయిలో సమన్వయం లేకపోయ్యేసరికి జిల్లాకలెక్టరుపాత్ర మరీ చిక్కులతో కూడుకున్న దవుతుంది.

ఆఫీసర్లు తగు అనుభవం గడించి యోగ్యులు కాక మునుపే వారిని కలెక్టరుగా తరచు నియమించడం జరుగుతున్నదేమో! పరిపాలనాయంత్రం విస్తరించిపోతూవుండడం వల్ల, పరిశ్రమలలో ప్రభుత్వరంగం త్వరితగతిని విస్తృతి జెందుతున్నందువల్ల ప్రభుత్వోద్యోగులకు ఎక్కడ లేని గిరాకీ వచ్చింది. ఏ పదవికైనా నియమించడానికి అధికార్లు ఎక్కడ లభిస్తారా అని వెదకడం జరుగుతూవుంది. పూర్వం కలెక్టర్లకు ఎటువంటి అనుభవం వుండేదో ఈనాటి కలెక్టర్లకు అది లేదు. పైగా పైస్థాయిలోనూ, తమ స్థాయిలోనూ సమ

న్వయం లేకపోవడ మనే సమస్య అప్పటివారిని ఎదుర్కొనేది కాదు. మరి ఈనాటివారి కది ప్రబలమైన సమస్య! ఈనాడు ప్రజలు ప్రభుత్వానికి భయపడరు. ప్రభుత్వం అన్నివిధాలా ప్రజలకు సహాయపడవలె నని వారు అభిలషిస్తారు. రకరకాల సమస్యలతో కలెక్టరును కలుసుకొని వాటన్నిటినీ పరిష్కరించ మంటారు. ఇప్పుడు కలెక్టరు ప్రజాసేవకు డని మనం అంటు న్నాము. ఆయన ఇప్పుడు ప్రజలకు దూరంగా ఒంటిస్తంభం మేడలో కూర్చొని వ్యవహరించడానికి వీలులేదు. యోగ్యు డైన కలెక్టరు తన నెదుర్కొన్న సమస్యలను ధైర్యంగా పరిష్కరించడానికి ప్రయత్నిస్తాడు. తానూ జిల్లాలోని ప్రజా నాయకత్వమునకు బాసటగా నిలిచి ప్రజాశ్రేయస్సుకు పాటు పడతాడు. తన ఉద్యోగధర్మాన్ని నిర్వర్తించడానికై ఉదయం మొదలు అర్ధరాత్రివరకూ అనేకసమస్యలతో సతమతమవు తాడు. పాపం, ఆయనకు కుటుంబజీవితానుభవమే సరిగా వుండదు. భార్యాపిల్లలతో కాలక్షేపం చేయడానికి వ్యవధి యేది? ప్రభుత్వంయొక్క కార్యనిర్వహణాధికారం, దాని పూర్తిశక్తితో, దానికి గల పరిమితులలో వ్యక్తమయ్యే పదవి యేదీ అంటే జిల్లాకలెక్టరుపదవేనని చెప్పాలి. కలెక్టరు యే ఒక్క బాధ్యతనూ తప్పించుకోవడానికి వీలులేదు. ఏదో సాకుచెప్పి విషయాన్ని దాటివేయజాలలేడు. కష్టనిష్ఠూరాల నన్నిటినీ సహించి అతడు తన ఉద్యోగబాధ్యతలను నిర్వ హించవలసిందే!

పని సరిగా చేయని కలెక్టరుకు బెడద లేమీ వుండవు. ఎవరితో ఎలా స్నేహితం చేసుకోవాలో అతనికి తెలుసు.

తాను ఎవరిని బలపరచాలో, తన కేవరు వత్తాసు ఇస్తారో అతనికి తెలిసే వుంటుంది. ఉత్తముడైన కలెక్టరు తన అధికారాన్ని కొంత ప్రజలుకూడా పంచుకోవాలని ఉత్సహిస్తాడు. అతనొక్కడే చెలాయించడు. కాని చెడ్డ కలెక్టరు తాను ఎక్కడ, ఏవిధంగా దొరికిపోతానో అని భయపడతాడు. ఉత్తముడైన కలెక్టరు ప్రజలనుంచి తన అధికారబలాన్ని పొందుతాడు. తన సత్ప్రవర్తనతో, సేవాభావంతో వారి ఆదరాభిమానములకు పాత్రుడై చక్కని అధికారి అనిపించుకుంటాడు. చెడ్డ కలెక్టరుకు అధికారం మరొకవిధంగా సంక్రమిస్తుంది. అయితే ప్రజలలో కలుగుతూవున్న చైతన్యం పుణ్యమా అని ఇలాంటి అధికారుల సంఖ్య క్రమేణా తగ్గుతూ వుంది. పూర్వం క్రింది ఉద్యోగస్థులే బండెడు చాకిరీ చేసేవారు. పై అధికార్లు టెన్నిసుకోర్టులలో, ఆ తర్వాత క్లబ్బులలో పానీయాలతో కాలక్షేపం చేసేవారు. క్రింది ఉద్యోగుల విధి పనిచేయడమే! కాని పూర్వపు క్రమశిక్షణ ఈనాడు కానరాదు. కొత్త క్రమశిక్షణ ఇంకా రూపుదిద్దుకొనవలసి వున్నది. సంధికాలం గనుక శూన్యస్థితి యేర్పడివుంది. కలెక్టరు జీతానికీ, ఆయన సిబ్బంది జీతానికీ మధ్య తేడా చాలా హెచ్చుగా వుంది. కాబట్టే పరస్పర అవగాహన, అంతా ఒక జట్టుగా పనిచేసే ధోరణి కన్పించవు. ఉత్తముడైన కలెక్టరు తన పరిసరాలకు, చివరకు కుటుంబానికి కూడా దూరమై ఉద్యోగబాధ్యతలను హెచ్చుగా వహిస్తూవుంటాడు. ఏదో ఆషామాషీగా కాలం వెళ్ళబుచ్చేవాడు రాజకీయాలలోను, పరిపాలనలోను గట్టిగా మాట్లాడి ఎదురుచెప్పగల వారికి

నాయకుడై వ్యవహరిస్తూ వుంటాడు. కేంద్రము ఆరోజు కారోజు రాష్ట్రంపై హెచ్చుబరువు వేస్తూ పోతూవుంటుంది. రాష్ట్రప్రభుత్వం ఆబరువును కలెక్టరుమీదికి తోస్తూవుంటుంది. పాపం, కలెక్టరు దానిని ఎవరిమీదికి తోయగలడు? ఆ భారంతో ఇంకా పెద్దగా మూలుగుతూవుంటారు.

తాశీల్దారు రాజ్యం

కొన్నేండ్లక్రిందట నేను ఒక రాష్ట్రంలో కొండజాతి ప్రజలు వుండే ప్రాంతాన్ని చూడడానికి వెళ్ళాను. మన కార్యకర్తల నీతి, నిజాయతీలనుగూర్చి వా ళ్ళేమనుకుంటున్నారో వాళ్ళ ముఖతానే వినాలని నిశ్చయించాను. సిబ్బందివిషయంలో వారి అభిప్రాయాలనుకూడా తెలుసుకోవాలనుకున్నాను. రోడ్డుప్రక్క నేవున్న ఒక పెద్దగ్రామానికి వెళ్ళి ఆగ్రామ ముఖ్యుని (పంచాయతీ ప్రెసిడెంటు) కలుసుకున్నాను. పరిసర గ్రామాల పంచాయతీ ప్రెసిడెంట్లను కూడా అక్కడికి రప్పించవలసిందని నేను ఆయనను కోరాను. "నేను వారితో అరమర లేకుండ అన్నివిషయాలూ మాట్లాడదలచుకున్నాను" అని చెప్పాను. ప్రెసిడెం ట్లందరూ వచ్చారు. మా సమావేశం పంచాయతీఘర్ (పంచాయతీ బోర్డు ఆఫీసు)లో జరిగింది. సామాజికాభివృద్ధి కార్యకర్తల నిజాయతీని గూర్చి వారు ఏమనుకుంటున్నదీ దాపరికం లేకుండా చెప్పండని నేను వారిని కోరాను. కార్యకర్తలు నిజాయతీ గలవారే అని అంతా ఏక కంఠంతో చెప్పారు. అయితే వారిని చూస్తూవుంటే వారి

ముఖాలలో ఏదో బాధ దాగి వున్నట్లు అనిపించింది. నాకు ఆశ్చర్యం కలిగింది. ఏమిటో అర్థం కాలేదు. "ఏమిటి అలా వున్నారు?" అని అడిగాను. గుచ్చి అడిగినమీదట కాసేపు తటపటాయించి వారి మనస్సులో వున్న మాట చెప్పారు. తక్కావీ అప్పు లిచ్చే పనిని బ్లాకు ఉద్యోగులకు అప్పగించా లని వారు కోరారు. తాశీల్దారుగారితో తాము వేగలేకుండా వున్నామనీ, ఆయనతో తమకు పని పడకుండా చేయాలనీ అన్నారు. ఆ తరువాత ఇదేమిటా అని విచారించగా ఆ ప్రాంతపు తాశీల్దారు రైతుల నద్దనుంచి రూ 100 లకు రశీదు తీసుకొని రూ 80 లే వారి కిస్తాడని తెలియ నచ్చింది. అలాగే మళ్ళీ రైతులు అప్పు చెల్లించేటప్పుడు రూ 100 లకు రశీదు యిచ్చి వారినుంచి రూ 110 లు తీసుకునే వాడట. దీనికి నివారణోపాయం లేకపోయిందట. రైతులు చెబుతున్న మాట నిజమేనా అని నేను డెవలప్ మెంటు కమీషనరును, కలెక్టరును అడిగాను. కొంతైనా నిజం లేకుండా వుండదని వారు అన్నారు. మరి అయితే నివారణోపాయం లేకపోవడ మేమిటి? సర్వీసులో వున్న దుష్టులు ప్రత్యక్షంగానో, లేక పరోక్షంగానో పైన ప్రాబల్యం గల వారితో సంబంధం కలిగివుంటారని తెలియ వచ్చింది. మొత్తం పరిస్థితిని క్షాళనం చేస్తే తప్ప, లేకపోతే ఆ స్థితిని మార్చడం అసాధ్యం.

తాశీల్దారు, రెవిన్యూ సిబ్బంది మాత్రమే చెడ్డవారనీ, సామాజికాభివృద్ధి సిబ్బంది కేవలం సజ్జనులనీ నేను చెప్పడం లేదు. అదే రాష్ట్రంలో సామాజికాభివృద్ధి సిబ్బందికి రెవిన్యూ బాధ్యతలు అప్పగించబడగా బ్లాకు సిబ్బందిలో చాలా మంది

తాశీల్దారుగారి అడుగు జాడలలో నడవటానికి అలవాటు పడి నట్లు తెలియ వచ్చింది. ఏ శాఖ సిబ్బంది అయినా భారత దేశ ప్రజలలోనుంచి భర్తీ చేయబడతారుగాని ఎక్కడో పై దేశాలనుంచి రారు కదా. అంటే వారూ ఇక్కడి మామూలు మనుషులే నన్నమాట. ఉద్యోగమునుబట్టి, అవకాశాలనుబట్టి పనిలో నీతి నిజాయతీలు, దుర్నడతలు వుంటాయి. మంచీ, చెడూ అందరిలో ఎట్లా వున్నాయో, సామాజికాభివృద్ధి సిబ్బందిలో కూడా అంతే. అయితే ప్రజాశ్రేయస్సును గమనించి, తదనుగుణంగా సేవచేసే రీతిని వారికి విస్తరణ కార్యక్రమంలో తగు శిక్షణ యివ్వబడింది. అందుచేత కాలం గడిచే కొద్దీ వారిలో విస్తరణ కార్యక్రమదృక్పథం పెంపొందుతూ వుంది. ఈ సిబ్బంది సర్వత్రా ప్రజాభిప్రాయపు వత్తిడికి లోనవుతూ ప్రజల అవసరాలను తెలుసుకుంటూ వుంటారు. దాదాపు ఒకే హోదాకు చెందిన అనేకమంది ఆఫీసర్లు కలసి మెలసి పనిచేయడ మనే సమస్య కూడా మనకు వుంది. ఒకరి కొకరు సన్నిహితులై అలా పనిచేస్తున్నారు కూడా. జాగరూకత వుంది. ఒక జట్టుగా పనిచేసే ధోరణి వుంది. ప్రజానీకానికి దైవభీతితోపాటు మూకవత్తిడి కూడా వుంటేనేగాని దేవునిపై గురి ప్రబలంగా వుండదు. తాశీల్దార్లు ప్రజలకు దూరంగా వుండి తమ విధులను నిర్వహిస్తూ వుంటారు. వారికి సంపూర్ణాధికారాలు వున్నవి. ఏమి చేసినా చెల్లుబాటు అవుతుంది. ఆ స్థితిలో అనేక ఆకర్షణలు ప్రలోభ పెట్టుతాయి.

ఆ వ్యక్తి నిరంకుశుడైతే అతన్ని అదుపులో పెట్టేవారే వుండరు. పైగా పై అధికారులు తనిఖీలకూ, పర్యటనలకూ

వచ్చినప్పుడు వారికి భోజన భాజనాదులు ఏర్పాటు చేయవలసి వుంటుంది. వీటికి సరఫరాలు చేసేవారు రైతులే. అటువంటప్పుడు తాశీల్దారుగారు తనకూ ఒక మంచి వాటా కోరడంలో ఆశ్చర్య మేమి వుంటుంది? అక్రమంగా లంచమే తీసుకోనక్కరలేదు. రైతులు సంతోషంగానే ఏవో కానుకలు తెచ్చి ఇస్తూనే వుంటారు!

ఈ సందర్భంలో నాకు మరొక సంఘటన జ్ఞప్తికి వస్తూ వుంది. నేను మన భారత దేశంలోనే భూమిచట్టం అమలులోకి వచ్చిన ఒక ప్రాంతాన్ని సందర్శించాను. అక్కడ అప్పుడే కొత్తగా నియమింపబడిన కలెక్టరు వచ్చి పదవిలో చేరాడట. సరే, మేము ఒక గ్రామానికి వెళ్ళాము. అక్కడ గ్రామస్థులను చూస్తే మాఅందరిమీదాతిరగబడేటట్టువున్నారు. వారంతా కౌలుదార్లూ, పాలివాళ్ళూనట! ఆ ప్రాంతపు భూస్వాములు కొత్తగా అమలులోకి వచ్చిన కౌలుదారీ చట్టాన్ని మన్నించక, కౌలుదార్లనుండి, పాలివాళ్ళనుండి తాము పొందిన డబ్బుకు, పంటకు తగు రశీదులు ఇవ్వక చట్టాన్ని ఏ విధంగానైనా ఎదిరించవలె ననే ప్రయత్నంలో వున్నారట. అది నిజమేనా అని నేను కలెక్టర్ని అడిగాను. ఆయన అవునన్నాడు. "ఆ జిల్లాకు అతను ప్రభుత్వ ముఖ్య ప్రతినిధి కదా. ఆయన జోక్యం కల్పించుకొని పరిస్థితిని ఎందుకు చక్కబెట్టలేదు?" అని నాలో నేనే అనుకున్నాను. విచారించగా తేలిం దేమిటంటే ఆ ప్రాంతపు పట్వారీలు, రెవిన్యూ ఉద్యోగులు, తాశీల్దార్లూ భూస్వాములకు అనుసర పక్షంగా వుంటారట. భూస్వాములకు పైన వుండే రాజకీయనాయకు

లంతా బాగా పరిచయమైన వాళ్ళట. చూడగా ఇది కందిరీగల గూడులాగ వుందని కలెక్టరు అన్నాడు. అక్కడి పరిస్థితిని బాగుచేయాలని ఆయన ప్రయత్నించా డంటే అతని పదవికి ముప్పు వస్తుంది. పోనీ, వస్తే వచ్చిందని అతను ధైర్యం చేసినా, పరిస్థితి బాగుపడుతుందన్న నమ్మకం లేదు. ప్రజాహిత జీవితంలో ప్రముఖుడైన ఒకాయనకు ఒక ఎస్టేటు వుంది. ఆయన పట్వారీకి యేటా చెల్లించ వలసిన మామూళ్ళు రెండేండ్ల వరకూ చెల్లించలేదు. ఆ కసితో పట్వారీ అతని భూములకు సంబంధించిన రికార్డులను తారుమారు చేశాడట. దానితో అతని భూముల వ్యవహారమంతా కోర్టుకు ఎక్కిందట. మామూలు పట్వారీ ఎంత పని చేశాడో చూడండి!

మరొక రాష్ట్రంలో గ్రామ అడవుల స్థాపన విషయమై పంచాయతీలు, పంచాయతీసమితి ఒక ఒప్పందం చేసుకొన్నాయట. ఐతే గ్రామంలో అందరికీ చెందిన సమిష్టిభూముల హద్దులు తేల్చనిదే అడవిని ఎలా పెంచుతారు? గ్రామరికార్డులు పట్వారీదగ్గర వుంటాయి. అంటే ఆ ఒప్పందం అమలు జరగాలంటే పట్వారీ సుముఖుడు కావాలి. లేకపోతే అది అమలు జరగదు. పట్వారీ, రెవిన్యూఇనస్పెక్టరు, డిప్యూటీ తాశీల్దార్లు, తాశీల్దారు—వీళ్ళంతా కలిసి అధికారకూటమి. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి పదహారేండ్లు అవుతున్నాయి. కాని ఈ అధికారకూటమికి స్వాతంత్ర్యసందేశము చేరినట్లు లేదు. ఇది పూర్తిగా వారి తప్పు కాదు. భూస్వామి వ్యవస్థచిహ్నాలు ఇంకా మిగిలివున్నాయి. మనం ఢిల్లీలో కూర్చుని, లేదా రాష్ట్రరాజధానులలో కూర్చొని

భూసంస్కరణలనుగూర్చి మాట్లాడుతూ వుంటాము. కానీ భూస్వాములకు, రెవిన్యూ ఉద్యోగులకు గల పొత్తును నిర్మూలించలేము. వారు తమ అవకాశాలను పోగొట్టుకోరు. వాటిని నిలబెట్టుకోడానికి శతవిధాల ప్రయత్నిస్తారు. వారు ఒంటరిగాళ్ళు కారు. ఒకణ్ణి కదిలిస్తే అతనివెనక రెండువేల యేండ్లవరకు వున్నవాళ్ళంతా మనం తలపెట్టిన పనిని దుస్సాధ్యం చేస్తారు.

సామాన్యమానవునికి శాసనం

నేను ఒకప్పుడు నిర్మాణంలో వున్న పునరావాసనగరానికి పాలకాధికారిగా వుండేవాణ్ణి. ఒక అర్ధరాత్రి ఎవరో నావద్దకు వచ్చి ఒక లోవరుడివిజనుగుమాస్తా ఆ కేంద్రానికి చెందిన కొత్త కుర్చీని తీసుకొని అక్కడి స్టేషనులో రైలు ఎక్కబోతున్నట్లు తెలియజేశారు. కాలనీచౌకీదారు అతన్ని పట్టుకున్నాడు. కాలనీలో వుండే ఇద్దరు ముగ్గురు వ్యక్తులు సాక్షులుగా వున్నారు. నాకు ఆ మనిషితో ముఖపరిచయమైనా లేదు. నేను ఆ కేసును కోర్టుకు పంపాను. ఏడాది తర్వాత కోర్టువారు అతనిపై కేసును కొట్టివేశారు. ప్రభుత్వం అతనికి జీతంతాలూకు బకాయీలను నష్టపరిహారంతో సహా చెల్లించవలసివచ్చింది. పైగా కాలనీఅధికారిని మందలించడంకూడ నాకు జ్ఞాపకం. పట్టుబడ్డ వ్యక్తిమామతో కాలనీఅధికారి ఒకప్పుడు తగాదాపడ్డాడనీ, ఆ కక్ష తీర్చుకోడానికి అతనిపై ఆ కేసు బనాయించారనీ అతని తరఫు ప్లీడర్లు వాదించారు.

ఆ వ్యక్తి జిల్లాపోలీసుసూపర్నెంటుకు బంధువుకూడానట. పోలీసులు కొన్నిమైళ్ళ దూరములో వున్న ఒక తావున సరిగ్గా అలాంటి కుర్చీయే అంతకు క్రితము అమ్మబడినట్లు బిల్లు దాఖలుచేశారు.

మరొక రాష్ట్రంలో నేను పర్యటన చేస్తూవుండగా గ్రామస్థులు ఎలెక్ట్రిసిటీబిల్లులు చెల్లించేటప్పుడు వారిని ఉద్యోగులు నానాతిప్పలు పెడుతున్నట్లు నాకు తెలియవచ్చింది. బిల్లులు తీసుకునే గుమాస్తాకు కొంత ముట్టజెప్పితే సరి, లేకపోతే వారిని రోజులతరబడి నిలబడి వేచివుండేటట్లు చేస్తున్నారని తెలిసింది. రైతు తన గ్రామంనుంచి కొన్నిమైళ్ళు నడచి బస్తీలో వున్న ఎలెక్ట్రిసిటీ ఆఫీసుకు పోవాలి. అతనికి బస్తీలో ఎవరూ తెలియరు. నడచిపోవడంవంటి బెడదలు అలా వుండనిచ్చి అతను ఒకరోజు వుండటానికి డబ్బుఖర్చు అవుతుంది కదా. పైగా ఎంతో అసౌకర్యం అనుభవించాలి. బిల్లు క్లర్కుకు ఈ కష్టసుఖాలన్నీ తెలుసు. తెలుసు కాబట్టే ఎంతో కొంత వసుపుకోవడానికి అదే తగిన సమయమని కాచుకు కూచుంటారు. ఈ పరిస్థితిని నివారించ సాధ్యంకావడం లేదని ఎలెక్ట్రిసిటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నాతో చెప్పాడు. ఉద్యోగులు ప్రజలను ఇలా బాధలుపెడుతున్నారనిగాని, లేదా అక్రమంగా మామూళ్లు పుచ్చుకుంటున్నారనిగాని కోర్టులో రుజువుచేయడం అసాధ్య మవుతుందట. పోనీ డిపార్టుమెంటు ద్వారా చర్యతీసుకుందా మంటే బిల్లు క్లర్కుకు పైవాళ్ళు అందరూ అనుకూలురే! మరి ఇక చెప్పండుమాటలు ఆధారంగా ఏ మంత్రి అయినా ఏమిచర్య తీసుకోగలుగుతాడు?

ఫీజు ఇచ్చి ప్లీడర్లను పెట్టుకొంటేనేగాని కోర్టులో కేసు నడపడానికి వీలులేదు. శాసనసంబంధమైన కేసులు ఒక పట్టాన తెగవు. సాక్ష్యాలతోనే కొన్ని నెలలు గడచిపోతాయి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఒక్కొక్క కేసు పరిష్కారం కావడానికి మరీ ఆలస్యమవుతూవుంది. లాయర్లు అనేసరికి బోలెడు డబ్బు పొయ్యాలి. వారు తిమ్మిని బమ్మి చేయగలరు; బమ్మిని తిమ్మి చేయగలరు. జూనియర్ లాయరుకంటె సీనియర్ లాయరు తెలివికలవాడు. బస్తీలాయరుకంటె రాజధానిలో వుండే బారిష్టరు మరీ గొప్పవాడు. ఈ గొడవ లన్నీ పాపం, గ్రామస్థుడి కేమి ఎరుక? లాకోర్టులు వుండే బస్తీలకు వెడితే అతనికి తల దాచుకోవడానికి చోటు దొరకదు. పొలం పనులతోనే అతనికి సరిపోతుంది. కోర్టులచుట్టూ తిరగడానికి తీరిక యెక్కడిది? ఒకమారు ఒక ముసలమ్మ డ్యూటీపై వున్న పోలీసు వారిస్తున్నా వినకుండా పిటీషను పట్టుకొని మంత్రి దగ్గరికి పరుగెత్తుకునచ్చింది. ఆమెభర్తకు చెందిన పొలాన్ని పలుకుబడి గల మరొక వ్యక్తి ఎవరో జబర్దస్తీగా ఆక్రమించుకొని సేద్యం చేసుకున్నాడట. కోర్టులో కేసు నడుస్తూవుందట. ఈలోగా ఆమెభర్త చనిపొయ్యాడు. పిల్లలు పొయ్యారు. ఇరవై యేండ్లనుంచీ ఆ ముసలవ్వ అలా బ్రతుకుతూవస్తూంది. అయినా ఆ కేసు ఇంకా విచారణలోనే వుందట! కేంద్ర ప్రభుత్వమంత్రి ఒకాయన ఆ ప్రాంతానికి వస్తున్నట్లు ఆమెకు తెలిసింది. మంత్రి ఏమైనా చెయ్యగలడని ఆమె అనుకుంటుందంటే అందులో బేసబబు ఏమైనా వుందా? "అమ్మా, నీ వెంత నిస్సహాయురాలివో, నేనూ అంతే నిస్సహాయుడను.

ఈ విషయంలో నేనేమీ చేయలేను,'' అని సమాధానం చెబితే ఆమె నిరాశతో క్రుంగిపోక యేమి చేస్తుంది?

లాయర్ల ఫీజులవల్ల కోర్టులలో కేసులు యేళ్ళతరబడి నడుస్తూవుండడంచేత రైతులు సర్వనాశనమవుతున్నారు. క్రిమినల్ కేసులైతే పోలీసులు వస్తారు. న్యాయపంచాయతీలలో ముఠాలు, పార్టీలు హెచ్చు. వీటికి పైవాటితో సంబంధం లేకపోవడంచేత, పైనుంచి యేవిధమైన పర్యవేక్షణా వుండనందువల్ల అవి అన్యాయపంచాయతీలుగా వ్యవహరిస్తున్నవి. సమాజంలో సాంఘికసఖ్యత లేకుండా చేస్తూవున్నవి. మన లాయర్లు తెలివితేటలలో ప్రపంచంలో ఎవ్వరికీ తీసిపోరు. మన న్యాయవ్యవస్థకూడా ఉత్తమమైనదే. కాని ఆ వ్యవస్థ అలా గంభీరంగా వుండి, న్యాయం చెప్పడంలో జాప్యంచేస్తూ హెచ్చుఖర్చుకు కూడా ఆస్కారం కలిగిస్తున్నందువల్ల మనం విచారించవలసివస్తున్నది. కేసులను త్వరగా పరిష్కారంచేయవలసిన ఆవశ్యకతను గమనించాలి. ఇంకా విక్టోరియాకాలం నాటి వ్యవధి కావాలంటే ఎలా? మనం ఉపగ్రహాలయుగంలో వున్నాము. ప్రపంచంతోపాటు మనమూ పురోగమించవలెనని ప్రయత్నిస్తున్నాము. శాంతి, సఖ్యత మన లక్ష్యం కావాలంటే ఈ వైరుధ్యాలు ఒకదాని సరసన ఒకటి వుండలేవు. న్యాయం చెప్పడంలో ప్రజలు భరించలేని ఖర్చులు, వారు తూగలేని కాలహరణం జరుగుతున్నపుడు ప్రజాస్వామ్యం మనగలుగుతుందా?

---

# 5. వైరుధ్యంలో విచిత్రం

విదేశాలలో విపత్తు

**1914**నుంచి 1918 వరకు మొదటి ప్రపంచయుద్ధం, 1939 నుంచి 1945వరకు రెండవ ప్రపంచయుద్ధం జరిగాయి. ప్రపంచం మొత్తం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆ యుద్ధంలో చిక్కుకుంది. కోట్లకొద్ది జనం చనిపొయ్యారు. ఇళ్ళు, వాకిళ్ళు, ఫ్యాక్టరీలు, యంత్రాగారాలు తిరిగి బాగు పరచడానికి వీలులేకుండా ధ్వంసమైపొయ్యాయి. ఇక నస్తు నష్టం కొన్నివేల కోట్లకు పైగా వుండవచ్చు. ఈ నష్టాలన్నిటిని భర్తీచేయడానికి ఎంతో పెట్టుబడి పెట్టవలసివచ్చింది. ఎన్నో త్యాగాలు చేయవలసి వచ్చింది. ఆ డబ్బును వాటికిగాక ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణానికి వినియోగం చేస్తే మానవాళికి శ్రేయస్సు సమకూరేది. దారిద్ర్యం, పేదరికం, అవిద్య, అజ్ఞానం, రోగాలు, జాడ్యాలు నిర్మూలింపబడేవి. అంతేగాక మానవ ధర్మములకు అంత కీడు కలిగివుండేది కాదు. యుద్ధాన్ని శాశ్వతంగా మాపుమాపడానికే మొదటి ప్రపంచయుద్ధం చేయ

బడింది. 1918లో సంధి జరిగినప్పటికీ యుద్ధంమాత్రం అంతం కాలేదు. మొదటి ప్రపంచయుద్ధం తరువాయే రెండవ ప్రపంచయుద్ధం. అది ఇంకా సాగుతూనేవుంది!

ప్రపంచంలో అమెరికా మిక్కిలి సంపన్నమైన దేశమని మన మెరుగుదుము. నేటికి మూడు వందల యేండ్లక్రితం ఆ ఉపఖండమంతా పెద్ద అడవి. కొలంబసు ఇండియాకు వెడదామని బయలుదేరాడు. కాని అనుకోకుండా అమెరికాను కనుగొన్నాడు. అంతకు ముందు అమెరికా ఖండ మొకటి వుందన్న సంగతి తెలియదు. కొలంబసు కనుగొన్న తర్వాత యూరపు నుంచి కార్యదకత గల కొందరు ప్రజలు ఆ నూత్నప్రపంచానికి వలసపోవడం మొదలుపెట్టారు. అక్కడే స్థిరపడి చెమటోడ్చి కష్టించారు. అక్కడి నైసర్గికస్థితికీ, వాతావరణానికీ తట్టుకొని నిలిచారు. తమ నిర్మాణకార్యాలలో-ముఖ్యంగా కూలీలు చేయవలసినటువంటి కష్టమైన పనులను బలాఢ్యులైన ఆఫ్రికనులచేత చేయించారు. వీరి కృషి మూలంగా నేడు అమెరికా సంయుక్త రాష్ట్రాలు అనబడే నవప్రపంచం రూపొందింది. ఈ నవప్రపంచంవారు పాత ప్రపంచంవారి కలహాలలో, జగడాలలో కాలం వ్యర్థపుచ్చదలచుకోలేదు. వారు ఇతర దేశాలతో వ్యాపారసంబంధాలుకూడా పెట్టుకోదలచలేదు. తమకు తాము విడిగా వుండి, సంపదను పెంపొందించుకున్నారు. పాత ప్రపంచాన్ని దూరంగా వుంచారు. ఆ ప్రపంచంనుండి వస్తువులు దిగుమతికాకుండా సుంకాలు, విధినిషేధాలనే గోడలుకట్టారు. అవాంఛనీయమైన వ్యక్తులెవరూ కొత్త ప్రపంచంలోకి రాకుండా, ముఖ్యంగా ఆకలితో

పొట్ట చేతబట్టుకొని వచ్చేవారెవరూ రాకుండా వలసచట్టాలు అమలులోకి తెచ్చారు.

కాని ఆవిరితో నడిచే ఇంజను తయారైంది. విమానాలు కూడా త్వరలోనే రానున్న వని తెలిసిపోయింది. వీటన్నిటితో ప్రపంచం కుంచించుకుపోయింది. ఏదీ దూరమనిపించడం లేదు. ప్రపంచమంతా దగ్గరకు వచ్చినట్లయింది. మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. యూరపులో శక్తివంతమైన దేశాలు ఒక దానితో ఒకటి తలపడ్డాయి. వలసదేశంలోని సిరిసంపదలపై కూడా కన్నుపడింది. పోటీలు, కావేషాలు హెచ్చాయి. నవ ప్రపంచం ఇక తనకు పట్టనట్లు వైదొలగి వుండలేకపోయింది. ఆ పోరు నవప్రపంచానికి కూడా వ్యాపిస్తుందని తెలిసి పోయింది. క్రిమి వ్యాపిస్తే చాలు,జాడ్యాలు మొదలవుతాయి. తన కిష్టం లేకపోయినప్పటికీ నవప్రపంచం ఆ యుద్ధంలో ప్రవేశించవలసి వచ్చింది. వారి జనసత్త్వాలు, శక్తిసామర్థ్యాలు యుద్ధాన్ని ఒక కొలికికి తెచ్చాయి. జర్మనీ ఓడిపోయింది. జర్మనీదేశంనుంచి విపరీతమైన నష్టపరిహారాలు కోరారు. నానాజాతిసమితి సృష్టింపబడింది. ప్రపంచంలో హెచ్చు భాగాలను తమ బలదర్పములతో పాలించే రాజ్యాలవారే ఆ సమితిలో చేరారు. ఈ విషాదనాటకంలో నవప్రపంచం తాను అనుకోకుండానే పాత్రధారి అయింది. నవప్రపంచానికి వలసలు లేవు. తనకు వలసలు కావాలనే కోర్కె వారికి లేదు. అమెరికా ఖండంలో-ముఖ్యంగా దక్షిణఅమెరికాలో తమ సహాయాన్ని కోరి తమకు సుస్వాగతం చెప్పిన ప్రజలతో

తను వ్యాపారం కొనసాగితే చాలునని నవప్రపంచం సంతృప్తి జెందివున్నది.

1918లో జరిగిన వర్సెయిల్సుసంధిలో జర్మనీకి న్యాయం జరుగలేదు. దానితో దుష్టమైన నాజీపార్టీ ఆధ్వర్యాన హిట్లరు నాయకత్వం క్రింద నవజర్మనీ పుట్టుకొచ్చింది. నానాజాతిసమితి విఫలమైంది. ప్రపంచంలోని చాలా దేశాలను అందులో చేర్చుకోకుండా దాన్ని యేర్పాటుచేస్తే అది విఫలంకాక యేమవుతుంది? ఈ గొడవలంతా చూచి విసుగు జెంది నవ ప్రపంచమైన అమెరికా వైదొలగికుంర్చుంది. 1939 సెప్టెంబరులో హిట్లరు రెండవ ప్రపంచయుద్ధం ఆరంభించాడు. అయినా అమెరికా దూరంగానే వుంది. అలా దూరంగా వుండగల ననుకుంది. కాని అప్పటికే ప్రపంచం పారిశ్రామిక పురోగతికి చాలా దగ్గరికి వచ్చేసిందికదా. పాత ప్రపంచానికి నవప్రపంచం అందుబాటులోకి వచ్చింది. పెద్ద ప్రయత్నం లేకుండానే యుద్ధాన్ని నవప్రపంచపు గుమ్మంలోకి తీసుకు పోవచ్చు. తాను చూస్తూవుండగా పాతప్రపంచం ఛిన్నాభిన్నమై నాశనం కావడం నవప్రపంచానికి ఇష్టంలేదు. తన కిష్టమైనా కాకపోయినా పాత ప్రపంచంలో తానూ ఒక భాగమై పోయినట్లు నవప్రపంచం గుర్తించింది. అమెరికా ప్రముఖనాయకుడు వెండెల్ విల్కీ పాతప్రపంచంతో నిమిత్తం లేకుండా వైదొలగి వుండడం మంచిది కాదని హెచ్చరించాడు. ఒకరికి ఇష్టమైనా, కాకపోయినా ఏకప్రపంచం అవతరించ బోతున్నదని ఆయన స్పష్టంచేశాడు. మొదటి ప్రపంచయుద్ధం అంతమైనట్లే రెండవ ప్రపంచయుద్ధంకూడా ముగిసింది. పాత

దానిబదులు కొత్త నానాజాతి సమితి సృష్టింపబడింది. దానికి ఐక్యరాజ్యసమితి అని పేరు పెట్టారు. ఐతే ఈ మారు ఒక చిన్న తేడా వుంది. సర్వస్వతంత్ర ప్రతిపత్తి గల దేశా లన్నిటికి అందులో ఈమారు ప్రవేశం లభింపజేశారు. అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా అనే దేశాలకు అగ్ర రాజ్య చతుష్టయ మని పేరుపెట్టి వాటికి యే తీర్మానమునైనా కొట్టివేసే వీటో అధికార మిచ్చారు.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత ప్రపంచపరిస్థితిలో మరొక ముఖ్యమైన మార్పు వచ్చింది. ఇంగ్లండుకు ముఖ్య వలసరాజ్యంగా వున్న ఇండియాకు స్వాతంత్ర్య మివ్వవలసిం దిగా ఆ దేశంపై పెద్ద వత్తిడి తెచ్చారు. ఆ వత్తిడి తెచ్చిన వారిలో నవప్రపంచమైన అమెరికాకూడా ముఖ్యపాత్ర వహించింది. యుద్ధంతర్వాత బ్రిటిష్‌సింహం జూలు విదలించింది. బ్రిటిషువారి పరిపాలనపై భారతీయులకు పూర్తిగా నమ్మకం పోయింది. బాపూ, తదితరనాయకుల పుణ్యమా అని భారత దేశంలో జాతీయభావాలు పెల్లుబికినవి. సుభాష్‌చంద్రబోసు యేర్పాటుచేసిన ఆజాద్‌హింద్‌ఫౌజ్ అవతరణతో అంతవరకు ప్రజలను, తుపాకి చూపి బెదరించి, అక్రమ సైన్యంగా వ్యవహరిస్తూవచ్చిన భారత సైన్యంలో మహత్తరమైన మార్పువచ్చింది. 1947 ఆగష్టు 15 అర్ధరాత్రి సమయాన భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఇది భారతదేశానికి నవశకోదయ మని చెప్పాలి. కొన్ని శతాబ్దాల తరువాత భారతదేశం తన పూర్వౌన్నత్యాన్ని పొందే అవకాశం కలిగింది. భారతదేశం విముక్తం కావడంతో మరికొన్ని

దేశాలుకూడా స్వాతంత్ర్యవాయువులు పీల్చుకున్నాయి. సిలోన్, ఇండోనీషియా, ఇరాక్, ఈజిప్టు, కాంబోడియా, థాయిలెండ్ మొదలగు అనేక దేశాలకు స్వాతంత్ర్యం లభించింది. తరువాత చైనాకూడా మధ్యయుగాల అభివృద్ధినిరోధక పాలకులనుండి విముక్తమయింది.

చైనాఉపఖండం రష్యాపద్ధతిప్రకారం కమ్యూనిస్టు రాజ్య మయింది. అయితే చైనాలో కమ్యూనిజం రాకుండా చేయడానికై అమెరికా చాంగ్‌కైషేక్‌ను బలపరిచింది. కాని అమెరికా ఇస్తున్న డబ్బుతో, వస్తుసామగ్రితో చాంగ్‌కైషేక్, అతని ఏజంట్లు ఏమి చేస్తున్నదీ అమెరికావారు గ్రహించలేకపోయారు. అప్పుడు చైనాజనాభా 60 కోట్లు. అంటే ప్రపంచంమొత్తం జనాభాలో నాల్గవవంతు అన్న మాట. కమ్యూనిస్టుచైనాకు ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వమివ్వడానికి అమెరికా పదేపదే అడ్డుచెప్పింది. అధికసంఖ్యాకుల తీర్మానములతో చైనాను నాగరికప్రపంచసమాజంలో చేరకుండా దూరంగా వుంచారు. నవచైనా దినదినమూ బలపడుతూవచ్చింది. ఆ బలంతోబాటు దాని గర్వంకూడా పెరిగింది. తనను దూరంగా వుంచారే అన్న కసికూడా పెంపొందించుకుంది. చైనావృత్తి ఒకనిని దోచుకోవడమే అన్నారు అంతా. వారు అన్నంత పనీ చైనా చేసింది. టిబెట్‌ను ఆక్రమించుకొంది. ఇతరదేశాలలో రాజకీయంగా జోక్యం కలిగించుకుంది. భారతదేశసరిహద్దుపై పేచీపెట్టింది. ప్రపంచపు వత్తిడి దానిపై లేకపోబట్టే అది యిలా చేసింది. ఆవేశాలు, కావే

పాలు విజృంభించినప్పుడు సబబా, బేసబబా అని ఆలోచించే వివేకం అంతరిస్తుంది.

ఈలోపల విశాలమైన ఆఫ్రికాఖండం నిద్రలేచింది. మొదట ఈజిప్టుదేశం బ్రిటిషువారినుంచి విముక్తమైంది. ఆ తరువాత అది మధ్యయుగపు నాయకత్వంనుండి కూడా విమోచన పొందింది. ఆ పిమ్మట ఘానా స్వతంత్రమైంది. దక్షిణాఫ్రికాలో తెల్లజాతివారు నల్లజాతివారిపై చేస్తూన్న అత్యాచారాలను గమనించిన ఆఫ్రికాఖండప్రజలు తమ ఖండం తెల్లజాతివారి పరిపాలననుండి విముక్తం కావాలని నిశ్చయించుకున్నారు. స్వతంత్రప్రతిపత్తిగల జాతులు, రాజ్యాలు అవతరిస్తున్నవి. విదేశీపాలన అంతరిస్తున్నది. ఆయేటి కాయేడు ఐక్యరాజ్యసమితి సభ్యత్వం పెరుగుతున్నది. ఐదు ఖండాలలో వెనుకబడివున్న జాతులన్నీ ఒకదాని కొకటి సన్నిహితమై మైత్రి నెరపుతున్నవి.

ఆవిరితో నడిచే ఇంజను నిర్మింపబడటంతో మానవులు బానిసత్వంనుండి, చెమటోడ్చి కష్టించవలసిన స్థితినుండి విముక్తులయ్యారు. ఆవిరికి బదులుగా గ్యాసోలిన్, ఎలెక్ట్రిసిటీ వచ్చాయి. పరమాణువును భేదించడంతో ప్రపంచం అణుయుగంలో అడుగుపెట్టింది. ఇప్పుడు ఒక మనిషి ఉదయం భోజనం చేసి, బొంబాయినుంచి జెట్‌విమానంలో బయలుదేరి మధ్యాన్న మయ్యేసరికి 12,000 మైళ్ళ దూరాన వున్న న్యూయార్క్ చేరుకొని అక్కడ మళ్ళీ భోజనం చేయవచ్చు. స్ఫుత్నిక్కులుకూడా వస్తున్నాయి. ఇప్పుడు గంటల్లో చేసే ప్రయాణం స్ఫుత్నిక్కులవల్ల నిమిషాలలో జరిగిపోతుంది.

అంటే ప్రపంచం చిన్నగోళీకాయంత అవుతూవుంది. ప్రపంచం మూడువర్గాలుగా విభజితమవుతూవుంది. ఒక వర్గం పశ్చిమ దేశాలవారు. వీరు పారిశ్రామికంగా పురోగమించి, తమ విజ్ఞానాన్ని ఇటీవలవరకు ఇతరుల కందజేయకుండా, తమ పనిముట్లతో, ఆయుధాలతో ఇతరులను పీడించి దోచుకున్నారు. రెండవవర్గం కమ్యూనిష్టు దేశాలవారు. వీరు విదేశీ పరిపాలననుంచో, లేదా భూస్వామ్యవిధానపు రాజరికంనుంచో రక్తపాతంతో జరిపిన విప్లవాలద్వారా తమ దేశాలను విముక్తం గావించుకున్నారు. అయితే, వెనుకటికంటె మరీ కఠినమైన ఇనుపపాలన విధించి ప్రజలకు స్వేచ్ఛ లేకుండా చేశారు. వీరు కొత్త ఉత్పత్తి పరికరాలతో, కొత్త యుద్ధ సామగ్రితో పురోగమిస్తున్నారు. ఈ రెండువర్గాల మధ్య మూడవ వర్గం వుంది. ఈ మూడవ వర్గంలో అన్నీ అభివృద్ధి చెందని దేశాలే వున్నాయి. వీరు ప్రజాస్వామ్యపద్ధతిప్రకారం పరిపాలన జరుపుకుంటున్నారు.

గతయుద్ధం ముగిసే సమయంలో ఆటంబాంబు కనిపెట్ట బడింది. దాని తర్వాత హైడ్రోజన్ బాంబు కనిపెట్టారు. ఈనాడు స్ఫుత్నిక్కులు, రాకెట్లు వచ్చాయి. వీటితో ఆటం బాంబులను, హైడ్రోజన్ బాంబులను, విల్లంబులు కొట్టినంత తేలికగా కొట్టవచ్చు. అవి మెరుపువంటి వేగంతో ప్రయాణించి ఆ తావును ధ్వంసంచేస్తాయి. కనుక ఇప్పుడు జయం కోసంకాని, అపజయంకోసంకాని యుద్ధం చేయటానికి వీలు లేదు. కారణం ఏమిటంటే గెల్చేవారు, ఓడినవారు అంటూ వుండరు. అంతా సర్వనాశనం. మూడవ ప్రపంచయుద్ధమే

కనుక వచ్చిందంటే దాని ముగింపు ఒకేఒకవిధంగా వుంటుం దని, అప్పుడు మరణించినవారిని చూస్తూ ఇంకా కొద్దిసేపట్లో మరణించబోయేవారు తమ విజయానికి సంతోషించవలసి వస్తుందని చిన్నపిల్లలకుకూడా తెలుసు. మానవజాతి బ్రతికి బట్టకట్టాలంటే, తిరిగి మొదటి దశకు పోకుండా వుండాలంటే యుద్ధాన్ని బహిష్కరించాలి. ఈ మాటే నలభై యేండ్లక్రిందట బాపూజీ చెప్పాడు. బాపూజీ మాటలను, ఆయన నైతిక సూత్రాలను ప్రపంచం అలక్ష్యం చేయజాలదు. మానవాళి మనుగడ ప్రమాదావస్థలో వుంది. అగ్రరాజ్యచతుష్టయం నిరాయుధీకరణవిషయం చర్చించడానికి ప్యారిసులో శిఖరాగ్ర సమావేశం జరిపింది. నేటి ప్రపంచంలో అగ్రరాజ్యచతుష్టయ మనే మాటకు విలువలేదు. చిన్నా, పెద్దా అన్నీ ముఖ్యమైనవే; చివరకు తలలు లెఖ్ఖకొస్తాయి. తాము స్వేచ్ఛాదేశాల మని చెప్పుకొనే ప్రజాస్వామ్యదేశాలు ఈ విషయాన్ని గ్రహించివుండవలసింది. కాని వారు గ్రహించలేదు. ప్యారిసు శిఖరాగ్రసమావేశమువల్ల ప్రయోజనం లేకపోయింది. ఆ సంగతి మనకు ముందుగానే తెలుసు. ఆ తర్వాత న్యూయార్కులోజరిగిన ఐక్యరాజ్యసమితిసర్వసభ్యసమావేశంలోకూడా ఈ నాటకం కొంత ఆడారు. దాన్ని మనము చూచాము.

అమెరికాప్రజలు నిరాయుధీకరణ జరుగవలెనని కోరుతున్నారన్న సంగతి అందరికీ తెలిసినదే. యుద్ధమే గనుక వస్తే అది అమెరికాకు కూడా వ్యాపించి, అమెరికా నేలపై కూడా యుద్ధం ముమ్మరంగా జరుగుతుందని వారు గ్రహిం

చారు. అమెరికాలో నేడు పేదప్రజలు లేరు. యుద్ధం ఆరంభమైతే అమెరికా తన సంపదనూ, సంపన్నులైన తన ప్రజలనూ గోల్పోతుంది. దానివల్ల వచ్చే లాభమేమీ లేదు. అలాగే రష్యాప్రజలుకూడా యుద్ధాన్ని శాశ్వతంగా అంతం చేయవలెననే పట్టుదలతో వున్నారు. ఇంతకుముందు యుద్ధం యెలా వుండేదో, మారణాయుధాలు కనిపెట్టబడిన నేటి కాలంలో అది యెంత భీకరంగా వుంటుందో రష్యాప్రజలకు బాగా తెలుసు. కాని ఈ దేశాలన్నింటిలో చాలామంది వ్యక్తులు కీలకమైన స్థానాలలో వున్నారు. వారు మీట నొక్కుతూవుంటారు. అందరూ కూడిన సభలో బలీయమైన రాజ్యాల ప్రతినిధులు ఒకరిపై ఒకరు కారాలు మిరియాలు నూరుతూ వుంటారు. వీరి కలహాలతో ప్రపంచరాజ్యాల సభ అంతస్తు దిగజారుతూ వుంటుంది.

పేదరాజ్యాలవారు బలవంతులను చూచి, అచ్చెరువొందుతూవుంటారు. పాపం, వారికి శాంతి అత్యవసరంగా కావాలి. వారికి అంగబలం తక్కువ, అర్థ బలం తక్కువ. ఉన్నవి అభివృద్ధి కార్యక్రమాలకు సరిపోవు. ఎక్కడ చూచినా అభివృద్ధి అవసరం కనిపిస్తూ వుంటుంది. ప్రజలు అభివృద్ధి కావాలని గొంతెత్తి కేకలు వేస్తూ వుంటారు. ఉద్ధతులమధ్య జరిగే భీషణయుద్ధంలో పేదరాజ్యాలవారు తమకు గల కొద్ది సాధనసంపత్తిని తమ పదాతిదళాల పెంపుకు వినియోగించజాలరు. అలా వినియోగించడమంటే తాము త్యాగాలు చేసి సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్నీ, చెమటోడ్చి అమలు జరుపుకుంటూ వున్న ప్రణాళికలనూ, తమ

ప్రజాశ్రేయస్సునూ ఒకరికి తాకట్టుపెట్టినట్లే కాగలదు. ఈ పేదరాజ్యాలు పెద్దరాజ్యాల కుమ్ములాటలోకి ప్రవేశించలేని స్థితిలో వున్నాయన్నసంగతి ప్రపంచం తెలుసుకోవడం మంచిది. ప్రవేశించాయా వీటిపని ఆబోతుల మధ్య లేగ దూడలవలె అవుతుంది. వలసతత్వం చాలా వరకు అంత రించింది. ఇంకా కొద్దీ గొప్పా మిగిలివుంటే అదికూడా త్వర లోనే అంతరించనున్నది. దారిద్ర్యమును, పేదరికమును, అవిద్యనూ, అనారోగ్యమునూ నిర్మూలింపవలసి వున్నది. ఈ పనులన్నీ శాంతి వుంటేనే జరుగుతాయి. కమ్యూనిస్టు రాజ్యాలు, కమ్యూనిస్టేతరరాజ్యాలూ తమ మిగులు సంపత్తిని శాంతియుత పునర్నిర్మాణానికి వినియోగిస్తామని నిశ్చయం చేసుకోవలసిన అగత్యం నేడు వున్నది. కాని పిశాచాలు ఎక్కడో పొంచుకొనే వుంటాయి. ప్రపంచంలో వున్న శకునులు, దుశ్శాసనులు నిర్వ్యాపారులై వుండలేరు. కనుకనే నిరాయుధీకరణ ఒడంబడిక జరగవలెనని చేస్తూవున్న ప్రయత్నాలకూ, శాంతియుత పునర్నిర్మాణ లక్ష్యానికీ వెనుక నుంచి విఘాతాలు కల్పింపబడుతూవున్నాయి. ఐక్యరాజ్యసమితి అనేక వైరుధ్యాలవల్ల అయోమయత్వంలో పడివుంది. యుద్ధ రాక్షసి నిరంతరం ప్రపంచశాంతిని బెదిరిస్తూవుంది.

ఇక దేశం సంగతి

సైన్యంలో లెఫ్టినెంట్ జనరల్ ఉన్నతమైన పదవి. సైన్యాధిపతి పదవి తరువాత ఈ పదవే గొప్పది. ఇతర ఉద్యోగుల కంటే సైన్యంలో పనిచేసే ఆఫీసర్లు కొంచెం ముందుగా రిటైరు

అవుతూవుంటారు. లెఫ్టినెంట్ జనరల్ పదవిలో వున్న ఒక సైన్యాధికారి నన్ను చూడడానికి మా ఆఫీసుకు వచ్చాడు. ఆయనకుటుంబం వారిది వ్యవసాయవృత్తి. ఆయన ఒక గ్రామానికి చెందినవాడు. అప్పుడే సర్వీసునుండి రిటైరు అయ్యాడు. తన గ్రామానికి పోయి అక్కడే స్థిరపడవలెనని అనుకుంటున్నాడు. సైన్యాధికార్లు మంచి శిక్షణ పొంది వుంటారు. అందువల్ల నాయకత్వానికి తగిన అనుభవం వారికి వుంటుంది. మనుష్యులపై అజమాయిషీ ఎలా చేయాలో, వారిచేత పని ఎలా చేయించాలో వారికి బాగా తెలిసివుంటుంది. మన గ్రామాలలో తెలివిగలవారు, నాయకత్వలక్షణాలు గల వారు బస్తీలకు, పట్టణాలకు తరలివెళ్ళారు. ఈ నష్టానికి మనం విచారిస్తున్నాము. కాని నన్ను చూడటానికి వచ్చిన ఈ మిత్రుడు పట్టణంనుంచి గ్రామానికి తరలిపోయి అక్కడే నివసించాలనే ప్రయత్నంలో వున్నాడు. మంచి విషయమే కదా! గ్రామాలలో మనం పెంపొందింప జూస్తూవున్న సామాజికాభివృద్ధికార్యక్రమం పంచాయతీరాజ్యం, సహకార సమాజమును ఇంకా వ్యాప్తం చేయడానికి తాను యేమి చేయగలడో తెలుసుకోవాలని ఆయన కుతూహలంతో వున్నాడు. ఆయన తన ప్రయత్నాలను తన గ్రామంలోనే కేంద్రీకరించడం మంచిదని నేను సలహా చెప్పాను. గ్రామంలో తెలివితేటలు, కార్యదక్షత గల యువకు లెందరు వున్నారో, వారికి యేమి చేయాలని వుందో, తమ గ్రామంలోని యువతీ యువకులు ఏమి చేయాలని గ్రామస్థులు కోరుతున్నారో,

ఆయన మొదట తెలుసుకోవాలి. ఆ ప్రకారం యువజనులను సనిరాకరించి పనిచేయించాలి. ప్రతిగ్రామానికీ కొన్ని సహజమైన కోర్కెలు, అవసరాలు వుంటాయి. ప్రతి గ్రామానికీ ఒక్కొక్క పనిలో సహజమైన నేర్పు గల యువకులు వుంటారు. బైటి వారెవరూ కల్పించుకొని ప్రయత్నం చేయనక్కరలేకుండానే ఆ నేర్పు పెంపొందుతూ వుంటుంది. కనుక సహజసిద్ధమైన ఆ తెలివితేటలను గుర్తించి వాటిని వినియోగానికి తెస్తే ఆ ప్రతిభ వేళ్ళు తొక్కుకొని నిలిచి, సహజమార్గాలద్వారా పైకి వస్తుంది. అలా కలిగిన ఫలితాలు శాశ్వతమైనవిగా వుంటాయి. వారిని చూచి ఇతరులు నేర్చుకుంటారు. ఆలోచనలు వాటంతట అవే వ్యాపిస్తాయి. ఏ దేశంలోనైనా, ఎప్పుడైనా గొప్పభావాలు, ఆలోచనలు మొదట అక్కడ వేళ్ళు తొక్కుకొని క్రమేణా వ్యాప్తిజెందుతాయి. నేనూ, వచ్చిన సైన్యాధికారీ అనేకవిషయాలు చర్చించాము. తానూ ఒక గట్టి ప్రయత్నం చేసి చూస్తానని ఆయన వెళ్ళిపోయాడు.

ఆయన అటు వెళ్ళగానే నేను ఆలోచింప మొదలు పెట్టాను. ఇతను అనుభవం గలవాడు. ఇంకా యవ్వనంలో వున్నాడు. తన శక్తికొలది కృషిచేయాలనుకుంటున్నాడు. గ్రామానికి చెందినవాడేగాని బస్తీవాడు కాదు. గ్రామప్రజలు అతన్ని స్వీకరిస్తారు. కాని ఆయన ఎదుర్కొనే అడ్డంకులేవి? నేను ఆయనకు చెప్పిన పని సులభమైనదిగా కన్పిస్తున్నది. కాని ఆ గ్రామంలో నాయకత్వం ఇదివరకే వుండివుంటుంది. ఆ నాయకత్వం కులాలపై, ఆర్థికస్తోమతపై ఆధారపడినట్టిది.

ఆ నాయకత్వానికి ఇతను అతీతుడై వుంటాడు. అప్పుడు అక్కడ అదివరకే పాలిస్తూవున్న శక్తుల నతడు ఎదిరించిన వాడవుతాడుకదా! అతను పేదలతరఫున మాట్లాడితే ధనికులు అతనిపై కత్తి కడతారు. అతడు గ్రామంలో దళిత ప్రజలతో స్నేహంగా, చనువుగా వుంటే పైకులాలవారు అతనిని వైరిగా భావిస్తారు. అతను నీతికీ, నిజాయితీకీ నిలబడితే సన్నకారు ప్రభుత్వోద్యోగుల పప్పులుడకవు. అనుకోకుండానే అతను గ్రామంలోని మూర్తిత్రయాన్ని ఎదిరించినవా డవుతాడు. ఈ మూర్తిత్రయం ఎవరంటే—ప్రభుత్వం అమలుజరుప ప్రయత్నిస్తూవున్న భూశాసనాన్ని చాటుగా దెబ్బకొట్టే భూస్వామి ఒకరు. పట్వారీ రెండవ వ్యక్తి. ఈయనతో రెవిన్యూ ఇనస్పెక్టరు కూడా చేయి కలుపుతాడు. మూడవ వారు గ్రామ వర్తకుడు, లేదా వడ్డీవ్యాపారి. కొంతకాలం తర్వాత ఈ లెఫ్టినెంట్ జనరల్ యే పేదల శ్రేయస్సుకోసం పాటుపడుతున్నాడో వారే ఏదో ఒకసాకుతో ఆయనపై ఎదురు తిరిగేటట్లు చేస్తారు. ఈ రోజుల్లో ఎవరూ యేపనీ ఉచితంగా చెయ్యరు. చివరకు సన్యాసులుకూడా ప్రతిఫలం కావాలని చెయ్యి చాపుతున్నారు. సాధూసమాజ్ సభ్యులుగా తమకూ జీపులు, కార్లు, దినబత్తేములు కావాలని అంటున్నారు. కొత్త వారెవరూ సేవచేస్తామని ముందుకు రాకపోవడం వలన రామకృష్ణమిషన్‌వంటి సుప్రసిద్ధసంస్థ నానాటికీ పల్చబడిపోతూ వుందని చెబుతున్నారు. "ఈ లెఫ్టినెంట్‌జనరల్ తాను చెప్పుకుంటున్నట్లు ప్రయోజకుడే అయితే ఆయనకు ఏ ప్రైవేటు కంపెనీవారో పిలిచి ఎందుకు ఉద్యోగ మివ్వలేదు? అలా

ఉద్యోగాలివ్వడం ఈనాటి రివాజుగా వుందే!'' అని గ్రామస్థులు అడుగుతారు. ''ఈయన గ్రామానికి రావడానికి కారణ మేమిటి? ప్రభుత్వంలో యే మంత్రిగానో, ఉపమంత్రిగానో పదవి నధిష్ఠించడానికి ఈయనదృష్టి రాజకీయాలమీదికి ఎందుకు పోలేదు?'' అని వాదిస్తారు. వీటన్నిటికీ అతను యేమి సమాధానం చెప్పగలడు? తనకై తానే నేటి రివాజులకు భిన్నంగా గ్రామసేవ చేయాలనే తలంపుతో, తన ప్రజలకు తాను ఋణపడివున్నదానిని తీర్చివేయవలె ననే కాంక్షతో వచ్చాననీ, తనకు వేరే ఉద్దేశాలేమీ లేవనీ ఆయన ఎలా ఋజువు చేయగలుగుతాడు?

ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశానికి న్యూయార్కు వెళ్ళిన భారతప్రధానమంత్రి రెండువారాల తర్వాత స్వదేశానికి తిరిగివచ్చారు. ఈ పక్షంరోజులలో ఆయన అక్కడ కనుగొన్న దేమిటి? భాషాసమస్యపై అస్సాము ఛిన్నాభిన్నంగా వుంది. అస్సామీవాళ్ళూ, బెంగాలీలూ చూడ డానికి ఒకే విధంగా వుంటారు. ఒకరిభాష నొకరు బాగా అర్థంచేసుకోగలరు. భారతదేశ ప్రజలలో అస్సామీవారు శాంతిప్రియులని పేరుకదా, వారు హింసాత్మక చర్యలకు ఎందుకు దిగారు? వారిని ఆ చర్యలకు పురికొల్పిన వెర్రి యేది? పశ్చిమబెంగాలు ముక్కలై పోయేట్టుగా వుంది. అసహజమైన విభజన జరగడంవల్ల అంతు లేకుండా నిరాశ్రయులు వచ్చి పడుతున్నారు. కలకత్తా అసలే జనసమ్మర్దంగల నగరం. దానికి తోడు వచ్చిపడే కాందిశీకుల జనాభాతో అది సిక్కటిల్లి పోతూవుంది. తెలివి గలవారు, ఉన్నతవిద్య గలవారు జీవనం

కోసం ఎటో వెళ్ళవలసివస్తున్నది. కొత్త పరిశ్రమలు కలకత్తాకు దూరంగా నెలకొంటున్నవి. దేశవిభజన చెడ్డదే. కాని ఈ దేశ పౌరులకు ఈ దేశంలోనే భాషకారణంగా నిలువ నీడ, జీవనాధారం లభించకపోవడం ఆశ్చర్యంగా వున్నది. అసలు నమ్మడానికే వీలులేకుండా వున్నది. ఒరిస్సా మిశ్రమ మంత్రివర్గంతో సతమత మవుతూ, అది నేడో, రేపో కూలిపోతుందేమో అన్నట్లున్నది. బీహారురాష్ట్రం పైకి ప్రశాంతంగా కన్పించినా లోపల నిప్పు రగులుకుంటూనే వున్నది. ఉత్తరప్రదేశ్ లో కూడా చిక్కులు వున్నాయి. పంజాబుసంగతి అందరికీ విదితమే. మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి రాజీనామా యిస్తానని బెదిరిస్తూ వున్నాడు. భారతదేశంలో అన్నిటికంటే పెద్దరాష్ట్రమైన మధ్యప్రదేశ్ అలజడి సుదూరంవరకూ వినిపిస్తూనేవుంది. ఆంధ్ర నిలదొక్కుకుందేమో అనుకున్నాను. అనేక విధాల ఆ రాష్ట్రం భారతదేశానికి గమనీయమైన నాయకత్వాన్ని సమకూరుస్తూవుంది. కాని అదికూడా మళ్ళీ చిక్కుల్లో పడ్డది. వచ్చే సాధారణ ఎన్నికలకు అభ్యర్థులను నిర్ణయించడంలో యేవర్గానికి ప్రాబల్యం వుండవలెనన్న విషయమై మంత్రులలో అభిప్రాయభేదాలు తలయెత్తాయి. మైసూరు మంత్రివర్గం యే క్షణాన పతనమవుతుందా అన్నట్లుంది. సంతకాల సేకరణోద్యమం జోరుగా సాగుతూవుంది. పనికి బదులు కలహాలు ఉధృతమవుతున్నాయి. కేరళలోని మిశ్రమ మంత్రివర్గం అప్పుడప్పుడు కలతలకు లోనై ఎప్పుడు బీటలిస్తుందా అన్నట్లుంది. ఇన్ని వత్తిడులలో ప్రజాస్వామ్యం ఎంత కాలం మనగలుగుతుంది?

ఇటువంటి భారతదేశానికా ప్రధానమంత్రి ఐక్యరాజ్య సమితిలో ప్రాతినిధ్యం వహించేది? ఈ స్థితిలోవున్న భారత దేశం ఆయనకు శక్తి నివ్వగలదా? సిద్ధాంతాలకోసం పార్టీలు కీచులాడుకున్నాయంటే అందులో కొంత అర్థంవుంది. ప్రాథమిక విషయాలపై తండ్రికొడుకుల మధ్య, భార్యా భర్తలమధ్య అభిప్రాయభేదాలు వుండడం కద్దు. కాని, దేశాన్ని పాలించుతూ వున్న పార్టీలో ముఠాలు, గ్రూపులు బయలుదేరి ప్రస్తుత పదవులకోసమో, లేదా రాబోయే అవకాశాల కోసమో ఒకళ్ళ పీక ఒకరు నులుముకుంటూ వుండడం భారతదేశ సాంప్రదాయం కాదు. ఇది దేశానికి పూర్తిగా కొత్త. దీనికి నివారణోపాయం లేదు. వెలుపలి శత్రువుతో నైతే పోరాడ వచ్చు. కాని ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్టుకోలేడు. పేరాశ, వ్యామోహము అనేవి యేరూపములో వున్నాసరే, దేశం వాటికి లోనయిందంటే విపత్తు తప్పదని గాంధీజీ చెప్పాడు. ఏకపక్ష పాలనవల్ల వచ్చే ప్రమాదాలు ఆయనకు తెలుసు. నేడు పాశ్చాత్యదేశాలలో అమలులోవున్న ప్రజా స్వామ్య విధానాన్ని భారత దేశానికి యథాతథంగా వర్తింపు చేయ వీలులేదని ఆయన యెరుగును. ప్రజాస్వామ్యానికి, పాశ వికశక్తికి చుక్కెదురు అని ఆయన గ్రహించాడు. స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే కాంగ్రెసుసంస్థను రద్దుచేసి దానిని లోకసేవా సంఘముగా మార్చాలనుకున్నాడు. కాని ఆయన అట్టి సంఘం స్వరూపస్వభావాదులను నిర్ణయించకముందే ఒక హంతకుడు ఆయనను పొట్టబెట్టుకున్నాడు.

ప్రజాస్వామ్య మంటే ప్రజల పరిపాలన అని అర్థం. ప్రజలు తమ ఆశలను, ఆందోళనలను వివిధసంస్థలద్వారా వ్యక్తపరుస్తారు. ప్రజాస్వామ్యం యథార్థమైనదిగా వుండాలంటే విభిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యేందుకు, భిన్నాభిప్రాయాల సమన్వయానికి అవకాశం వుండాలి. ప్రజలు యేమి కోరుతున్నారో, దానిని గమనించి తదనుగుణంగా వ్యవహరించే విధానమై వుండాలి. ఇది జరగాలంటే ప్రభుత్వం వికేంద్రీకరింపబడాలి. రాజ్యాంగంలో కేంద్రంనుండి రాష్ట్రాల వరకూ వికేంద్రీకరణ నిర్దేశింపబడివున్నది. మనరాష్ట్రాలు చాలా పెద్దవి. వాటి జనసంఖ్యకూడా ఎంతో పెద్దది. కనుక కేంద్రం నుంచి గ్రామంవరకు వికేంద్రీకరణ ఇంకా జరగవలసిన అవసరం వుంది. అంటే దేశాన్ని ఇంకా అనేకపరిపాలనావిభాగాలుగా విభజించి ఒక్కొక్క స్థాయిలో కొంత అధికారమిచ్చి అన్ని భాగాలకూ పరస్పర సంబంధం కలిగించాలన్న మాట. ఇలా చేయాలంటే ఒకరి పార్టీ ఒకచోట బలహీనంగా వున్నప్పుడు అక్కడ అధికారాన్ని మరొక పార్టీకి అప్పగింత పెట్టడానికి సిద్ధంగా వుండాలన్నమాట. ఇందువల్ల కాళ్ళలో సత్తువ లేకుండా పోయినవారికి, అలసిపోయినవారికి తిరిగి జవసత్వాలు చేకూరడానికి కొంత విశ్రాంతి లభిస్తుంది. కాని అలా అప్పగింతపెట్టడానికి సంకోచిస్తున్నారు. అందాకా యెందుకు? జిల్లాబోర్డులలో, తాలూకాబోర్డులలో ఒకే పార్టీకి చెందినవారు అధికారాన్ని పంచుకోడానికి సిద్ధంగా లేరు. ఏదో ఒక ముఠా చెలాయించవలసిందేగాని అవతలి ముఠాకు ససేమిరా అధికారం అప్పగించరు. ఈ విషయంలో ప్రభు

త్యోద్యోగులే కొంత నయం. సర్వీసుకోసమని తమకు సరి పడని మనిషితోనైనా సరిపెట్టుకుపోయే ధోరణి వారిలో వుంటుంది. కాని ఎన్నికైన ప్రతినిధులు ఒకపట్టాన లొంగరు. మొండిఘట మని భావింపబడే కలెక్టరును, లేదా సబ్ డివిజనల్ ఆఫీసరును సౌకర్యాలు లేని ప్రాంతంనుంచి సౌకర్యవంతమైన ప్రదేశానికి బదిలీచేయవచ్చు. అలా చేసినా పేచీ లేమీ రావు. కాని, పంచాయతీ మెంబరు ఎదురుతిరిగాడంటే అతను ముఖ్యమంత్రినైనా ధిక్కరించగలడు. అందుచేత, ప్రభుత్వోద్యోగులపైననే ఎక్కువ విశ్వాసమును వుంచవలసినదని మన నాయకులకు సలహాయిచ్చిన ప్రబుద్ధులుకూడా వున్నారు.

నేటి ప్రజాస్వామ్య భారతదేశంలో కేంద్రంలోను, రాష్ట్రరాజధానులలోను సర్వాధికారాలూ తామే వహించి, బరువుతో క్రుంగిపోతున్న నాయకులను మనం చూస్తూనే వున్నాం. వారి తరఫున ఆ అధికారాలను ప్రభుత్వోద్యోగులే చెలాయిస్తూ వుంటారు. అలా అధికారం చెలాయించే స్థాయి ఎంత దూరంగావుంటే ఆ అధికారి ప్రజాస్వామ్యపర్యవేక్షణకు అంత తక్కువగా గురిఅవుతూవుంటాడు. వ్యతిరేకతను తగ్గిస్తే న్యాయం దూరమవుతుంది. మొదట "తప్పుగానీ, ఒప్పుగానీ నాపార్టీ" అని అంటారు. తరువాత "తప్పో, ఒప్పో నా ముఠా" అంటారు. ఆ పిమ్మట "తప్పు అయితేనేమి, ఒప్పు అయితేనేమి, నేను చేశాను" అన్న మాట వస్తుంది. ఇది కేవలం సిద్ధాంతమేకాదు. వెనుకబడివున్న ఖండాలలో మన వంటి చాలా దేశాలలో యథార్థంగా జరిగినవే. భారతదేశానికి ఒకప్పుడు హిమాలయాలు రక్షణశ్రేణిగా వున్నవి. కాని

ఈ స్పుత్నిక్కుల యుగంలో అవి మనకు రక్షణ నివ్వజాలవు. పరిపాలన వికేంద్రీకరణనుగూర్చి, దానితోపాటు వికేంద్రీకృత ఆర్థికవ్యవస్థనుగూర్చి బాపూజీ తనమనస్సులో వున్న మాటను చెప్పివున్నాడు. మనం యేటా అక్టోబరు 2వ తేదీన, జనవరి 30వ తేదీన బాపూ సమాధికి వెడుతూవుంటాము. మన పరిశ్రమల వికేంద్రీకరణపథకం యథార్థంగా ఎట్లా ఆచరణలో పెట్టబడుతున్నదో ఎన్నడైనా ఆలోచించామా? పరిశ్రమల వికేంద్రీకరణ అంటే ఆర్థికశక్తిని నాల్గుచోట్లకు సర్దడ మన్న మాట. అంటే కేంద్రీకరణకు వ్యతిరేకము. అనగా నేటి ప్రపంచంలో జరుగుతున్నదానికి వ్యతిరేకంగా చేయడ మన్న మాట. అయితే ఒక పరిశ్రమ వున్నచోటనే మరొక పరిశ్రమను పెట్టడం సులభం. విద్యుచ్ఛక్తి, నీరు అక్కడ అందుబాటులో వుంటాయి. పనివారలకు గృహవసతి, ఇతర సౌకర్యాలుకూడా లభిస్తాయి. ఒక పెద్ద రాజధానిలో, లేదా పారిశ్రామికనగరంలో శాంతిభద్రతలు, ఆరోగ్యం, పారిశుధ్యం మొదలగు ప్రత్యేక సమస్య లెన్నో వుంటాయి. వీటన్నిటికీ అయ్యే ఖర్చును సాధారణ ఆదాయాలతో సరిపెట్టుకోవచ్చు. ఎటు తిరిగీ ఈ బరువు పన్ను చెల్లించేవాడిమీద పడుతుంది. తప్పనిసరి అని తోచే సాంఘికవ్యయానికి డబ్బు మంజూరీకోసం అతడు అంగీకరించి తీరుతాడు.

కాని వీటన్నిటితో మనం ఎక్కడ తేలతాము? ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగాన్ని, ప్రైవేటు పెట్టుబడితో పెట్టే పరిశ్రమలను ఒకేచోట పెట్టి జనసమ్మర్దమును అధికం చేస్తున్నాము. వాటికి తోడు క్లబ్బులు, హోటళ్లు పుట్టుకొస్తాయి.

అక్కడ వారూ, వీరూ కలుసుకుంటారు. ఇలా పెరిగిపోతూ వున్న నగరాలకు ప్రతిగా గ్రామాలు ఎలా నిలువగలుగుతాయి? ఈ స్థితిలో దీపాలకు, పరిశ్రమలకు, సాగునీటి సప్లైకి మనకు విద్యుచ్ఛక్తి కొరత యేర్పడిందంటే గ్రామాలకు ఉపాధ్యాయులను, డాక్టర్లను, మందులను, పశువైద్యసదుపాయములను, ఇతరసౌకర్యాలను యేర్పాటుచేయలేకపోతున్నామంటే అందుకు ఆశ్చర్యపడనక్కరలేదు. రాకపోకల సౌకర్యాలను, వార్తాసౌకర్యాలను, చివరకు పారిశుధ్యసౌకర్యాలను సగా కల్పించలేకపోతున్నాము. కారణం యేమిటంటే డబ్బుకు కటకట. ఇటువంటప్పుడు గ్రామాలనుంచి పట్టణాలకు ప్రజలు వలసపోతున్నారంటే అందుకు ఆశ్చర్య పడనవసరం లేదు. సౌకర్యాలు లేని గ్రామాలకు ఎవరు పోయివుంటారు?

ఇక మన ప్రజాస్వామ్యధోరణిని పరిశీలిద్దాము. ప్రజాస్వామ్య మంటే దిగువన పునాదులనుంచి ప్రజావ్యవస్థలు ఏర్పడటమని అర్థము. ఇట్టి వ్యవస్థలు పైన శిఖరంనుంచి కట్టుకువచ్చిన వ్యవస్థలతో సహజీవనం నెరపలేవు. ఈనాడు ముఖ్యమైన పదవులలో వున్న కొందరు రాజకీయనాయకులు పైన శిఖరంనుంచి అఖిలభారతసంస్థలను నిర్మిస్తూవున్నారు. ఇది ప్రజాస్వామ్యస్వభావానికి విరుద్ధం. ఇట్టి వ్యవస్థలు ప్రభుత్వపోషణవల్ల ప్రజలపై విధింపబడినవి కావడంచేత ఇవి ప్రజాస్వామ్యంతో ఘర్షణపడతాయి. చివరకు అవి ప్రైవేటు సైన్యాలవలె తయారవుతాయి. రామకృష్ణమిషన్ దేశ ప్రజలకు చేస్తున్న సేవ మన అందరికీ తెలిసినదే. ఆ మిషన్ ద్వారా ప్రజాసేవ చేయడానికి ఎన్నో అవకాశాలు

వున్నప్పటికీ అందులో చేరడానికి క్రొత్తవా రెవరూ ముందుకు రావడంలేదు. కనుకనే రామకృష్ణమిషను తన కార్యకలాపాలను విస్తృతంగా నిర్వహింపలేక పోతున్నది. అలాగే ప్రభుత్వంలో బాగా జీతాలిచ్చే కొన్నిరకాల ఉద్యోగాలకు యోగ్యులైన అభ్యర్థులు దొరకడం కష్టంగా వుంది. నూతన రాజకీయ పరిపాలనా బాధ్యతలను నిర్వహించే సమర్థతగల అనధికారసంస్థ ఒకటి కావాలని కేంద్రమూ, రాష్ట్రప్రభుత్వాలూ మొత్తుకుంటున్నాయి. పైనుంచి క్రిందికి నిర్మించుకు వచ్చిన అఖిలభారత స్వచ్ఛందసేవాసంస్థలకు మనుషులేరి? పునాదులనుంచి పైవరకు కట్టుకుపోయిన ప్రజాస్వామ్యానికీ, పైనుంచి విధింపబడిన ప్రజాస్వామ్యానికీ చాలా తేడా వుంది. ఇవి ఒకదానినొకటి తొలగింప ప్రయత్నిస్తాయి. కనుక ఈ రెండింటిలో మనం దేనిని వృద్ధిచేయదలచుకున్నామో మొదట నిర్ణయించుకోవాలి. పైకి పోదలుచుకొన్నవారికి అడ్డదారులంటూ వుండవు. కాని క్రిందికి పోదలుచుకున్నవారికి ఎన్ని దారులైనా వుంటాయి.

### లోపలి విపత్తు

నేను ఒక గ్రామంలో పుట్టి పెరిగాను. ఆ గ్రామం ఇప్పుడు తూర్పుపాకిస్తానులో వుంది. మా మేనమామ వూరు మా గ్రామానికి యిరవైఆరు మైళ్ళ దూరంలో వుంది. మైలు అనే సరికి లెక్కలలో చెప్పబడే మైలు వేరు, నేలపై మనం అనుకునే మైలు వేరు. రాళ్ళు, రప్పలు, ఎగుడు దిగుడులు

వున్నప్పుడు ఆ దూరం కొంచెం ఎక్కువగా వుండవచ్చు. మా వూరికీ,మా మేనమామగారి వూరికీ మధ్య నదులూ, వాగులూ వున్నాయి. కొన్నిచోట్ల పడవల సౌకర్యం వుంది. కొన్నిచోట్ల లేదు. సరస్సులు కూడా వున్నాయి. వాటిలో తామర మొదలగు తీగలు వుండేవి. వాటిలోంచి స్టీములాంచీలు ఈ నాటికి కూడా పోవడం సాధ్యం కాదు. ఏడాదిలో ఎనిమిది నెలలు మా మేనమామగారి వూరికి పోవడానికి వీలు కలిగేది కాదు. దోనె కట్టుకొని పోయేవాళ్ళు. పోతే తక్కినకాలంలో, చలికాలంలో ఆ వూరు పోవడానికి రెండురోజులు పట్టేది. ఆ ప్రయాణం ఎన్నో ప్రమాదాలతో కూడుకొని వుండేది. దారిలో బందిపోటు దొంగలు, కేడీలు తగిలేవాళ్ళు. వాళ్ళు ఆ మార్గాన్ని ఒక్కొక్కళ్ళ కింత అని విభజించుకొని ఆ ప్రకారం తమ వృత్తి సాగించుకుంటూ వుండేవాళ్లు. అక్కడ ప్రభుత్వమే వుండేది కాదు. ఇది నా చిన్ననాటి మాట. నేను ఆదారిన చాలాసార్లు ప్రయాణం చేశాను. ఆ వూరికి ఇప్పుడైతే కారులో ఒక గంటలో వెళ్ళవచ్చు. విమానం ద్వారా నైతే రెండు నిముషాల్లో పోవచ్చు. స్ఫుత్నిక్కులైతే క్షణంకూడా పట్టదు.

నేటికి మూడునండల యేండ్ల క్రిందటివరకూ అన్నిటి కంటే వేగంగా పోగలిగింది గుఱ్ఱము. ఆవిరిఇంజను వచ్చిన తరువాత ఈ వేగం గంటకు సగటున ఎనిమిదిమైళ్ళనుంచి 25-30 మైళ్ళవరకూ పెరిగింది. పాశ్చాత్యదేశాలు స్వల్ప కాలంలోనే యంత్రయుగంవల్ల కలిగిన కుదుపుకు తట్టుకొని నిలవగలిగాయి. అయితే యింత శీఘ్రమైన మార్పు జరగడం

వల్ల ఆ దేశాలు ఎన్నో మెలికలు దాటిపోవలసివచ్చింది. ఇటువంటి వేగాన్ని తట్టుకోవడం కష్టమే. ఆ యుగ సంధిలో పాశ్చాత్యదేశాలలో చిన్న చిన్న జాతులు సైతం తీవ్రమైన అనుభవాలకు లోనై ఎద్దులు, గుర్రాల నుండి ఆవిరిఇంజనువరకు వచ్చిన మార్పు తొలిదశలో కొన్ని పాశ్చాత్యదేశాలలో మాత్రమే జరిగింది. ఆ మార్పును వారు తక్కిన ప్రపంచానికి రానివ్వలేదు. మార్పును కోరని దేశాలు ఈ మార్పుకు సుముఖంగా లేకపోవడంచేతను, పాశ్చాత్యరాజ్యాలలో కొత్తగా అభివృద్ధిచెందిన దేశాలవారు తమ గుత్తహక్కు తామే వుంచుకోవాలని ప్రయత్నించినందు వల్లను, తక్కిన ప్రపంచమంతటా ఈ మార్పు వెంటనే రాలేకపోయింది. ఒకవేళ ఈ మార్పు మొత్తం ప్రపంచానికి అప్పుడే వ్యాపించినట్లయితే పాశ్చాత్యదేశాలలో జీవన ప్రమాణ మెంత వేగంగా మార్పుచెందిందో అంత వేగంగా మార్పు చెందివుండకపోయేది. దారిద్ర్యం, రోగాలు సర్వత్రా నిర్మూలింపబడి వుండేవి. విద్యకూడా సర్వత్రా వ్యాప్తిచెంది వుండేది. కాని మధ్యయుగముల ఫ్యూడల్ వ్యవస్థకు బానిసలు కావలసివచ్చింది. వారికి చాకిరీ, కష్టపు పనులన్నీ బానిసలే చేయాలి. యంత్రాలువచ్చి, బానిసల అవసరాన్ని లేకుండా చేసినప్పటికీ, బానిసలు లేని ప్రపంచం వుండడానికి మానవుని బుద్ధి సమ్మతించలేదు. యంత్రయుగాన్ని ప్రారంభించినవారు పాశ్చాత్యజాతులవారు. అయితే ఈ పాశ్చాత్యదేశాలవారు దైవకృపకు అంతగా పాత్రముకాని దేశాలను తమ వలసలుగా మార్చుకొని ఒక కొత్తరకపు బానిసవిధానాన్ని అమలులోకి

తెచ్చారు. దీనితో వలసవిధానపు ప్రభుత్వాలు యేర్పడ్డవి. ఇట్లా ఆఫ్రికా, ఆసియాఖండాలలో వలసరాజ్యా లేర్పడి ప్రజలు పరాధీనులై పోయారు.

రెండు ప్రపంచయుద్ధాల పరోక్షప్రభావంవల్ల వలస రాజ్యాల ప్రజలు స్వాతంత్ర్యం పొందే వీలు కలిగింది. ఆ యుద్ధాలు తక్కిన ప్రపంచానికి యంత్రయుగం త్వరితంగా వ్యాపించడానికి తోడ్పడ్డాయి. యంత్రయుగం మనకుకూడా వచ్చింది. కాని ఈ యంత్రయుగపు గుణపాఠాలను మనం పూర్తిగా జీర్ణంచేసుకోకముందే మరొక కొత్తయుగం మన గుమ్మం ముందుకు వచ్చి తలుపు తట్టుతూవుంది. పరమాణు వును ఛేదించడంవల్ల మనకు తెలిసిన శక్తులన్నిటికంటే బలీయ మైన శక్తి మానవుని అందుబాటులోకి వచ్చింది. ఇందువల్ల రేడియో, టెలివిజన్, టెలిఫోను, ఇంకా రైళ్ళద్వారా, ఓడల ద్వారా, విమానాలద్వారా ప్రయాణాలు మొదలగున వన్నీ ఏకో గడచినయుగంతాలూకు కొద్దిపాటి విశేషాలవలె కన్పి స్తున్నాయి. వివిధ దేశాలమధ్య ఈనాడు మనం రైళ్ళద్వారా, విమానాలద్వారా ప్రయాణాలు చేస్తున్నట్లే రాబోయే కొత్త యుగంలో ఒక గ్రహంనుండి మరొక గ్రహానికి ప్రయాణం చేసే అవకాశాలు యేర్పడనున్నాయి. రాబోయే కొత్త యుగంలో పంటలు పండించడం, రోగాలకు చికిత్స, విద్యు చ్ఛక్తి ఉత్పత్తి, భూమినుండి లోహాలు తియ్యడం, వాటిని ఉపయోగించడం, చలి, వేడిమి తగలకుండా ఏర్‌కండీషన్ నివాసమును యేర్పాటుచేసుకోవడం, దుస్తులు మొదలగునవి

అన్నీ కొత్తపద్ధతుల ప్రకారం జరుగుతాయి. ఇట్టి మార్పుల కన్నిటికీ మనం సుముఖుల మైతే వీటి పర్యవసాన మేమిటి?

ప్రపంచంలో అన్నిటికంటే సంపన్న దేశమైన అమెరికా సంగతి ఆలోచిద్దాము. ఒకప్పుడు అడవులతో, అడవిమృగా లతో మానవనివాసమే వీలుకానట్టిదిగా వున్న ఈ ఉపఖండం 250 యేండ్లలో నవప్రపంచంగా మార్చబడింది. ఇక భౌతిక సదుపాయాల విషయం చూస్తే—సాధారణ అమెరికన్ పౌరుడు సాధారణ భారతపౌరునికంటె యాభైరెట్లు సంపా దిస్తాడు. మన దేశంలో నిరుపేదల ఇండ్లలో సైతం మట్టి పాత్రలు, నూనెదీపాలు వున్నట్లే కెలివిజను, చల్లనీరు, వేడి నీటి సదుపాయం, ఏర్ కండిషనర్, మోటారుకారు మొద లైనవి అమెరికాలో పేదవారి ఇండ్లలో కూడా వుంటాయి. అమెరికా ఎంతగా ప్రయత్నించినప్పటికీ, తక్కిన ప్రపంచంలో రేగే కల్లోలాలకు దూరంగా వుండలేకపోయిందన్న విషయం మనం తెలుసుకున్నాము. ఇంకా ముందుముందు తనకు నిమిత్తం లేదన్నట్లు అమెరికా దూరంగా వుండడం మరీ దుస్సాధ్య మవుతుంది. మానవశ్రమ లేకుండా పనులు జరగ డానికై అమెరికా కనిపెట్టి వాడుతూ వున్నన్ని యంత్రపరి కరాలు మరే దేశంలోనూ కానరావు. అక్కడ భార్యాభర్త లిద్దరూ ఆఫీసులలోనో, లేదా ఫ్యాక్టరీలలోనో, రోజుకు ఏడెనిమిదిగంటలు పనిచేస్తారు. వాళ్లు పనిచేసే చోట్లకు పోవ డానికి గంట, లేదా రెండుగంటలు పట్టుతుంది. వారికి కావలసిన సదుపాయాలు, విలాసాలు అన్నీ వున్నాయి. ఇతర దేశాలవారికి కూడా వాటిని ఇవ్వగలరు. అలా ఇవ్వనప్పుడు

అవి వాడుకునేవారు లేక అవి వ్యర్థమవుతూవుంటాయి. వారికి చక్కని గ్రంథాలయములు, వార్తాపత్రికలు, మ్యూజియములు, వినోదశాలలు వున్నాయి. ప్రతి ఇంట్లో టెలివిజను, రేడియోగ్రాము వుంటుంది కాబట్టి ఇంటింటికీ సినిమాహాలు వున్నట్లే లెక్క. స్కూళ్ళలో, కాలేజీలలో, యూనివర్సిటీలలో అక్కడ వున్నన్ని విద్యాసౌకర్యాలు మరెక్కడా లేవనే చెప్పవచ్చు. మానవుని బుద్ధి ఆలోచించి సాధించగలిగినంత మేరకు వైద్యసదుపాయాలు అక్కడ వున్నాయి.

నిజమే. ప్రపంచంలో అమెరికా అన్నిటికంటే సంపన్న దేశం. ప్రపంచంలో యెవరైనా అమెరికావారి సహాయం, వారితో కలయిక లేనిదే, లేదా కనీసం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారి ఆమోదము లేనిదే, పెద్దపెట్టున వ్యాపారం చేయజాలరు. అమెరికా భారీఎత్తున సహాయం చేసే అవకాశముంటే తప్ప లేకపోతే ఏ దేశమైనా నిర్మాణకార్యక్రమం గాని, యుద్ధంగాని తలపెట్టజాలవు. ఒకవేళ తలపెట్టినా, అందులో కృతకృత్యులు కావాలన్నా, లేక యుద్ధంలో గెలవాలన్నా ఏదో ఒక దశలో అమెరికా సహాయం తీసుకోవలసిందే. కాని, అమెరికాప్రజలు సుఖశాంతులతో ఆనందంగా వున్నారా? శారీరకంగా, మానసికంగా పూర్తిఆరోగ్యంగా వున్నారా? జీవయాత్ర వారికి సమరసంగా వుందా, లేక కేవలం యంత్రప్రాయమైపోయి కాల్పనికసీమమైన కాంచనద్వీపంకోసం వారు ఎండమావులవెంటబడిపోతున్నారా? అమెరికాలో మనిషికి లభించనిది టైము ఒక్కటే. ఎవరికీ నిమిషం టైము వున్నట్లు కన్పించదు. అంతా హడా

విడి. కాసేపు స్తిమితంగా కూర్చొని ఏవ్యక్తీ అంతర్ముఖుడు కావడానికి వ్యవధానమే వుండదు. ఇక అక్కడ జరిగిన మహత్తరమైన అభివృద్ధికి అర్థం యేమిటి? స్పుత్నికుల యుగంలో అమెరికా ఇంకా ఎలా వుంటుందో! అమెరికా వ్యవహారం ఎలా వుందో యూరపుఖండంలోని దేశాలసంగతి కూడా యించుమించు అంతే! రష్యా ఇప్పుడు పాశ్చాత్య రాజ్యాలను చూచి భయపడుతూ వుంది. ఆ భయం నుంచి అది విముక్తం కావాలి. రష్యా భవిష్యత్తు ఎలా పరిణమిస్తుందో, అది చివరకు ఎలా ప్రవర్తిస్తుందో జోస్యం చెప్ప లేము. భారతదేశం ఒక నూత్నయుగప్రాంగణంలో వుంది. ఈ దేశం తనకంటె ముందుకు వెళ్ళిపోయిన దేశాల అనుభవాలను తెలుసుకొని అయినా గుణపాఠాలు నేర్చుకోవాలి.

కాగా, తేలిన పర్యవసాన మేమిటంటే—యంత్రం మానవునికి వరప్రసాదం కాదు. దానిలో మంచీ, చెడూ రెండూ వున్నాయి. మానవుడు భౌతికపరిసరాలకు తన్ను తాను సరిపెట్టుకుంటే అది మరొక విధంగా వుంటుందేమో. డర్బీలాటరీలో కొన్ని లక్షల రూపాయల బహుమానం వచ్చిన పేదవాడి కథ మీకు తెలిసేవుంటుంది. అంత పెద్ద బహుమానం అతనికి వచ్చిందని చెబితే దానివల్ల కలిగిన అంతులేని సంతోషాన్ని అతడు భరించలేక పోయాడు. ఆ మాట అతను నమ్మలేకపోయాడు. ఆ ఆనందం కలిగించిన ఉద్రేకంలో హృదయచలన మాగి చనిపోయా డని చెబుతారు. అందాకా యెందుకు? మనం నిత్యం తీసుకొనే ఆహారంలో ఆకస్మికంగా మార్పు గలిగితే దానికి మన శరీరం

తట్టుకోజాలదు. ఒకపూట చెక్కపూటుగా మెక్కామంటే అజీర్ణం చేస్తుంది. ఒకవేళ జీర్ణమైనా దానిని హరించుకోలేము. శరీరంలో కొన్ని తావుల కొవ్వు పెట్టుకొస్తుంది. కొవ్వు మరీ పెరిగిందంటే అది గుండెకు తట్టుకొని, ఊపిరి పీల్చుకోవడమే కష్టమై మనిషి చనిపోతాడు. ప్రపంచంలో చాలా దేశాల పరిస్థితి ఈనాడు ఇలాగే వుంది. నేటి ప్రపంచ దుస్థితికి ముఖ్య కారణ మేమంటే మానవత్వానికీ, యంత్రాలు వచ్చిన తరువాత మానవుని పరిసరాలలో కలిగిన విపరీతమైన మార్పులకూ మధ్య శ్రుతి కలవడం లేదు. మానవుని ఆత్మది ఒక దారైతే పరిసరాలది వేరొక దారిగా వుంది. కాబట్టే నేటి సంఘర్షణ. స్పుత్నిక్కుల యుగం వచ్చిందంటే ఇంకా చిత్ర విచిత్రమైన ప్రభావాలు కలగవచ్చు. భారతదేశంలో మనం పేడకుప్పలనుంచి సైకిలుయుగానికి చేరడానికే ఎన్నో తిప్పలు పడుతున్నాము. ఇప్పుడు మనం యేపరిస్థితికి వచ్చామంటే ఎడ్లబండి దశనుంచి స్పుత్నిక్ దశకు చేరుకోవలసిన అగత్యం వుంది. ఒక్కదూకు ముందుకు దూకాలంటే మన పూర్వసంప్రదాయాలు మనకు తోడ్పడతాయా, లేక అవి మనకు గుదిబండలవలె తయారవుతాయా? తక్కిన ప్రపంచమంతా స్పుత్నిక్కుల దిశగా ప్రయాణిస్తూవుంటే మనం స్పుత్నిక్కులు రాకుండా నిలుపగలమా? మనం దీనికి దూరంగా వుంటే మూడునందల యేండ్ల క్రిందట యేలోపంవల్ల మనం పాశ్చాత్యుల తుపాకీలముందు,ఫిరంగీలముందు, యంత్రోత్పత్తిముందు పతనం చెందామో ఇప్పుడుకూడా మనం ఆ పతనావస్థకు పోమా? ప్రపంచంతోపాటు మనమూ ముందుకు పోవాలంటే

రోజు రోజుకూ పుట్టుకొస్తున్న నూత్న శక్తులను మాలిమిచేసికొని ఆ ప్రయత్నంలో మనఆత్మను కోల్పోన కుండా ఎలా వుండగలుగుతాము? ఇదే మనముందున్న సమస్య.

దారిద్ర్యం, రోగాలు, అవిద్య తొలగిపోయే రోజు కను చూపుమేరలోనే వుంది. ఒకమారు మీటనొక్కితే యంత్రం సేవకుడిన లె వచ్చి పనిచేయగలదు. అది చాకకూడా. మరి మానవులను శాశ్వతంగా బానిసలుగా వుంచడం దేనికి? ఈ నాడు మానవునికి నిత్యజీవితావసరాలను సంపాదించుకోవడం లోనే సమయమంతా గడచిపోతూంది. కాని, అలాంటి శ్రమ తప్పి విశ్రాంతి ఎక్కువైనప్పుడు తీరికకాలంలో యేంచేస్తాడు? బానిసత్వంనుంచి కలిగిన స్వేచ్ఛను అతను దేనికి వినియో గిస్తాడు. విసుగుతో బేజారెత్తిపోతాడా? వెర్రెత్తిపోతాడా? తిరిగి అతనికి వివేకం కలగడం సాధ్యమా? నేటి మన స్థితిలో మనం భౌతిక విజ్ఞానాన్ని సముపార్జించడంలో హద్దుదాటి పోయి రక్షణ లేకుండా చేసుకున్నామా? లేదా? హద్దులోపల వుంటే మనకీ బెడదలన్నీ వుండేవా? ఈ ప్రశ్నలకు మనం తేల్చుకునే సమాధానాలపై మన మనుగడ ఆధారపడి వుంటుంది. ఈనాడు మానవుడు సాధనసంపత్తులు లేక, విజ్ఞానం లేక ఇబ్బందిపడటం లేదు. మానవుడు తనకు తానే ఒక విపత్తుగా తయారయ్యాడు. మానవుని ఆత్మకూ, అతను సము పార్జించిన భౌతిక విజ్ఞానానికీ పొత్తు లేకుండావుంది. ఈ స్థితిలో సమన్వయాన్ని ఎలా సాధించగలం? మనం విడుదల చేసిన రాక్షసుని తిరిగి ఎలా మచ్చిక చేసుకొని పట్టుకోగలం?

కొంతకాలం క్రిందట నేను రాజస్తాన్ ఎడారిగుండా ప్రయాణం చేస్తూవుండగా అర్ధరాత్రి అయింది. జీపుడ్రైవరు దారితప్పాడు. దూరంగా ఒక గుడిసెలోంచి సన్నని దీపపు వెలుగు కనిపించింది. అక్కడికి వెళ్ళి ఆగాము. ఆ గుడిసెలోంచి ఒకతను బయటికి వచ్చి ఆ ప్రాంతమంతా తనకు తెలుసుననీ, ఇంకా ఆరుమైళ్ళుపోతే మేము చేరుకోవలసిన చోటికి పోతామనీ, తాను మావెంట వచ్చి దారి చూపగలననీ అన్నాడు. అతన్ని నేను మా జీపులో డ్రైవరుప్రక్కన కూర్చోపెట్టుకుని తీసుకువెళ్ళాను. అయితే, పాపం,అతను ఎప్పుడూ కాలినడకనో, లేక ఎడ్లబండిపైననో ఎక్కడికైనా వెళ్ళేవాడు. కారులో ప్రయాణం చేసి ఎరుగడు. జీపు బయలుదేరిన కాసేపటికే అతనికి దిక్కు తెలియలేదు. ఎటు పోతున్నామో, ఎంతవరకు వచ్చామో అతనికి బొత్తిగా అర్థంకాలేదు. మళ్ళీ వెనక్కెళ్ళే దారి అంతకన్నా తెలియలేదు. మానవజాతికూడా ఇలాగే దారీ తెన్నూ తెలియకుండా అయోమయత్వంలో పడిపోతుందా?

---



# 6. నవయాత్ర

సేవాగ్రామ్‌నుండి

ప్రపంచం నేడు క్లిష్టస్థితిలో వుంది; యుగసంధిలో వుంది. ఈ పుస్తకం మొదటిభాగంలో క్లిష్టసమస్యలను క్లుప్తంగా చర్చించడమైనది. గ్రామపంచాయతీలలో, సహకారసంఘాలలో మన ప్రజాస్వామ్యవ్యవస్థలో తలయెత్తిన విపత్తులను తెలుసుకున్నాము. విదేశాలలోని విపత్కరస్థితిని ముచ్చటించుకున్నాము. అసలు మానవాత్మ ఎదుర్కొంటున్న సంకటస్థితిని గుర్తించాము. అయితే విపత్తుల నన్నిటిని లెక్కించుకుని వాటి కారణాలను వెదకినందువల్ల ప్రయోజనం లేదు. ఎక్కడ, ఎందుకు, ఏ లోపం వుందో తెలుసుకోవడం మంచిదే. కాని, ముందుకు సాగిపోవాలంటే సమస్యలకు పరిష్కారాలు ఆలోచించాలి. అవి ఆచరణసాధ్యమైనవిగా వుండాలి. అందుకనే "సరియైన ప్రశ్నలోనే సగం సమాధానం వుంటుంది." అని విజ్ఞులు చెప్పుతారు. ఈ పుస్తకం మొదటిభాగంలో వచ్చిన ప్రశ్నలు అలాంటివనే అనుకుందాము.

1893-వ సంవత్సరంలో బాపూ దక్షిణాఫ్రికా వెళ్ళాడు. అక్కడ ఒక కేసులో చిక్కుకొని వున్న తన కాతాదారు

తరఫున వాదించడానికి వెళ్ళాడు. ఆయన అప్పుడే ఇంగ్లండులో బారిస్టరీ చదివి వున్నాడు. దక్షిణాఫ్రికా చేరగానే ఆయనను తెల్లజాతివారు ప్రయాణంచేసే పెట్టెలోకి ఎక్కనివ్వలేదు. తాను ఎక్కితీరతానన్నాడు. తెల్ల పాలకుల హయాములో పాలితప్రజల దుర్గతిని ఆయన అప్పుడు తెలుసుకున్నాడు. ఆయనను దెబ్బలు కొట్టారు. స్పృహ తప్పి పడబోయి సంబాళించుకున్నాడు. అది మిగుల బాధాకరమైన అనుభవం. కాని అది బాపూజీకీ, ఆయనద్వారా భారతదేశానికీ ఎంతో మేలు చేసిందని చెబితే చాలామంది నమ్మరు. మానవాత్మ ఎదుర్కొనబోయే విపత్తును బాపూజీ ముందుగానే గ్రహించాడు. ఆ విపత్తు లోతుపాతులను ఆయన చూడగలిగాడు. పాశ్చాత్య దేశాలు పశుబలంతో, ఏమీ లేనిదానికంటె వచ్చినంతవరకే లాక్కుందామని చేసే ప్రయత్నాలను గ్రహించాడు. తన భారతదేశంలోగూడ ఇటువంటి స్వార్థం, పీడన మొదలగు చెడుగులవల్లనే అనర్థాలు దాపురిస్తున్నాయని తెలుసుకున్నాడు. దీర్ఘవ్యాధికి స్వల్పకాలపు చికిత్సవల్ల ప్రయోజనం వుండదు. పునాదినుంచి వున్న చెడుగును పునాదినుంచే బాగుచేసుకురావాలి. ఈ అరిష్టాలనన్నిటిని పోగొట్టాలంటే భారతదేశంలోని ప్రముఖులుకూడా తగు మూల్యం చెల్లించాలి.

స్వాతంత్ర్యసమరాన్ని ఒక క్రొత్త పద్ధతిలో నడపాలని బాపూజీకి తెలుసు. ఆ సమరాన్ని చివరికంటా నడిపితే భారతదేశానికి స్వాతంత్ర్యం తప్పక వస్తుంది. అయితే ప్రజల ముఖ్యశత్రువులు ప్రజల్లో వున్న చెడుగులే. వలసపాలకులతో స్వాతంత్ర్యంకోసం చేసే యుద్ధం ఒక రోజులో ముగుస్తుంది.

కాని మనిషిలోని చెడుగు ఒకపట్టాన పొయ్యేది కాదు. అది అతనిలో జీర్ణించివుంటుంది. కనుక ఆ చెడుగును ఎల్లప్పుడూ ఎదుర్కోవాలి. స్వాతంత్ర్యసమరం ముగిసిన తరువాత అసలు యుద్ధం ప్రారంభమవుతుందని గాంధీజీకి తెలుసు. స్వాతంత్ర్య యుద్ధం కొనసాగుతూ వుంటుంది. దేశస్వాతంత్ర్యంకోసం పోరాడిన పార్టీయే ప్రజలు చెడుగులనుండి విముక్తులు కావడానికి కూడా తగు సన్నద్ధం చేయాలి. స్వాతంత్ర్యమంటే వలసపాలకులు వదలిపోయిన స్థానాలను దేశనాయకులు ఆక్రమించుకోవడం కాదు. పై వారి పరిపాలన అయినప్పుడు అది తెల్లవారి పరిపాలన అయితేనేమి, దేశీయుల పరిపాలన అయితేనేమి? పైనుంచి చేసే పరిపాలన—అది దేశీయులు చేసేది అయినప్పటికీ—ప్రజలనుఅణచివేసేదే అవుతుంది. అది బెల్లంకాదు; చివరకి విషంగాకూడా తయారుకావచ్చు. సాటి సోదరుడు చేసే నిరంకుశపుపనులు దారుణంగా, అత్యంత బాధాకరంగా వుంటాయి. కనుకనే స్వాతంత్ర్యం ముగిసిన తరువాతనే లోకసేవాసంఘమును పెట్టి రాజకీయపార్టీ ప్రజలకు సేవచేసేదిగా వుండవలెనని గాంధీజీ చూప నిశ్చయించుకున్నాడు.

స్వాతంత్ర్యానంతరం భారతదేశం తన నూతనజవసత్వాలలో ప్రపంచరంగంమీదికి వచ్చి తన పాత్రను నిర్వహించవలెనని గాంధీజీ అభిలషించాడు. కాని వచ్చిన యంత్రాలు పోవనీ, అవి అలాగే వుండిపోతాయనీ ఆయనకు తెలుసు. అయితే యంత్రం మనిషికి సేవచెయ్యాలి కాని మనిషి యంత్రానికి బానిస కారాదు. కనుక ఈ సమస్యను

ధైర్యంగా ఎదుర్కొని యంత్రాన్ని తన అదుపులో పెట్టుకో వాలి. ప్రపంచంలో ప్రజాస్వామ్యసిద్ధాంతం ఇంకా వ్యాపించ వలసివున్నదనీ, ప్రజాస్వామ్యానికీ, హింసకూ జత కలవదనీ, నిత్యజీవితావసరాలకు పరిశ్రమలను కేంద్రీకరించడంవల్ల హింసకు దారితీస్తుందనీ ఆయనకు తెలుసు. అది ప్రజాస్వామ్యం పునాదిని నాశనం చేస్తుంది. కనుక మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారతదేశస్వరూపాన్ని ఏవిధంగా తీర్చి దిద్దాలి? గాంధీజీ ఎటువంటి భారతదేశంకోసం కలలుగన్నాడో ఆయన వ్రాసిన ఈక్రిందిపంక్తులనుబట్టి మనం తెలుసుకోవచ్చు.

"గ్రామపరిపాలనను గ్రామపంచాయతీ నిర్వహించాలి. అందులో ఐదుగురు సభ్యు లుండాలి. వీరు నిర్ణీత కనీస యోగ్యతలు గల గ్రామ వయోజనులైన స్త్రీ పురుషులచే ఏడాది కొకమారు ఎన్నుకో బడాలి. వీరికి అన్ని అధికారాలూ వుండాలి. ఈ పంచాయతీ శాసన సభగా, న్యాయస్థానంగా, కార్యనిర్వాహకాధికారిగా పనిచెయ్యాలి... ...ఇక్కడ వ్యక్తిస్వాతంత్ర్యంపై ఆధారపడ్డ సంపూర్ణ ప్రజాస్వామ్యం వుంటుంది.

వ్యక్తి తన ప్రభుత్వానికి తానే నిర్మాత. అతనూ, అతని గ్రామమూ కలసి ప్రపంచశక్తినే ఎదిరించవచ్చు. తన గ్రామాన్ని, గౌరవాన్ని రక్షించుకోవడంలో అతడు మృత్యువునైనా ఎదు ర్కొంటాడు.

అయితే గ్రామస్థులు పొరుగువారిపై, తక్కిన ప్రపంచంపై ఆధారపడివుండనక్కర లేదని చెప్పడం లేదు. ఇష్టపూర్వకంగా ఎవరైనా సాయపడవచ్చు. అట్టి సహాయం స్వేచ్ఛగా, స్వచ్ఛందంగా జరగాలి."

ఒక సిద్ధాంతాన్ని చెప్పడం వేరు, దానిని ఆచరించి చూపడం వేరు. అయితే బాపూ ఇవన్నీ బాగా తెలిసిన వాడు. ఇప్పుడు మహారాష్ట్రంలో వున్న వార్ధాజిల్లాలోని

సేవాగ్రాంలో బాపూజీ తన 'ప్రయోగశాల'ను నెల కొల్పాడు. ఈ ఇరవయ్యోశతాబ్దిలో ఆశ్రమం పనికిరాదని ఆయనకు తెలుసు. ఆశ్రమాన్ని గ్రామసీమలతో కూడ కలిపి, రెండిటికీ రాకపోకలు, సంబంధబాంధవ్యాలు వుంటే అది ప్రయోజనకర మవుతుంది. ఈ విధంగా బాపూజీ భారత దేశంలో సామాజికాభివృద్ధికార్యక్రమానికి స్థాపకుడు, మార్గ దర్శి అయ్యాడు.

గ్రామజీవితానికి వ్యవసాయం, పశుపోషణ ముఖ్య ప్రాతిపదికలని ఆయనకు తెలుసు. కనుకనే ఆశ్రమంలో సాంద్రతరవ్యవసాయ, పశుపోషణ, పశుసంవర్ధనశాఖలను పెట్టాడు. స్థానికంగా లభించే అన్నిరకాల ఎరువులను నేలలకు వుపయోగించి చూపాడు. పిల్లలకూ, పెద్దవాళ్ళకీ ప్రాతిపదిక విద్యావిధానపు పాఠశాలలను నెలకొల్పాడు. దీనికే ఆయన నయీ తాలిం (కొత్తవిద్య)అని పేరుపెట్టాడు. పిల్లలు పనులు చేసి విద్యలు నేర్చుకోవాలి. ఆ విద్యలలో స్వయంగా నైపుణ్యం సంపాదించాలి. కాయకష్టమును గౌరవించాలి. పాఠశాలలో ఉన్నత సాంకేతిక విధానాలు నేర్పడమే గాక గ్రామస్థులు సంఘంలో ఎలా మెలగవలెనో కూడా బోధించడం వుండేది. పాఠశాలే ఒక సామాజిక కేంద్రమై గ్రామస్థులకు ఉత్తేజము కలిగిస్తూవుండేది.

పల్లెప్రజలకు ప్రపంచపరిజ్ఞానము కలిగిస్తూ వారి మాన సిక వినోదమునకై వైజ్ఞానికకార్యక్రమాలుకూడ నిర్వహింప బడుతూవుండాలి. సంఘంలో కొందరు దళితప్రజలు వుంటే అది మనకు క్షేమకరం కాదు. కనుకనే అస్పృశ్యతను తొల

గించి దళితవర్గాలకు ప్రత్యేకసదుపాయములు కలిగించుటకై హరిజనసేవాసంఘం నెలకొల్పబడింది. వ్యవసాయం, పశుపోషణలవల్ల శరీరానికి ఆహారం లభిస్తుంది; పాఠశాలవల్ల బుద్ధికీ, ఆత్మకూ వికాసము కలుగుతుంది. ఇంక పోతే బట్ట, ఇల్లు వంటి సమస్యలు వున్నవి. కనుకనే నూలు వడకడం, బట్టలు నేయడం కుటుంబ పరిశ్రమలుగా పెట్టి ఆ సమస్యలను పరిష్కరింప బూనుకున్నారు. గ్రామ ఆర్థిక కార్యక్రమంలో గ్రామీణ, కుటీరపరిశ్రమలు ఒక భాగమైవుండాలి. ఈ కార్యక్రమాలకు సమన్వయం కలిగించి వీటికి సహాయము, మార్గదర్శకత్వము లభింపజేసి, ఇవి ఒకదానికొకటి పరస్పర పోషకములుగా వుండడానికై స్వతంత్రమైన అఖిలభారత సంస్థలు స్థాపింపబడ్డవి. మహాత్మాగాంధీయొక్క ఈ విచిత్రాలోచనలను, కార్యకలాపాలను వలసప్రభువులు ద్వేషభావంతో చూచారు. ఈ కార్యకలాపాలు జాతినిర్మాణానికి ప్రాణప్రదమైన నైనప్పటికీ వారు వాటికి ధనసహాయం చేయలేదు. పైగా వెనుకనుంచి ఈ కార్యక్రమాన్ని క్షీణింపజేయ ప్రయత్నించారు. కాని వారి ప్రయత్నాలవల్ల ఏమీ జరగలేదు.

బాపూజీ సేవాగ్రాంలో ఇట్టి జాతినిర్మాణ కార్యకలాపాల్లో నిమగ్నులై వుండగా భారతదేశంలో మరొకమూల—శాంతినికేతనంలో రవీంద్రనాథటాగూరు వేరొక విధానంద్వారా సరిగ్గా ఇటువంటి నిర్మాణకార్యక్రమాన్నే నడిపాడు. భారతదేశాన్ని పునరుజ్జీవింప జేయవలెనంటే దీని సమస్యలను పునాదినుంచి పరిష్కరించుకుంటూ రావాలని టాగూరు గ్రహించాడు. ఆకులద్వారా నీరుపోసి ఎరువువేస్తే

కొంత ఫలితం అప్పటికప్పుడు కన్పించవచ్చు. కాని అలాంటి మొక్కలు గాజు ఇండ్లలో అలంకారార్థం వుండేవి. ప్రపంచ మనే రంగస్థలంపై భారతదేశం తన పాత్రను నిర్వహించవలె నంటే భారతసంస్కృతిని పునర్వికసింప జేయాలి.

భారతదేశపు పునాదులు దాని గ్రామాలలో వున్నవి. పునర్వికాసమంటే పునాదులను దృఢం చేయాలి. ఈ లక్ష్యం తోనే శ్రీనికేతనములో గ్రామపునర్నిర్మాణ ప్రయోగం ఆరంభమయింది. ఈ ప్రయోగంలో డాక్టర్ ఎల్మహర్స్ట్ అనే అభిజ్ఞుడైన ఆంగ్లేయుడు టాగూరుకు సహాయకుడుగా వున్నాడు. ఈ విధంగా ఒక సర్వసాధారణ కృషిలో ప్రాచ్య పాశ్చాత్యసీమలు వేరొక రంగంలో కరచాలనం చేసుకొని పరస్పరసహకారంతో పనిచేశాయి. ఆశ్చర్యకరమైన విశేష మేమిటంటే సేవాగ్రాంలో మహాత్మాజీ ఎటువంటి కృషి సలుపుతూవచ్చారో సరిగ్గా అటువంటి కృషే రవీంద్రుడు శ్రీ నికేతనంలో ప్రారంభించిన గ్రామపునర్నిర్మాణకార్యక్రమం ద్వారా జరిగింది. ఇద్దరి మార్గాలూ వేరైనా ఇద్దరూ ఒకే లక్ష్యసిద్ధికోసం పాటుపడ్డారు.

ఈ రెండు కార్యక్రమాలూ ఇలా అమలు జరుగుతూ వుండగా అప్పటి తిరువాన్కూరురాష్ట్రంలో వున్న మార్తాండం అనే చోట డాక్టర్ స్పెన్సర్ హాచ్ అనే క్రైస్తవమత ప్రచారకుడుకూడా తనకు తోచినరీతిగా గ్రామపునర్నిర్మాణ కృషి చేయదొడగినాడు. మార్తాండంలోని వై. యం. సి. ఎ. ఆయనకు కేంద్రంగా వుంది. ఆయన తన కార్యక్రమాన్ని పరిసరగ్రామాలకుకూడా విస్తరింపజేశాడు. ఇక్కడకూడా

వ్యవసాయం, పశుపోషణ, గ్రామపరిశ్రమలు, విద్య, ప్రజా రోగ్యం వంటి అంశాలేగాక స్వయంసహాయం, దైవభక్తి, సోదరమానవప్రేమ మున్నగువాటిపై ఆధారపడిన స్థానిక కార్యకలాపాలుకూడా వుండేవి. మార్తాండంకార్యక్రమం నేటికీ అమలుజరుగుతున్నది. దాని వ్యవస్థాపకుడైన డాక్టర్ స్పెన్సర్ ముద్ర, ఆయనప్రభావం దానిపై నేడూ కన్పిస్తాయి. ఇప్పు డది కేరళరాష్ట్రంలో సామాజికాభివృద్ధికార్యక్రమంలో ఒక భాగమైవుంది. అయితే మొదట జరిగిన కృషికి భిన్నమైన దేదీ ఇప్పుడూ జరగడంలేదు. వెనుకటి కృషిని ప్రాతిపదికగా పెట్టుకొని దానిని ఇంకాముందుకు తీసుకుపోవడం జరుగుతున్నది.

ఇవన్నీ ఇలా వుండగా బరోడాసంస్థానంలో ప్రభుత్వ ఆధ్వర్యాన మరొక ప్రయోగం ఆరంభమయింది. ఈ ప్రయోగం గ్రామజీవితానికి సంబంధించిన పశుపోషణ, వ్యవసాయం, విద్య, ప్రజారోగ్యాల విషయంలో కొత్త భావాలను ప్రస్ఫుటింపజేసింది. ఒకానొక ముఖ్యఘట్టంలో ప్రతిభాశాలి అయిన,పరిపాలనాసామర్థ్యం గల వ్యక్తి ఆ సంస్థానానికి దివానుగావున్నాడు. ఆయన ఎవరో కాదు, మొన్నటి వరకుం ప్రణాళికాసంఘానికి ఉపాధ్యక్షులుగా పనిచేసిన శ్రీ వి. టి. కృష్ణమాచారి. ఆయన స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రణాళికా సంఘానికి మార్గదర్శియై ప్రణాళికలను నిర్వహిస్తూ వచ్చిన శేముషీధురంధరుడు. బ్రిటిషు అధికారులకు పెట్టని కోటయైన మదరాసురాష్ట్రంలో పాలకోద్యోగియై ఆయన స్వయంప్రతిభతో ఉన్నతపదవుల నందుకున్నాడు. మదరాసు రాష్ట్రంలో పనిచేస్తూ వున్నప్పుడే గ్రామాల స్థితిగతులను

బాగా ఆకళింపుచేసుకున్నాడు. బరోడా సంస్థానంలో రైతులు దృఢగాత్రులు. అట్టి ప్రజల ఉన్నతివల్ల బరోడాభవిష్యత్తు నిర్ణయమవుతుందని గ్రహించాడు. అభిజ్ఞుడైన ఆ సంస్థాన పాలకుని ఆధ్వర్యాన శ్రీకృష్ణమాచారి గ్రామోద్ధరణ కార్యక్రమాన్ని ఆరంభించాడు. అందులో నేటి సామాజికాభివృద్ధి కార్యక్రమం ముఖ్యలక్షణాలన్నీ వుండేవి. బరోడాసంస్థానపు ప్రభుత్వం అండదండలతో ఆ కార్యక్రమం త్వరితగతిని విస్తరించింది. అది అమలుజరిగి నేటికి కొన్ని దశాబ్దాలు గడచినప్పటికీ దాని ప్రభావం ఆ ప్రాంతమంతటా ఇప్పటికీ కనిపిస్తుంది.

1930 ప్రాంతంలో గుడుగాం జిల్లాకలెక్టరుగా వున్న బ్రిటిషు అధికారి యఫ్. యల్. బ్రేన్ ఆ జిల్లాలో పైన చెప్పినటువంటి విస్తరణ కార్యక్రమము నొకదాన్ని ఆచరించి చూచాడు. బ్రేన్ గొప్ప మేధావి. ప్రతిరంగంలోనూ అభివృద్ధిని సాధించాలని ఆయన నిశ్చయించుకున్నాడు. కాని రెండు లోపాలవల్ల ఆ కార్యక్రమం ముందుకు సాగలేకపోయింది. మొదటి దేమిటంటే, భారతదేశాన్ని పాలిస్తూవున్న విదేశీ ప్రభుత్వం తలపెట్టడం. అందుచేత గాంధీగారు తలపెట్టిన కార్యక్రమాన్ని మించిన కార్యక్రమం అది అని ప్రజలకు చెప్పవలెనన్న ఉద్దేశంతో ఆరంభింపబడిందని దేశీయులు అనుకున్నారు. రెండవ లోపం దాని నిర్వాహకుడే అని చెప్పాలి. మానవుని బుద్ధి, అతని పరిసరాలు సంస్కరింపబడవలె నని ఉత్తర్వు చేయడమే ఆయన తన పనిగా పెట్టుకున్నాడు. తాను పైన వుండి తన అధికారులద్వారా దానిని పైనుంచి దిగువ

స్థాయివరకు అనులు జరిపించవచ్చు ననుకున్నాడు. కార్యక్రమం కొద్దికాలంలోనే బాగా అమలుజరిగిన మాట వాస్తవమే. కాని బ్రేన్ ఆక్కడనుంచి మరొకచోటికి బదిలీ కాగానే అది పేకలమేడవలె కూలింది. గుడుగాంలో బ్రేన్ చేసిన కృషి చిహ్నాలేవీ నేడు కనిపించవు. ఆ కృషి పూర్వోత్తరాలను విశదీకరించే కవిలెలుకూడా లభించలేదు.

ఈవిధంగా స్వాతంత్ర్యం రాకపూర్వం ఈ శతాబ్ది పూర్వార్థభాగంలో భారతదేశంతో వివిధవ్యక్తులద్వారా గ్రామపునర్నిర్మాణకార్యక్రమం అమలుజరిగింది. వీటివల్ల మనం నేర్చుకోదగ్గ సామాన్యగుణపాఠాలు కొన్ని వున్నాయి. భారతదేశాన్ని పునరుజ్జీవింపజేయాలంటే దాని పునాదులను బలపరచాలి. ఆ పునాదులు గ్రామాలలో వున్నాయి. పునాదులను బలపరచడానికి మార్గమేమిటీ అంటే గ్రామపుబహుముఖ్య అవసరాలను ఏకకాలంలో తీర్చప్రయత్నించాలి. పునర్నిర్మాణ కార్యక్రమాన్ని ప్రజలే చక్కగా అవగాహన చేసుకొని ప్రారంభించాలి. అంతేగాని, పైనుంచి ఒకరు విధించకూడదు. పైన వుండే నాయకులు ప్రజలతో కలిసి వారికి తోడ్పడవచ్చు. కాని, విధాననిర్ణేతలుగా వ్యవహరించకూడదు. గ్రామ పునర్నిర్మాణకార్యక్రమంలో ప్రభుత్వవైఖరి, ప్రభుత్వం అవలంబించే మార్గం చాలా ముఖ్యమయినవి. ప్రభుత్వం కార్యక్రమంపట్ల సానుభూతి చూపాలి. సామగ్రి సరాఫరా చేసి, డబ్బిచ్చి, సాంకేతికసహాయంచేసి ఆదుకోవాలి. ప్రారంభదశలో ప్రభుత్వం నాయకత్వాన్నికూడా సమకూరిస్తేనే కాని అభివృద్ధి త్వరితగతిని జరగదు. అయితే

ఎల్లప్పుడూ ఏ ప్రయత్నం జరిగినా అది పునాదులను బల పరిచేదై వుండాలి. అంటే ప్రజల్లోనుంచి పుట్టుకొచ్చిన నాయ కత్వాన్ని ప్రోత్సహించేదిగా వుండాలి.

ఎటావా, నిలోఖేరి

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి రావడంతోటే దేశవిభజన జరిగింది. కలహాలు, కల్లోలాలు జరిగాయి. పాకిస్తాన్‌నుండి భారతదేశానికీ, భారతదేశంనుండి పాకిస్తాన్‌కూ లక్షలాది ప్రజలు శరణార్థులై వలసపోవటం జరిగింది. బ్రిటిషువారు విడిచిపోయిన ప్రభుత్వ యంత్రాంగానికి మననాయకులు కొత్తవారు. పైగా ఉద్యోగుల బదిలీలుకూడా జరగటంచేత, ఆ ఖాళీలుకూడా సముచితంగా భర్తీచేయవలసి వచ్చింది. అందునిమిత్తమై కొందరు ఆఫీసర్లకు తగు అనుభవం లేకపోయినప్పటికీ డబుల్ ప్రమోషన్‌లు ఇవ్వబడ్డవి. స్వతంత్రభారతానికి అను గుణంగా కొత్త పరిపాలనను సరిచేసి తీర్చి దిద్దవలసి వచ్చింది. మొదట శరణార్థులకు నిలువ నీడ కల్పించవలసి వచ్చింది. ఆహారసమస్యతోపాటు అనేక సమస్యలను సత్వరమే పరిష్క రించవలసివచ్చింది. గ్రామసీమలకు తగిన అఖిలభారత కార్య క్రమ మేదీ లేకపోయింది. సత్వరావసరాలకు ప్రాధాన్యమివ్వ వలసివచ్చింది. గ్రామాభివృద్ధికార్యక్రమం దీర్ఘకాలికమైనది కనుక అది వేచివుండవలసి వస్తుంది. ఈ క్లిష్టస్థితిలోనే బాపూ భారతప్రజలకు లేకుండాపోయాడు. బ్రిటిషుపరిపాలననుండి స్వరాజ్యానికి మధ్య సంధికాలలో భారతదేశం ఎన్నో ఇక్కట్లు ఎదుర్కోవలసి వచ్చింది.

అయినప్పటికీ గ్రామాభివృద్ధి నిలిచిపోలేదు. సేవా గ్రాంలో, శ్రీనికేతనంలో వాటివాటి తీరులలో అభివృద్ధిపని సాగుతూనేవుంది. అలాగే ఇతరచోట్లకూడా లభ్యమైన సాధన సంపత్తితోనే కార్యక్రమాలు అమలుజరుగుతున్నాయి. స్వాతంత్ర్యం తరువాత ఒకదానికొకటి పోషకముగా వుండేటటువంటి రెండు ముఖ్యప్రయోగాలు రంగంలోకి వచ్చాయి. అవి రెండూ ఏకకాలంలోనే అమలుజరుగుతూపోయాయి. కాని చిత్రమైన విశేష మేమిటంటే, మొదటిదశలో అవి ఒకదానికొకటి పరిచయంకాలేదు. అవే ఎటావా, నిలోఖేరీ ప్రయోగాలు. వీటి రెండిటిని గూర్చి చెప్పేముందు మద్రాసు, ఆంధ్ర కలిసి వున్నప్పటి సమిష్టిరాష్ట్రంలో జరిగిన విశేషాన్నికూడా ఇచట ప్రస్తావించటం సముచిత మనుకుంటాను.

మదరాసురాష్ట్రం సుదృఢమైన పరిపాలనకూ, మేధావులైన నాయకులకూ, తెలివిగల ప్రజలకూ పేరొందినది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా వున్న ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులుగారు గ్రామాభివృద్ధికై ఒక కార్యక్రమాన్ని ఆరంభించారు. దీనినే ఫిర్కా-అభివృద్ధిపథక మని అన్నారు. ప్రతిఫిర్కాలో 15,000 మొదలు 30,000 వరకు ప్రజలకు ఆ కార్యక్రమం వర్తించేది. ప్రతిఫిర్కాకు కొందరు ఉద్యోగులను, కొంత ధనాన్ని కేటాయించారు. ఈ పథకం ముఖ్యలక్ష్యం ప్రజలలో స్వయం సహాయాన్ని పెంపొందించడం. ఈ కార్యక్రమం రాష్ట్రమంతటా వ్యాపించింది. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క

విధంగా ఫలితాలు కలిగాయి. ఈ ప్రయోగంకూడా అభివృద్ధి కార్యక్రమాల ఆవశ్యకతను చాటింది.

ఎటావాపైలట్ ప్రాజెక్టు 91 గ్రామాలకు సంబంధించి నది. ఈ గ్రామాలు ఎటావాజిల్లాలో వున్నాయి. వీటి జనాభా 60,000. ఈ ప్రయోగాన్నిగూర్చి ఆలోచించి దీని కొక కార్య రూపం ఇచ్చినవారు అమెరికావాస్తుశిల్పి ఆల్బర్టు మేయర్స్, అమెరికన్ విస్తరణకార్యకర్త హోరేస్ హోమ్సు. వీరిద్దరు మిగుల ప్రతిభావంతులు. వీరు ఐదేండ్లపాటు ఈ ప్రాజెక్టుతో సంబంధం కలిగివున్నారు. ఎటావాప్రాజెక్టు ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి అప్పుడు ముఖ్యమంత్రిగా వున్న పండిత గోవింద వల్లభపంత్ ఆధ్వర్యాన ప్రారంభమయింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ అధికారులు ఈ కార్యక్రమవిస్తరణకు పనిచేశారు. కార్యకర్తలందరికి ప్రత్యేకశిక్షణ ఇవ్వబడింది. ఈ కార్య క్రమంలో వ్యవసాయానికి హెచ్చు ప్రాధాన్య మిచ్చారు. భారతదేశానికి వ్యవసాయం ప్రాణాధారమైన పరిశ్రమ అనీ, కనుక అన్నిటికంటె ముందు దానిని అభివృద్ధిపరచవలెననీ అమెరికామిత్రులు అన్నారు. అయితే ప్రత్యేకశిక్షణ పొందిన విస్తరణోద్యోగులు లేనిదే వ్యవసాయ కార్యక్రమం ముందుకు సాగదని వారు చెప్పారు. పైగా మన భారతీయుల అనుభవం కూడా దృష్టాంతంగా వుంది. అమెరికన్ సలహాదార్లు, భారత ఉద్యోగులు తరచు సంగతిసందర్భాలను చర్చించి ఏవిధంగా చేస్తే బాగా వుంటుందో నిర్ణయించేవారు. ఈ విధంగా అమెరికావ్యవసాయవిస్తరణసిద్ధాంతం, భారతపరిపాలనావిధా నము సమ్మేళనము చెంది ఎటావాకార్యక్రమం రూపొందింది.

ఆరోగ్యం, పారిశుధ్యం, నయోజనవిద్య మున్నగు కార్య క్రమాలుకూడా ఆచరింపబడ్డాయి.

పంజాబురాష్ట్రంలో గ్రాండ్ట్రంక్ రోడ్డుపై కర్నాల్, పిప్లీల మధ్య నిలోఖేరీ వుంది. ఇది పట్టి చిత్తడినేల. ఇక్కడ వ్యవసాయం, పరిశ్రమలు కలిసివుండేవి. బస్తీని నిర్మించడానికై చిత్తడినేల బాగుపరచబడింది. నిర్వాసులైనవారికి పునరావాసం కల్పించే నిమిత్తం ప్రయోగాత్మకంగా ఒక కేంద్రము నెలకొల్పడమే దీని ముఖ్యలక్ష్యం. పశ్చిమపాకిస్తాన్‌నుండి భారతదేశానికి వచ్చిన శరణార్థులలో హెచ్చుమంది వర్తకులు. వారికి తగు అవకాశాలు కల్పించినట్లైతే వారు తిరిగి జీవితములో స్థిరపడగలుగుతారు. కాని వారిని ప్రస్తుతనగరాలలో, బస్తీలలో వదిలివేయడానికి వీలులేదు. అప్పటికీ మన పట్టణాలలో వర్తకవ్యాపారాలపై వచ్చే ఆదాయాలు అంతంతమాత్రంగా వున్నాయి. శరణార్థులుకూడా చేరి వ్యాపారుల సంఖ్య ఎక్కువైతే, 'మంది ఎక్కువైతే మజ్జిగ పల్చనైనట్లు' ఎవరికీకూడా కుటుంబం గడిచే రాబడి వుండదు. అయితే, నిర్వాసులు వ్యవసాయ పారిశ్రామికాభివృద్ధికి ఉపకరించగలరు. పెద్ద చిక్కేమీ లేకుండానే అయిదారువేలమంది నివసించే బస్తీని ఒకదానిని నిర్మించవచ్చు. అందులో విద్య, వైద్యం, ప్రజోపయోగకర నిర్మాణాలు, విద్యుచ్ఛక్తి సరఫరా వంటివి ఏర్పాటుచేయడమేగాక వస్తువుల విక్రయానికీ, సరుకుల విడుదలకూ, ప్రజల వినోదానికీ సౌకర్యాలు కల్పించవచ్చు. ఇట్టి బస్తీలో వ్యవసాయం, పశుపోషణ, కుటీరపరిశ్రమలకు విస్తరణ వసతులు కల్పించడమేగాక అది రైతుబిడ్డలకూ, గ్రామచేతి

పనులవారికీ, వృత్తిపనులవారికీ శిక్షణకేంద్రంగానూ, సేవా కేంద్రంగానూ, సరఫరా కేంద్రంగానూ కూడా ఉపయోగపడ గలదు. చుట్టూ వున్న గ్రామాలకు ఇట్టి బస్తీవల్ల ఎన్నో సదుపాయాలు కలుగుతాయి. అంతేగాక అది గ్రామాల్లోని ధాన్యమును, ఇతర ఉత్పత్తులను సేకరించి పట్టణవాసులకు సప్లైచేయవచ్చు. ఈ విధంగా గ్రామాలకూ, బస్తీకీ ఇచ్చి పుచ్చుకునే ఆర్థికవ్యవస్థ రూపొందుతుంది. అప్పుడు బస్తీ గ్రామాన్ని పీడించుకుతింటూవుందని అనడానికి వీల్లేదు. ఒకరి నొకరు పీడించుకోవడమే వుండదు. కురుక్షేత్ర శిబిరంనుండి నిలోఖేరి ఆవాసకేంద్రనిర్మాణం ఆరంభమైనప్పటినుండి మన ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ శుభాకాంక్షలు తెలిపి వున్నారు. దీని అభివృద్ధికార్యక్రమం 1951 చివరికల్లా పూర్తిఅయింది. ఈ కార్యక్రమం కేంద్రప్రభుత్వ పునరావాస శాఖ పర్యవేక్షణక్రింద నిర్వహింపబడింది.

అంతవరకూ ఎటావాసంగతి నిలోఖేరీకి తెలియదు; నిలోఖేరీలో జరుగుతూవున్న పని ఎటావాకు తెలియదు. కాని రెండూ వాటివాటి మార్గాలలో ఒక సమన్వీకృతకార్యక్రమా నికి పరస్పరపూరకములుగా పనిచేశాయి. ఆలాగా 1950 లో ప్రధానమంత్రి ప్రత్యేక ఉత్తరువు ననుసరించి భారతప్రభుత్వం తాతాపరిశ్రమలకు చెందిన శ్రీ పి. ఎ. నారియల్‌వాలా అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించింది. నిలోఖేరీ పథకాన్ని పరిశీలించి దాన్ని విస్తరింపజేసే అవకాశాలను వెదకడమే ఈ సంఘం చేయవలసిన పని. ఈ సంఘంలో వాస్తుశిల్పియైన

డా॥ కోనిన్ బెర్గర్, నేనూ తక్కిన సభ్యులం. గ్రామప్రాంతా లను అభివృద్ధిపరచే విషయంలో వ్యావసాయిక-పారిశ్రామిక ఆర్థికవ్యవస్థను అవలంబించవలసిందిగా నారియల్ వాలాసంఘం సూచించింది. ఆ సంఘం నివేదికలో వ్యావసాయిక - పారి శ్రామికబస్తీ ఏర్పడవలెననీ, ఆ బస్తీకి పరిసరాలలో వున్న గ్రామాలు చేయూతనివ్వవలెననీ, అందుకు బదులుగా ఆ బస్తీ ఆ గ్రామాల అవసరాలు తీరుస్తూవుండవలెననీ. ఈ విధంగా బస్తీ, గ్రామాలు ఒకదానికొకటి సహాయకంగా వుండవలెననీ వివరించబడింది. అందుకు మొదట పశ్చిమపాకిస్తాన్‌నుండి, తూర్పుపాకిస్తాన్‌నుండి భారతదేశానికి వచ్చిన శరణార్థులకు పునరావాసం కల్పిస్తూ కార్యక్రమాన్ని ఆరంభించవలసిందని చెప్పారు. అయితే ఆ సంఘంవారి నివేదికను ఆచరణలో పెట్ట డానికి కాల మింకా ఆసన్నం కాలేదు.

ఈలోపుగా అమెరికన్ ఫోర్డు ఫౌండేషన్ అధ్యక్షులైన పాల్‌హాఫ్‌మన్ 1951-వ సంవత్సరారంభంలో భారతదేశానికి వచ్చారు. భారతదేశ ప్రాథమికాభివృద్ధి విషయంలో ఫోర్డు ఫౌండేషను ఎలా సహాయపడగలదో తెలుసుకోవడానికి ఆయన మన దేశానికి వచ్చారు. దేశమంతటా పర్యటించి పరిస్థితులను స్వయంగా చూచినమీదట ఫోర్డు ఫౌండేషను గ్రామాభివృద్ధి కార్యక్రమానికి ఆరంభించవలెనని ఆయన తెల్పారు. ఇంచు మించు ఎటావాపద్ధతిలోనే నమూనాగా మొదట పదిహేను అభివృద్ధి కార్యక్రమాలు 1951 మధ్యకాలంలో వివిధరాష్ట్రా లలో ఆరంభింపబడ్డవి. విస్తరణోద్యోగులకు శిక్షణ యివ్వ డానికై శిక్షణకేంద్రాల పథకంకూడా తలపెట్టబడింది. దీని

ముఖ్యోద్దేశం బహుళప్రయోజనాలకు ఉపయోగపడగల కార్యకర్తను తయారుచేయడమే. అటువంటి కార్యకర్త వ్యవసాయకార్యక్రమంలో వివిధవిషయాలకు ప్రథమసహాయం చేయగలవారై వుండాలి. ఫోర్డుఫౌండేషనువారి ఆర్థిక సహాయంతో భారతదేశంలోని ఐదు వ్యవసాయకళాశాలలలో ఐదు శిక్షణకేంద్రాలు ఆరంభింపబడ్డవి. నమూనాప్రాజెక్టులు వ్యవసాయ పశుపోషణలకు విస్తరణసిబ్బందిని సమకూర్చాయి. ఈ సిబ్బందిగాక, ప్రత్యేకంగా శిక్షణయివ్వబడ్డ గ్రామసేవకులుంటారు. ఈ గ్రామసేవకులు అనేకపనులకు ఉపయోగపడుతారు. జరూరైన ఖర్చులకుగాను నమూనా ప్రాజెక్టులకు ప్రత్యేకంగా స్వల్పనిధులు ఇవ్వబడ్డవి. వ్యవసాయం, పశుపోషణ, తదితరకార్యక్రమాలకు అవసరమైన పెద్దమొత్తాలను ఆయా శాఖలే భరించగలవని ఆశించడం జరిగింది. నమూనా ప్రాజెక్టుల పని, శిక్షణకార్యక్రమం వివిధ రాష్ట్రాలలో చురుకుగా సాగింది.

సరిగ్గా అదే సమయానికి మరొక అమెరికన్‌మిత్రుడు భారతదేశానికి రావడం తటస్థించింది. ఆయనపేరు చెస్టర్ బౌల్స్. ఆయన భారతదేశంలో అమెరికా ప్రభుత్వరాయబారిగా వచ్చాడు. భారతదేశంలో పునర్నిర్మాణకార్యక్రమానికి అమెరికాప్రభుత్వం అయిదుకోట్ల డాలర్లను ఇవ్వడానికి తన సంసిద్ధతను ఆయనకు తెలియజేసింది. తన ప్రభుత్వంతరఫున నైతిక, ఆర్థికసహాయం చేసేటందుకై తగు కార్యక్రమంకోసం ఆయన వెదుకుతున్నాడు. మన ప్రధానమంత్రికోరికపై ఆయన ఎటావా, నిలోఖేరీ కేంద్రాలను

దర్శించాడు. జరుగుతూవున్న పనులను చూచాడు. తరువాత భారతప్రభుత్వంతో చర్చలు జరిపి అప్పటి పార్టు 'ఎ', పార్టు 'బి', పార్టు 'సి' రాష్ట్రాలన్నింటిలో నమూనాప్రాజెక్టులుగా నూతనగ్రామాభివృద్ధికార్యక్రమం అమలుజరిపించాలని నిర్ణయించాడు. ఈ కార్యక్రమానికి అమెరికాప్రభుత్వం సాంకేతిక పరికరాలను ఇవ్వడమేగాక అవసరమైతే విదేశీవిస్తరణోద్యోగులనుకూడా పంపగలదని తెలిపారు. ఆ తరువాత ప్రభుత్వ వ్యవస్థలు కొన్నింటితో జరిగిన అనుబంధ ఒడంబడికలద్వారా ఈ ప్రయోగానికి కావలసిన రసాయనికఎరువులు, వ్యవసాయపు పనిముట్లుకూడా ఇస్తామన్నారు. ఈవిధంగా 1952 ఆరంభంలో భారతప్రభుత్వం తరపున ఒక క్రొత్త విస్తరణకార్యక్రమం ఆవిర్భవించింది. ఈ కార్యక్రమంలో అంతకుముందు ఫోర్డు ఫౌండేషన్ క్రింద ప్రారంభింపబడ్డ నమూనా ప్రాజెక్టులుకూడా కలుపుకోబడ్డవి.

క్రొత్త కార్యక్రమానికి సామాజికాభివృద్ధి కార్యక్రమం అని పేరుపెట్టబడింది. దీనికి కమ్యూనిటీ ప్రాజెక్ట్సు ఎడ్మినిస్ట్రేషన్ అను పేరుతో ఒక పాలకవ్యవస్థ ఏర్పడింది. ఈ వ్యవస్థకు అధిపతి ఎడ్మినిస్ట్రేటరు. అతనికి సూచనలు, ఆదేశాలు ఇవ్వడానికై కేంద్రసంఘమొకటి ఏర్పాటయింది. ఆ సంఘానికి భారతప్రధానమంత్రి అధ్యక్షుడు. అందులో ప్రణాళికాసంఘ సభ్యులు, కేంద్రఆహార వ్యవసాయశాఖమంత్రికూడ చేర్చుకోబడ్డారు. కేంద్రసంఘానికి ప్రత్యేకంగా ఒక కార్యనిర్వాహక వర్గమూ, సెక్రటేరియట్ వ్యవస్థకూడా ఏర్పాటుచేయబడ్డవి. ఇట్లా దీనిని ప్రణాళికా సంఘంతో జోడించివేయకుండా

●

ప్రత్యేకంగా వుంచడంవల్ల కొత్తకార్యక్రమం స్వేచ్ఛగా నిర్వహింపబడే అవకాశం కల్పించబడింది. సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద మొదట ప్రయోగాత్మకంగా 55 బ్లాకులు ప్రారంభింపబడ్డవి. ఈ కార్యక్రమానికి మన రాష్ట్రపతి 1952 అక్టోబరు 2వ తేదీన, అంటే గాంధీజయంతి రోజున ప్రారంభోత్సవం సలిపారు. ప్రధానమంత్రి ఆరోజు ఉదయం స్వయంగా నేలను త్రవ్వి కార్యక్రమానికి నాందీప్రస్తావన చేశారు. ఈ విధంగా భారతజాతికి నూతనకార్యక్రమం ఒకటి లభించింది.

స్టేట్ డెవలప్‌మెంట్ కమిటీ ఏర్పాటయింది. దీనికి ముఖ్యమంత్రి అధ్యక్షుడు. కమిటీ కార్యదర్శిగా సీనియర్ ఉద్యోగిని నియమించారు. అతనిని డెవలప్‌మెంట్ కమీషనర్ అన్నారు. అతడు బ్లాకులలోని కార్యక్రమాల వివిధాంశాలను సమన్వయపరచి తన కవసరమైన సహాయాన్ని ప్రభుత్వశాఖల నుంచి తీసుకుంటాడు. అప్పటికే దేశంలోనూ, విదేశాల లోనూ అమలుజరిగిన కార్యక్రమాల అనుభవం కొంత మన కేర్పడింది. సర్వోదయకార్యక్రమం మొదలుకొని అమెరికన్ విస్తరణకార్యక్రమంవరకూ, శ్రీ యఫ్. యల్. బ్రేన్ గుడుగాంలో అమలుజరిపించిన కార్యక్రమంమొదలు రష్యాలో కమ్యూనల పద్ధతివంటి వ్యవస్థవరకూ మనకూ కొద్దిగా అనుభవ మయ్యాయి. ఈ అనుభవాలన్నింటి సమన్వయమే 1952 అక్టోబరు 2వ తేదీన ఆరంభమైన భారతీయకార్యక్రమం. ఇందులో వ్యవసాయం, పశుపోషణ, చిన్ననీటివనరులు, రాకపోకల సౌకర్యాలు, ప్రజారోగ్యం, విద్య, వైద్యం, సాంఘికవిద్య, గ్రామపరిశ్రమలు, స్త్రీశిశుసంక్షేమకార్య

కలాపాలు, కొండజాతులవారికీ, దళితజాతులవారికీ ప్రత్యేక కార్యక్రమాలు చేర్చబడ్డవి. క్రమేణా గ్రామపంచాయతీల పట్ల, సహకారసంఘాలపట్ల తగు శ్రద్ధ వహించడానికి కూడా నిశ్చయింపబడింది. ఈ కార్యక్రమానికి పరిపాలనా రీత్యా బ్లాకు ప్రాతిపదిక. ఒక బ్లాకులో 150 మొదలు 200 చదరపుమైళ్ళ విస్తీర్ణం గల ప్రదేశమూ, 60,000 మొదలు 70,000 వరకు జనాభా వుంటుంది. బ్లాకుకు అధిపతి బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరు. అతనికి సహాయకులుగా, వివిధ అభివృద్ధిశాఖలకు చెందిన ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు వుంటారు. గ్రామానికి గ్రామసేవకుడు వుంటాడు. అతనికి వ్యవసాయంలో, కార్యక్రమానికి చెందిన యితర అంశాలలో ప్రాథమికశిక్షణ ఇవ్వబడుతుంది. అతడు అనేకపనులకు ఉపయోగపడుతూ వుంటాడు. బ్లాకు కేంద్రంలో తగుసిబ్బంది వుంటుంది. అంతే గాక తగు పరికరాలు, ఆర్థికసహాయంకూడా లభ్యమవుతాయి. ఆర్థికసహాయం కొంత గ్రాంటులరూపంలోను, కొంత అప్పులరూపంలోను చేయబడుతుంది. ప్రతిబ్లాకుకు అయిదేండ్లకు 22 లక్షల రూపాయలు ఇవ్వబడగలవని నిర్ణయించారు. కాని తరువాత ఈ మొత్తాన్ని 15 లక్షలు చేశారు. ఇంకా కొంతకాలం పోయిన తరువాత 12 లక్షలు చేశారు. బ్లాకులకు ఈ నిధులు ముఖ్యాధారాలు. ఇవిగాక వివిధఅభివృద్ధి పద్దులక్రింద ప్రభుత్వశాఖల నిధులనుండి బ్లాకులకు కొంత వాటా లభిస్తుంది. జిల్లాస్థాయిపై ప్రవీణుల సేవలను చక్కగా సమన్వయపరచడానికి ప్రాజెక్టు అమలుసంఘం ఏర్పాటుచేయవలెనని తలపెట్టబడింది. ఈ సంఘానికి జిల్లాకలెక్టరు అధ్య

త్సుడు; జిల్లాఅధికారులు అధికారసభ్యులు. ప్రాజెక్టు ప్రదేశం లోని శాసనసభ్యులు, పార్లమెంటుసభ్యులు, జిల్లాబోర్డు సభ్యులుకూడా ఈ సంఘంలో సభ్యులైవుంటారు. వీరంతా రెండుమూడునెలల కొకమారు సమావేశమై అమలుజరుగుతూవున్న కార్యక్రమాలను సమీక్షచేసి, అవి ఎలా అమలు జరగవలసిందీ సూచిస్తారు.

ఈ కార్యక్రమం ప్రభుత్వం తరఫున గ్రామాభివృద్ధికి మార్గదర్శకమైన కార్యక్రమంగా కొంతకాలం అమలుజరిగింది. ఎవరూ ఆశించనంతగా ఇది ప్రజలను ప్రభావితులను చేసింది. కలెక్టరుమొదలు ఇతరప్రభుత్వోద్యోగులంతా గ్రామాలకు వచ్చి చుట్టితట్టలు మోస్తారని, వ్యవసాయం మొదలుకొని గ్రామపరిశ్రమలూ సాంఘికసంక్షేమంవరకూ తన జీవితంలోని నిత్యసమస్యలను పరిష్కరింప ప్రయత్నిస్తారనీ గ్రామీణుడెన్నడైనా అనుకున్నాడా? ఈ కార్యక్రమం ఇంకా విస్తరించవలెనని ప్రజలు కోరారు. 1953 ఏప్రిల్ కల్లా మరి 110 బ్లాకులు ఏర్పాటుచేయబడ్డవి. ఈవిధంగా 1 కోటి 20 లక్షల జనాభాకు వర్తించే విధంగా మొత్తము 165 బ్లాకులు పనిచేయడం మొదలుపెట్టాయి. ప్రజలు అపూర్వమైన ఉత్సాహం చూపారు. ఎంతో జాగ్రత్తగా బ్లాకుఆఫీసరులను ఏరి నియమించడం జరిగింది. అప్పుడు వారిని ప్రాజెక్టుఆఫీసర్లు అనేవారు. వారికి ప్రత్యేకశిక్షణ ఇవ్వబడేది. వారు చేసిన పనికూడ ప్రశంసనీయమైనది. దీనితో ప్రభుత్వోద్యోగులను గూర్చి ప్రజలకు అంతకుముందున్న అభిప్రాయాలు మారి, వారిని ఒక కొత్తదృక్పథంతో అర్థంచేసుకోవడం మొదలు

పెట్టారు. ప్రభుత్వోద్యోగులుకూడ ప్రజలలోనుంచి వచ్చిన వారేనని, వారిలో సామాన్యంగా జాతిలో వుండే లక్షణాలు, పరిమితులే వుంటాయనీ ప్రజలు గ్రహించారు. తగు అవకాశం లభిస్తే ప్రభుత్వోద్యోగులుకూడ ప్రయోజనకరమైన రీతిని పనిచేయగలరని విశదమైంది.

ఇట్లా సామాజికాభివృద్ధి కార్యక్రమం విస్తరిస్తూ వుండగా అధికోత్పత్తిసంఘంనుంచి ప్రభుత్వానికి ఒక నివేదిక అందింది. ఆ సంఘానికి శ్రీ వి. టి. కృష్ణమాచారి అధ్యక్షుడు. అధికోత్పత్తిసంఘం భారతదేశంలోని వ్యవసాయ సమస్యలను సవిస్తరంగా పరిశీలించింది. గ్రామజీవితంలో తక్కిన అంశములపట్లకూడా తగుశ్రద్ధ వహిస్తేనేతప్ప లేకపోతే వ్యవసాయాభివృద్ధి విషయంలో గమనించదగిన ఫలితాలను సాధించటం వీలుపడదని ఆ సంఘంవారు అభిప్రాయపడ్డారు. గ్రామాభివృద్ధి సర్వతోముఖ కార్యక్రమంలో వ్యవసాయమొక అంశమై వుండవలెనని చెప్పారు. గ్రామావసరాలు ఒకదానితో ఒకటి ముడిపడి ఉంటాయి గనుక విస్తరణకార్యక్రమంలో సర్వవిషయాల సమానాభివృద్ధిని దృష్టిలో పెట్టుకోవాలి. ఈ కార్యక్రమం ప్రభావం రైతుల హృదయాలలో చోటు చేసుకోవాలి. అలా జరిగిందంటే ప్రభుత్వం తలపెట్టిన ఏప్రయత్నానికైనా ప్రజలు ఆమోదం తెలిపి ఉత్సాహంతో సహకరిస్తారు. అధికోత్పత్తిసంఘంవారి నివేదిక ఫలితంగా జాతీయ విస్తరణసేవాకార్యక్రమం శాశ్వతవ్యవస్థగా రూపొందింది. ఈవిధంగా సామాజికాభివృద్ధి కార్యక్రమానికి కొత్త ఆదేశం లభించింది. ప్రయోగదశను అది దాటిపోయింది. ప్రభుత్వ

అభివృద్ధిశాఖల కార్యకలాపాలన్నీ అందులో రూపుదిద్దు కున్నాయి. ప్రధానమంత్రి అన్నట్లు "అది మొదటి పంచవర్ష ప్రణాళికకు ఉద్దేశబలాన్నిచ్చే శక్త్యుత్పాదకయంత్రము"గా ఉపకరించింది.

ఊటీనుండి మౌంట్ ఆబూకు

**1952** లో ఏ రాష్ట్రానికీ ఐదు సామాజికాభివృద్ధిబ్లాకులకు మించి లేవు. రాష్ట్రప్రమాణమునుబట్టి చిన్నరాష్ట్రానికి ఒకే ఒక బ్లాకు వుంటే మరొక పెద్దరాష్ట్రానికి ఐదు బ్లాకుల వరకు వుండేవి. ఈ బ్లాకుల కవసరమైన ఉద్యోగులను ఎంపిక చేయడంలో అంత కష్టమేమీ అనిపించలేదు. డెవలప్‌మెంట్ కమీషనరు, ఆయనక్రింద వుండే సిబ్బంది కార్యక్రమం ఎలా పనిచేస్తూవున్నదీ సులభంగా పర్యవేక్షణ చేయగలిగారు. ఇనుము, ఉక్కు, సిమెంటు, విత్తనాలు, రసాయనిక ఎరువులు మున్నగువాటిని సప్లయిచేయడంకూడా అంత కష్టమనిపించ లేదు. కాని ఒక సంవత్సరకాలంలోనే 55 బ్లాకులల్లా 450 బ్లాకులై కార్యక్రమం విపరీతంగా విస్తరించేసరికి పరిస్థితి క్లిష్టమైంది. యోగ్యత గల సిబ్బందిని సమకూర్చడం దుస్సాధ్యమైంది. డెవలప్‌మెంట్ కమీషనరు, ఆయనసిబ్బంది పూర్వం మాదిరిగా సన్నిహితంగా, సమర్థవంతంగా కార్యక్రమాన్ని పర్యవేక్షించలేకపోయ్యారు. కార్యక్రమాన్ని పాలించే బాధ్యత జిల్లాకలెక్టరుకూ, సబ్ డివిజనల్ ఆఫీసరుకూ ఇవ్వబడింది. పైనుంచి సహాయం లేకుండా ఎక్సటెన్షన్ ఆఫీసర్లు బ్లాకులలో

పనిచేయలేకపోయారు. జిల్లాఅధికార్లు కేవలం సలహాదార్లు మాత్రమే కాబట్టి పూర్తి ఊపుతో కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోలేకపొయ్యారు. వారు యేవిషయంలో ప్రవీణులో ఆ విషయంలో వారిని ఆ జిల్లాలోని బ్లాకుల విస్తరణకార్య క్రమానికి బాధ్యులుగా చెయ్యవలసివచ్చింది. అయితే రాష్ట్ర స్థాయిపై రాష్ట్రప్రభుత్వానికి చెందిన వివిధశాఖల అధిపతులు తమకు సంబంధించిన విషయాల బాధ్యతలను వహిస్తేనేగాని జిల్లాలోని వారి ఉద్యోగులు ఆయా విషయాలకు బాధ్యులై పనిచేయరు. ఇందుచేత పరిపాలనకు సంబంధించిన యంత్రాం గమును, సాంకేతికయంత్రాంగమును ప్రభుత్వం ఈ కార్య క్రమాన్ని అమలుజరిపించుటకై నియోగింపవలసివచ్చింది. ఈ కారణంగా జిల్లాకలెక్టరు ఆ జిల్లాకు డిప్యూటీ డెవలప్ మెంట్ కమీషనరు అయ్యాడు. అతడు డెవలప్ మెంట్ కమీషనర్ తరఫున జిల్లాకార్యక్రమాలను అజమాయిషీ చేస్తూవుంటాడు. జిల్లాలో అభివృద్ధిశాఖల అధికార్లు జిల్లా సాంకేతికాధికార్లుగా బాధ్యత స్వీకరించారు. పూర్వపు తనిఖీ పద్ధతి పనికిరాలేదు. ప్రభుత్వం చేసే సహాయంతో ప్రజలు అభివృద్ధికార్యక్రమాలను నిర్వహించుకోవాలని ఈకార్యక్రమం నిర్దేశించింది. పూర్వం తనిఖీచేసే బాధ్యత మాత్రమే కలిగి వున్నట్టి శాఖలు ఇప్పుడు సేవకూ, విస్తరణకార్యానికీ పూను కోవలసివచ్చింది. అయితే ప్రభుత్వయంత్రాంగం వైఖరివల్ల ఈ మార్పు అసాధ్యమని తోచింది.

భారతీయులకు యోగాభ్యాసములు గలవు కదా! శరీరం ఆరోగ్యంగా వుంటే యోగాభ్యాసములు చేయడంవల్ల

ముఖ్యాంగము లన్నీ జవసత్వాలు పొందుతాయి. అంతటి బలం మరి యేఇతరవ్యాయామంవల్లనూ చేకూరదు. కాని శరీరంలో ఏదైనా జబ్బు దాగివుంటే అది మసూచి పుట్టు కొచ్చినట్లు ఆకస్మికంగా బైటపడుతుంది. సామాజికాభివృద్ధి కార్యక్రమం మన పరిపాలనావ్యవస్థకు యోగాభ్యాసం చేసి నంత పని చేసింది. ఏదీ చేయలేని రీతిలో అది మన లోపాలను బహిర్గతం చేసింది. మన పరిపాలకోద్యోగులకు ప్రజలతో పరిచయమే లేదని తెలిసిపోయింది. వారెంత సేపటికీ తమ పదవికిగల అధికారదర్పముల్పై ఆధారపడివుంటారేగాని స్వయంసేవతో ప్రజలను ఆకర్షింపలేకుండా వున్నారు. సాంకేతికోద్యోగులకు వారి ప్రావీణ్యం విషయం వారికే సరిగా తెలీదు. తెలిసిన విషయాలలోనూ ఎన్నో తప్పులు! వైద్య సంస్థలు, ఇంజనీరింగుసంస్థలు తప్ప తక్కినసాంకేతికసంస్థలకు సరిగా పరికరాలే లేవు; ఉపకరణాలు లేవు. శిక్షణ పొందిన సాంకేతికసిబ్బంది లేదు. స్కూళ్ళలో, కాలేజీలలో చదివే చదువులకూ, ప్రత్యక్షంగా ఆయా రంగాలలోని ఆచరణ విధానాలకూ పొంతనేలేదు. విస్తరణకార్యక్రమం సంగతి ఎవరికీ తెలీదు! పరిశోధన ఎక్కడికక్కడ సంకుచితపద్ధతుల ప్రకారం జరుగుతూవుంది. ఒకరి పరిశోధన మరొకరికి తెలీదు. అన్నీ చీకటిగదులు! జరిగే కొద్దీ గొప్ప పరిశోధనకూడా అంతర్జాతీయసభలలో ఉపన్యసించడానికీ, ప్రపంచవ్యాప్తి గల పత్రికలలో ప్రచురించడానికీ మాత్రమే ఉద్దేశింపబడి నట్టిది. ఏదీ దేశంలో వేళ్ళుతొక్కుకొని లేదు. అంతా

నేలవిడిచిన సాముగా వుంది. అయితే అన్నీ ఇలాగే వున్నవని నేను చెప్పడం లేదు. కొన్ని అపవాదములు లేకపోలేదు.

ఏమైనప్పటికీ ముఖ్యమైన సప్లయిల కొరత తీవ్రంగా వున్నట్లు కనుగొనబడింది. వ్యవసాయం సమర్థవంతంగా సాగడానికి మేలైన విత్తనాలు లేవు. రసాయనికఎరువులు లేవు. పైరుల తెగుళ్ళకు మందు లున్నాయన్న సంగతి చాలామంది రైతులకు తెలేదు. వ్యవసాయపనిముట్లు మేలైనవి వున్నాయి. వాటిని ఉపయోగిద్దా మన్న ఉత్సాహమే లేదు. ఇక ఆధునిక వ్యవసాయపద్ధతులు ప్రభుత్వశాఖలకే సరిగా తెలేవు. తెలిసిన అంశాలైనా ప్రజలదాకా పోవు. విజ్ఞానవిస్తరణమే లేదు. ఏదో గాలివాటుగా కొద్దిమంది రైతులు తెలుసుకున్న కొత్త సంగతులు అసంఖ్యాకులైన రైతులదాకా చేరవు. నేలలోని సత్తువ ఖాళీ అయిపోయింది. దానికి తిరిగి సత్తువచేద్దా మన్న శ్రద్ధ కన్పించదు. భూసారపరిరక్షణ పద్ధతులు చాలా మందికి తెలేవు. తెలిసినా అవి వారివరకు మాత్రమే పరిమితమై వుంటాయిగాని మరొకరికి చెప్పరు. మన ఇంజనీరింగ్ ఉద్యోగులకు కాగితాలపై డిజైనులు, డ్రాయింగులు వేయడం బాగా చేతవునుగాని, కార్యరంగంలోకి పొయ్యేసరికి ఏది ఎలా చెయ్యాలో బోధపడక తికమకపడతారు. భారీ నీటివనరు ప్రాజెక్టుల సంగతితప్ప చిన్నచిన్న వనరుల పొంతకే పోరు. 1952లో కార్యక్రమం ఆరంభమైన తరువాత పద్ధెనిమిది నెలల లోపలే ప్రభుత్వం రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను గూర్చి ఆలోచింపవలసి వచ్చింది. సాంకేతికోద్యోగుల విషయంలో, విత్తనాలు, రసాయనికఎరువులు, పైరుల తెగుళ్ళ

మందులు మున్నగు సాంకేతికాధారాల విషయంలో మన లోపాలను, కొరతలను మనం బాగా యెరిగినందువల్ల యథార్థా లన్నీ తెలిసి వాస్తవికదృష్టితో మన రెండవ పంచవర్ష ప్రణాళికను రూపొందించుకోగలిగాము. అయితే కార్య క్షేత్రంలో ప్రజలకు ఉత్తేజము కలిగించి కార్యక్రమాన్ని ఎలా పర్యవేక్షణచేయవలసిందీ అన్న అంశము మన కొక సమస్యగానే వుండిపోయింది. బ్లాకుసలహాసంఘాలు (అప్పుడు వీటిని ప్రాజెక్టుసలహాసంఘాలని అనేవారు) కేవలం ఆమోద ముద్రవేసే వ్యవస్థలుగా మాత్రమే పనిచేసేవి. ప్రజలతో కలిసి వారి సమస్యలను పరిష్కరిద్దామన్న ప్రయత్నం, చొరవ బ్లాకుస్థాయిపై వుండే ప్రభుత్వయంత్రాంగంలో కనిపించేవి కావు.

కార్యక్రమం పెరిగేసరికి రకరకాల వ్యక్తులు బ్లాకు ఉద్యోగులుగా వస్తూపోయారు. శక్తివంతమైన ప్రజాభి ప్రాయం వత్తిడికి తాము ఎక్కడ బయటపడిపోతామోనని వారు బిడియంగా తప్పించుకుతిరుగుతూవుండేవారు. శాసన సభ్యులను చూచి కలెక్టర్లు దూరదూరంగా వుండేవారు. ఆ రోజుల్లో మన దేశంలో ప్రజాస్వామ్యం కొత్తది కాబట్టి ప్రజాస్వామికరాజ్యంలో తమ పాత్ర యేమిటో శాసనసభ్యు లకు స్పష్టంగా తెలిసేది కాదు. వారికి ఎంతసేపటికీ ఒకరిని విమర్శించడం తెలుసు. నిర్మాణాత్మకకృషికి వారు అలవాటు పడలేదు. ఇందువల్ల అధికారులకూ అనధికారులకూ పొత్తు కుదరలేదు. ఉభయులూ ఒకరికొకరు దూరంగా వుంటూ ఒకరిపై ఒకరికి గల భావాలను అట్లే మనస్సులో పెట్టుకొని

హృదయాలు విప్పి మాట్లాడుకోకుండా వుండిపోయారు. అట్టి తరుణంలో ఉదకమండలంలో (ఊటీ) 1954 మే నెలలో డెవలప్ మెంట్ కమిషనర్ల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో బ్లాకుసలహాసంఘాలు యథార్థరీతిలో పనిచేయవలెనని మొట్టమొదటిసారిగా నిర్దేశింపబడింది. బ్లాకుసలహాసంఘం సమావేశాలు జరిగినపుడు కార్యక్రమాన్ని పరిశీలించి విమర్శించే స్వేచ్ఛ సభ్యులకు వుండవలెననీ, గ్రామకార్య క్రమాలను వ్యవస్థీకరించడంలో సభ్యులు గ్రామస్థులకు మార్గం చూపవలెననీ నిర్ణయింపబడింది. ఈవిధంగా ఆదేశాలైతే వచ్చాయికాని వాటిని అమలుపరచేందుకు అవసరమైన మనసుల కలయిక జరగలేదు. రాష్ట్రస్థాయిలో, జిల్లాస్థాయిలో ప్రభుత్వోద్యోగులు, క్రొత్తప్రజాప్రతినిధులు ఎదురుబొదురుగా కూర్చొని మాట్లాడుకోవలసివచ్చింది. కాని వారి మనసులు కలిసేవి కావు. ఈ సమావేశాల ప్రభావం కార్యక్రమం అమలుజరిగే క్షేత్రంపై పడలేదు. కనుక పంచాయతీ ప్రెసిడెంట్లు,సర్పంచులు కార్యక్రమంలో హెచ్చుగా పాల్గొనునట్లుచేసి తద్వారా అనధికార్ల అభివృద్ధికృషిలో భాగస్వాములయ్యేటట్లు చూడవలెనని నిర్ణయింపబడింది. బ్లాకులో వుండే శాసనసభ్యులనూ, పార్లమెంటు సభ్యులనూగాక, పంచాయతీ ప్రెసిడెంట్లను, లేదా పంచాయతీలు ఎన్నుకొని పంపిన ప్రతినిధులను బ్లాకుసలహా సంఘాలలో సభ్యులుగా చేర్చుకోవలెనని సూచన చేశారు.

పరిపాలక, సాంకేతిక, ఆర్థిక మంజూరీల నిచ్చే అధికారం మొదట కేంద్రంలోని సామాజికాభివృద్ధిప్రాజెక్టుల

ఎడ్మినిస్ట్రేషన్‌నుండి రాష్ట్రప్రభుత్వాలకు ఇవ్వనైనది. కొంత కాలం పోయిన తరువాత రాష్ట్రప్రభుత్వాలు ఆ అధికారాలను డెవలప్‌మెంట్ కమిషనర్లకు ఇచ్చాయి. డెవలప్‌మెంట్ కమిషనర్లు వాటిని జిల్లాకలెక్టర్లకు బదిలీచేశారు. కలెక్టర్లు వాటిని బ్లాకుడెవలప్‌మెంట్ ఆఫీసర్లకు అప్పగింతపెట్టారు. ఈ క్రొత్తధోరణిలో పంచాయతీలు వాటి ఇష్ట ప్రకారం ఎంపికచేసుకున్న స్థానికపనులకు ఇచ్చే నిధులను పంచాయతీలే ఖర్చుపెట్టుకునేట్లు అనుమతియివ్వాలనీ, అయితే అట్టి స్థానికపనులకు బ్లాకుసలహాసంఘంఆమోదం వుండవలె ననీ ఒక సూచన చేయబడింది. సామాజికాభివృద్ధికార్యక్రమంలో కంట్రాక్టర్లకు తావు లేకుండాచేయవలెనని అంగీకరింపబడింది. అనేక రాష్ట్రాలలో ఈ పద్ధతిప్రకారం గ్రామ పంచాయతీలకు కార్యక్రమంతో సంబంధం కల్పించవలెనని ప్రయత్నాలు జరిగినవి. పంచాయతీలు శ్రద్ధతీసుకోవడం మొదలయ్యేసరికి శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులుకూడా కార్యక్రమానికి సన్నిహితులయ్యారు. కాని ప్రభుత్వోద్యోగుల మధ్య శాసనసభ్యులమధ్య ఎడము అలాగేవుంది. మనసుల కలయిక ఇంకా పూర్తిగా జరగలేదు.

ఈలోపల కార్యక్రమం విస్తరించింది. మొదటి పంచవర్ష ప్రణాళిక 1956 మార్చి 31వతేదీన అంతమయింది. అప్పటికి 1200 బ్లాకులకు కార్యక్రమం విస్తరించింది. అంటే దేశగ్రామీణజనాభాలో నాల్గవవంతుకు వర్తింపు అయిందన్న మాట. రెండవ పంచవర్ష ప్రణాళిక అప్పుడే మొదలైంది. ఆ ప్రణాళికలో సామాజికాభివృద్ధి కార్యక్రమానికి రూ 200కోట్ల

వ్యయం కేటాయింపబడింది. వ్యవసాయం, పశుపోషణ, సహకారం, గ్రామపరిశ్రమలు, ప్రజారోగ్యం, విద్యవంటి శాఖలకు ప్రత్యేకంగా గ్రామాలకున్వర్తించే కార్యక్రమాలునిర్దేశింపబడ్డవి. అంతటితో ప్రభుత్వశాఖలనుంచి కూడా నిధులు వస్తూపోయాయి. పథకరచనకూ, అభివృద్ధి కార్యకలాపాలకూ బ్లాకు కేంద్రమయింది. గ్రామీణప్రజలు సామాజికాభివృద్ధి కార్యక్రమంలో ప్రజాసౌకర్యాలకు హెచ్చుప్రాముఖ్య మివ్వవలెనని కోరడం మొదలుపెట్టారు. వారు అలా కోరడం సహజమే. దీన్ని చూచి ప్రభుత్వోద్యోగులలో కూడా గమనించదగిన మార్పు వచ్చింది. ఇది సాధారణాభివృద్ధి కార్యక్రమంగా పెంపొందింది. మన దేశజనాభా వేగంగా హెచ్చుతుంది. పంచవర్ష ప్రణాళిక క్రింద బోలెడు డబ్బు వ్యయమవుతూవుంది. ప్రజలు అధికంగా వినియోగించుకుంటున్నారు. ఆహారధాన్యాల ధరలు హెచ్చడం మొదలయ్యాయి. ధాన్యం ధరల పెరుగుదల వల్ల ఇతర వస్తువుల ధరలుకూడా పెరిగి, ప్రజాసదుపాయాలకు అంతరాయం కలుగజొచ్చింది. ఒకవేపు డబ్బు రాబడి హెచ్చింది. కాని ఏం లాభం? ఆ వచ్చిన డబ్బు కాస్తా పెచ్చు ధరలకు పోతోంది. జీవన వ్యయప్రమాణం పెరగడమే దీనికి ముఖ్య కారణం. దీనికై ఆహారోత్పత్తికి అధిక ప్రాధాన్యమివ్వవలసి వచ్చింది. రెండవ పంచవర్ష ప్రణాళికలో వివిధ శాఖల పనుల సమన్వయానికి మరింతగా ప్రయత్నం చేయవలసివచ్చింది. సామాజికాభివృద్ధి ప్రాజెక్టుల పరిపాలక వ్యవస్థ దాని విధులకూ, పరిమితులకూ మించి విస్తరించిపోవడంచేత దానిని 1956 సెప్టెంబరు నెలలో మంత్రిత్వ శాఖగాచేశారు.

ప్రపంచం మొత్తంలో సామాజికాభివృద్ధి పనులను నిర్వహించేందుకు భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖ ఏర్పడిందని చెప్పాలి. మొదట పాలక వ్యవస్థకు ఎడ్మినిస్ట్రేటరుగా వున్న వ్యక్తినే మొట్టమొదటి సామాజికాభివృద్ధి మంత్రిగా నియమించారు. ఇలా కొత్త ఏర్పాటు జరిగినప్పటికీ ప్రధానమంత్రి అధ్యక్షుడుగా వున్న కేంద్ర సంఘం సహాయ సహకారాలిస్తూ మార్గదర్శకత్వం నెఱపుతూనే వుంది.

ప్రణాళికా సంఘంవారు 1956 లో ప్లానుప్రాజెక్టుల సంఘమును నియమించారు. ఈ సంఘం భారతప్రభుత్వపు వేర్వేరు పథకాలను పరిశీలించి వాటి పని చేసే పద్ధతిని మెరుగుపరచేటందుకు తగు సిఫార్సులు చేస్తుంది. మొట్టమొదట వారు సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని పరిశీలించారు. ప్లానుప్రాజెక్టుల సంఘంవారు గ్రామసమస్యలతో పరిచయం గల నాయకుడైన శ్రీ బల్వంతరాయ్ మెహతా నాయకత్వాన ఒక ప్రత్యేక పరిశీలక బృందమును నియమించింది. ఉదకమండలంనుంచి డెవలప్‌మెంట్ కమీషనర్ల సమావేశం 1958 లో మౌంట్ ఆబూకు మారింది. అప్పటికల్లా బల్వంతరాయ్ మెహతా బృందంవారు పరిశీలన పూర్తిచేసి తమ సిఫారసులను వ్రాసిపంచారు. ఆ సిఫారసులను మరొక అధ్యాయంలో వివరిస్తాను. మౌంట్ ఆబూ సమావేశంలో సామాజికాభివృద్ధి కార్యక్రమం ప్రభుత్వ ఏజన్సీల తాహతుకు మించిపోయిందనీ, దీనిలో ప్రజాప్రతినిధులను కూడా

చేర్చుకోవాలనీ తేల్చబడింది. అయితే కేవలం సలహాదారులు గానే అయితే ప్రజాప్రతినిధులు చేరరు. వారికి చట్టబద్ధమైన బాధ్యతలు కూడా వుండాలి. భారతదేశ పరిపాలనాధికారాలు పార్లమెంటుకు వున్నవి. రాష్ట్రపరిపాలనాధికారాను, కొన్ని అంశాలు మినహా, రాష్ట్రశాసన సభకు వుంది. కనుక పెరిగే బాధ్యతలను పంచుకోవడానికై జిల్లా, బ్లాకు, గ్రామం స్థాయిపై కొత్త సంస్థలను ఏర్పాటుచేయాలి. అలా చేస్తేనే ప్రభుత్వం పాలిస్తూ వున్న కార్యక్రమం ప్రజాకార్యక్రమంగా మారి భారతదేశ పునర్నిర్మాణం సాధ్యమవుతుంది. అంటే మనదేశ పునర్నిర్మాణమే ప్రజాకార్యక్రమంగా పెంపొందవలెనన్నమాట.

వ్యవసాయానికి ప్రత్యేక ప్రోద్బలము ఇవ్వవలసి వచ్చింది. విద్య, ప్రజారోగ్యం, రాకపోకల వసతులు, స్త్రీ జనాభ్యుదయంవంటి సంఘ సంక్షేమకార్యక్రమాలు గ్రామాలకు వెంటనే అవసరమయ్యాయి. వీటిని ప్రజలే అమలు పరచుకోవలసివచ్చింది. అలా అమలుపరచుకున్నా కూడా త్వరిత గతిని అమలుపరచే వ్యవసాయకార్యక్రమం అడవిలో చెట్టుచేమలవంటిది. వ్యవసాయానికి ప్రత్యేక ప్రోద్బలమే ఇవ్వవలెనంటే దానిని జాగ్రత్తగా పెంపుచేసుకుంటూ రావాలి. మౌంట్ ఆబూ సమావేశం రెండు ఆదేశాల నిచ్చింది. బ్లాకు సంఘాలను బ్లాకు అభివృద్ధి సంఘాలుగా చేయాలి. ఆ సంఘాలు చేసిన నిర్ణయాలకు స్థానిక అధికార్లు బద్ధులైవుండాలి. ఆ నిర్ణయాలను మార్చే హక్కు రాష్ట్రప్రభుత్వానికి వుండాలి. అట్లా అయితేనే బ్లాకు అభివృద్ధి సంఘాల సభ్యులు

సొంతంగా ఆలోచించి పనులు చేసే బాధ్యతను వహించ గలుగుతారు. ఆ విధంగా అభివృద్ధి పరిపాలనా బాధ్యతలను స్వీకరించేందుకు అవసరమైన ప్రాథమిక శిక్షణ పొంద గలుగుతారు. ఇంతకు మునుపే భారతదేశంలోని అన్ని బ్లాకులలో గ్రామసహాయకుల శిక్షణకార్యక్రమం ఆరంభింప బడింది. ప్రభుత్వ వ్యవస్థలో వ్యవసాయాన్ని గూర్చిన ఆధునిక విజ్ఞానపు పరిమితులను ప్రతివారూ గుర్తించారు. అయితే భారత దేశంలోని అన్ని గ్రామాల్లోనూ వ్యవసాయాన్ని కొత్త పద్ధతుల ప్రకారం చేయవలెనని అనుకునే రైతులు వున్నారు. వీరినే అభ్యుదయ వ్యవసాయదారులు అని అంటున్నాము. ఇటు వంటి వారిని గ్రామానికి అయిదుగురు చొప్పున ఎంపికచేసి మొత్తం దాదాపు 50 మందిని మూడు నాలుగురోజులపాటు ఒకచోట సమావేశపరిస్తే వారు ప్రభుత్వోద్యోగులతో వ్యవసాయ సమస్యలను చర్చించి ఒకరి అభిప్రాయాలు ఒకరు తెలుసుకోగలుగుతారు. కొత్త సాంకేతిక విధానాలను గూర్చి, సేద్యపద్ధతులను గూర్చి వారికి ప్రత్యక్ష ప్రదర్శనల ద్వారా తెలియజెప్పవచ్చు. అట్లా వారు ఆ శిబిరంనుంచి వారివారి గ్రామాలకు వెళ్ళిపోయిన తరువాత వారే అభ్యు దయకరమైన వ్యవసాయోద్యమానికి నాయకులవుతారు. విత్త నాలు, రసాయనిక ఎరువులు, పైరుల తెగుళ్ళ మందులు మున్నగువాటి సరఫరా పరిమితంగా మాత్రమే వుంటుందని గుర్తించాము. అయినప్పటికీ స్థానికంగా లభించే వనరులతోనే ఎంతైనా కృషి చేయవచ్చు. గ్రామ సహాయకులు గ్రామస్థుల నందరిని ఉత్తేజపరిచి వారిలో మంచి సంచలనం కలిగించ

గలుగుతారు. మౌంట్ ఆబూ సమావేశంలో వ్యవసాయానికి అత్యధిక ప్రాధాన్య మివ్వవలెననీ,వ్యవసాయాభివృద్ధికి గ్రామ సహాయకులు ముఖ్యమైనవారనీ, కనుక గ్రామసహాయకుల శిక్షణ శిబిరముల పథకమును అమలుజరపవలెననీ ఆదేశ మివ్వడం జరిగింది.

బహుళార్థసాధక బ్లాకులక్రింద కొత్తగా ప్రారంభింపబడ్డ గిరిజన సంక్షేమ కార్యక్రమాన్ని మౌంట్ ఆబూ సమావేశం సమీక్షించి ఆమోదించింది. గిరిజన జనాభా హెచ్చుగా వుండే ప్రాంతాలకు సంబంధించినవి బహుళార్థ సాధక గిరిజన బ్లాకులు. భారతరాజ్యాంగము ననుసరించి భారత ప్రభుత్వ దేశీయ వ్యవహారాలశాఖకు గిరిజనుల విషయంలో కొన్ని ప్రత్యేక విధిబాధ్యత లున్నవి. కనుకనే ఆ శాఖవారు బహుళార్థ సాధక గిరిజన బ్లాకులకు అదనంగా కొన్ని నిధులను కేటాయించారు. దేశీయవ్యవహారాలశాఖకూ, సామాజికాభివృద్ధి శాఖకూ మధ్య ఒక్కొక్క బహుళార్థ సాధకగిరిజన బ్లాకుకు అయిదేండ్లకు రూ.27 లక్షలు ఇచ్చారు. భారతదేశంలో గిరిజనులు ఎక్కువ మారుమూలల కొండ ప్రాంతాలలో వున్నారు. వీరు అధికంగా ఒకచోట నివసించరు. చెదిరిపోయినట్లు అక్కడ కొందరు, ఇక్కడ కొందరు వుంటారు. కనుకనే గిరిజన బ్లాకుకు గరిష్ఠం 25,000 జనాభా వుండవలెనని నిర్ణయింపబడింది. ఇట్టి బ్లాకులలో విద్య, ఆరోగ్యం, రాకపోకల సదుపాయాలపట్ల మొదట శ్రద్ధవహించాలి. వీటి ఆర్థిక కార్యకలాపాలలో అటవీ పరిరక్షణ, వ్యవసాయం, కోళ్ళ పెంపకం, గ్రామపరిశ్రమలు ముఖ్యములై వుండాలి. గిరిజనుల

సంస్కృతిని, సంప్రదాయాలను భంగపుచ్చకూడదు. వారి సాంఘిక వ్యవస్థలద్వారా, ముఖ్యంగా వారి పంచాయతీల ద్వారా వారి అభివృద్ధి సాధింపబడాలి.

మైసూరు - కాశ్మీరు

ఉదకమండలంనుంచి మౌంట్ ఆబూకు సుదీర్ఘ ప్రయాణం జరిగిందని చెప్పాలి. మౌంట్ ఆబూనుంచి మైసూరుకు, ఆ తర్వాత కాశ్మీరుకు, ఇంకా ఆవలకు జరిగిన ప్రయాణం కూడా ఒక పెద్ద గంతు అని చెప్పవచ్చు. ఈ మధ్య వ్యవధానం దాదాపు వెనుకటి అంతే. కాని అనేక విషయాలు చక చకా జరిగిపోయాయి. ఇంతకుముందే బల్వంతరాయ్ మెహతా పరిశీలన బృందపు నివేదికను ప్రస్తావించి వున్నాను. ఇప్పుడు ఆ నివేదికను వివరించడం అప్రస్తుతం గాదు. ఆ పరిశీలక బృందంవారు కార్యక్రమం పుట్టుపూర్వోత్తరాలను, అది పని చేసే వైనమును పరిశీలించి కార్యక్రమానికి సంబంధించిన అన్ని అంశాలపై సిఫారసులు చేసివున్నారు. ఇచ్చట ముఖ్యమైన వాటిని చర్చిస్తాను. ఈ బృందంవారు సామూజికాభివృద్ధి కార్యక్రమం ధోరణిని స్థూలంగా ఆమోదించారు. రంగంలోకి తేబడిన సిబ్బందికూడా సరిగానే వుందని అన్నారు. అయితే పట్టణప్రాంతాలలోని అభివృద్ధికీ, గ్రామప్రాంతాల అభివృద్ధికీ పెద్ద వ్యత్యాసం కన్పిస్తోందనీ, ఈ వ్యత్యాసాన్ని తగ్గించడానికి విడువకుండా గట్టి కృషి అవసరమనీ అన్నారు. ఈ బృందంవారు ఒక కార్యక్రమమును సూచించారు. అది రెండు దశలుగా అమలుజరుపవలెనని చెప్పారు: మొదటి దశ- రెండవ దశ. ప్రతి దశకూ అయిదేండ్లు వుండాలి. రెండు

దశలకూ బ్లాకులో సిబ్బంది ఒకటే కాని మొదటి దశకంటే రెండవదశకు బడ్జెటు కేటాయింపు కొంచెం తక్కువగా వుండాలి. రెండవదశ బడ్జెటును తరువాత దశల్లో కాల నిర్ణయం లేకుండా కొనసాగిస్తూపోవాలి.

సామాజికాభివృద్ధి ఉద్యమం చేపట్టిన అంశాలన్నీ ప్రభుత్వరంగానికి చెందినవే. స్వాతంత్ర్యం వచ్చినవెంటనే కేంద్ర ప్రభుత్వశాఖలు రాష్ట్రప్రభుత్వాల విధులను మరింత హెచ్చుగా స్వీకరించినవని ఈ బృందంవారు అభిప్రాయపడ్డారు. కనుక ఆ రంగా లన్నింటిలో విధుల వికేంద్రీకరణ జరిగి రాష్ట్ర ప్రభుత్వాలకు ఎక్కువ పను లివ్వవలెనని సదరు బృందము వారు సూచించారు. వారి సూచనలను బట్టి కేంద్రప్రభుత్వం స్థూలంగా వార్షిక ఆదాయ వ్యయాల పనిని చూస్తూ, భారత దేశమంతటా కలిగిన అనుభవాలను ఒకచోట చేర్చడానికి వేదికగా వ్యవహరించాలి. వికేంద్రీకరణ అనుభవాలూ, సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖ కొన్ని అధికారాలను అప్ప గింత పెట్టిన వైనమూ మిగుల ప్రోత్సాహకరమని చెప్పక తప్పదు. ఇదే పద్ధతిని కేంద్రప్రభుత్వంలోని ఇతరమంత్రిత్వ శాఖలు కూడా అవలంబించవలెనని సిఫారసు చేశాము. భారతదేశం వెనుకపడివున్న దేశం. అంటే బాగా అభివృద్ధి చెందిన దేశం కాదు. దీనికి గల సాధనసంపత్తులు అల్పమైనవి. కనుక వీటిని వ్యర్థపుచ్చకూడదు. దుబారాలనూ, దుర్వినియోగ మునూ తగ్గించే వీలుంటే తప్పక తగ్గించాలి. బ్లాకుల్లోనూ, వాటికి ఇంకా దిగువస్థాయిలోనూ గ్రామాభివృద్ధి పథకం క్రింద జరిగే కార్యకలాపాలకన్నిటికీ సామాజికాభివృది

మంత్రిత్వశాఖ సమన్వయ కర్తగా వుండవలెనని కోరారు. ఇందుకై సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖ సహకారము, గ్రామపంచాయతీలు అను విషయాలను తీసుకోవలెననీ సూచనచేయడం జరిగింది. ఇకముందు గ్రామాభివృద్ధి అంతా ఈ రెండు వ్యవస్థలద్వారా-అంటే సహకారసంఘాలద్వారా, గ్రామపంచాయతీల ద్వారా జరుగవలెనని చెప్పారు.

రెండవ పంచవర్ష ప్రణాళిక 1961 మార్చి నెలలో ముగిసింది. అభివృద్ధి పల్చగా వున్నా కార్యక్రమం దేశమంత టికీ వర్తించవలెనని ప్రభుత్వం మొదట సంకల్పించింది. కాని పరిశీలకబృందమువారు పల్చని అభివృద్ధికీ, చిక్కని అభివృద్ధికీ మధ్య వున్న వ్యత్యాసం అంతరించవలెనని సిఫారసుచేశారు. అభివృద్ధి సాంద్రముగానే వుండాలి. దేశమంతటా సాంద్రతర కార్యక్రమం 1961 వరకల్లాగాక 1963 వరకల్లా వర్తింపు కావడానికై కార్యక్రమాన్ని కొంత తడబడ జేయవలెనని ఆ బృందమువారు సిఫారసుచేశారు. ఇందువల్ల కార్యక్రమానికి మరింతగా సరిపొయ్యేట్టు మానవబలగం లభించి, పని సమర్థ వంతంగా జరగగలదని వారు చెప్పారు. అయితే ఈ బృందము వారు చేసిన సూచనలలో చరిత్రాత్మకమైన సూచన వేరే వుంది. అది 'ప్రజాస్వామ్యవికేంద్రీకరణ'. ఇంతకు ముందరి విభాగంలో దీనిని గూర్చి కొంత చెప్పివున్నాను. ప్రజా శ్రేయస్సువిషయంలో భారతప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు ప్రజలపైననే హెచ్చువిశ్వాసం వుంచవలసిన సమయం ఆసన్నమైనదని బల్వంతరాయ్ మెహతా బృందమువారు కచ్చితమైన అభిప్రాయం వెలిబుచ్చారు. అభివృద్ధివిషయంలో

స్థానికపరిపాలనారంగానికి గ్రామపంచాయితీని ప్రాథమిక కేంద్రంగా పెట్టుకోవలెనని వారు సూచించారు. గ్రామపరిధికి సంబంధించిన సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలుపరిచేందుకు అత్యధిక అధికారాలను గ్రామపంచాయతీకి దఖలు పరచాలి.

ఒక బ్లాకులో వున్న గ్రామపంచాయతీల ప్రెసిడెంట్లు సభ్యులుగా బ్లాకుపంచాయతీసమితి యేర్పడుతుంది. వారంతా కలిసి వారిలో నుంచి ఒకరిని అధ్యక్షుడుగా ఎన్నుకుంటారు. మొదట కొద్దికాలంవరకూ సబ్ డివిజనల్ ఆఫీసరే బ్లాకు పంచాయతీసమితి అధ్యక్షుడుగా వ్యవహరిస్తాడు. ఎన్నుకోబడ్డ అధ్యక్షుడు ఉపాధ్యక్షుడుగా వుంటాడు. బ్లాకుడెవలప్ మెంటు ఆఫీసరు సమితికి ముఖ్యకార్యనిర్వాహకాధికారిగా వుంటాడు; విస్తరణాధికార్లు, గ్రామసేవకులు బ్లాకుపంచాయతీసమితి ఆదేశాల ననుసరించి పనిచేస్తారు. సామాజికాభివృద్ధి కార్యక్రమంక్రింద లభ్యమయ్యే సాధనసంపత్తు లన్నీ, చివరకు ప్రభుత్వశాఖలు కేటాయించే నిధులు కూడా బ్లాకుపంచాయతీసమితికి చెందుతాయి. ఒక జిల్లాలో వున్న బ్లాకుపంచాయతీసమితుల అధ్యక్షులతో జిల్లాపరిషత్తు యేర్పడుతుంది. జిల్లాపరిషత్తులో ఆ జిల్లాకు ప్రతినిధులుగా వున్న పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులు, శాసనపరిషత్సభ్యులుకూడా వారి పదవులరీత్యా సభ్యులై వుంటారు. జిల్లాఅధికార్లుకూడా జిల్లాపరిషత్తులో సభ్యులై వుండవలెననీ, అయితే వారికి ఓటింగు హక్కు వుండరాదనీ బృందమువారు సిఫారసుచేశారు. జిల్లాపరిషత్తుకు కలెక్టరు అధ్యక్షుడై వుంటాడు. అభివృద్ధికి సంబం

ధించిన పరిపాలనావ్యవస్థ అంతా మూడు తంతెలుగా వుండే సూత్నవిధానం పరమై వుండాలి. ఆ మూడుతంతెలు యేవీ అంటే—మొదటిది గ్రామపంచాయతీ; రెండవది బ్లాకు పంచాయతీసమితి; మూడవది జిల్లాపరిషత్తు.

మొదట ఈ సిఫారసులన్నీ విపరీతమైన చోద్యంగా కన్పట్టినవి. కాని కొంచెం లోతుకు పోయి పరిశీలిస్తే వాటిలో చోద్య మేమీ లేదనీ, యథార్థపరిస్థితులు ఆధారంగానే ఆలోచించి చేసిన వనీ బోధపడింది. రాష్ట్రప్రభుత్వాలు ఎట్లా వున్నాయి? రాష్ట్రం మొత్తానికి ఒక శాసనసభ వుంది. ఆ సభలోనుంచి కొందరు మంత్రులవుతారు. అది మంత్రివర్గము. రాష్ట్రాన్ని మంత్రివర్గమే పరిపాలిస్తుంది. దీనికే అపారమైన అధికారా లున్నవి. దేని కెంత డబ్బు ఖర్చుపెట్టాలి అన్న అంశాన్ని నిర్ణయించేది మంత్రివర్గమే. అమాయకులు, పామరులు అయిన గ్రామప్రజలు శాసనసభ్యులను ఎన్నుకొని తను భవిష్యత్తును, మంచి చెడ్డలను వారి చేతులలో పెడుతూ వుండగా బహుసామాన్యమైన గ్రామకార్యక్రమాలను సిద్ధ పరచి, యేటా కొన్ని వేల లోపలమాత్రమే వుండే డబ్బును ఖర్చుపెట్టేందుకు ఆ ప్రజలే పంచాయతీల నెందుకు ఎన్నుకో కూడదు? ఈ ప్రతిపాదన మొదట్లో కొంత కలకలం కలిగించిన మాట నిజమే. కాని మళ్ళీ ఆలోచించుకొన్నమీదట అది సబబైనదే అని గ్రహించారు. భారతదేశంలో ప్రభుత్వ ప్రణాళికల నన్నిటినీ చర్చించడానికి అత్యున్నతస్థాయిలో ఒక వేదిక అంటూ యేదీ అంటే జాతీయఅభివృద్ధిమండలి అని చెప్పాలి. ఈ మండలిలో కేంద్రమంత్రులు, రాష్ట్రాల ముఖ్య

మంత్రులు, ప్రణాళికాసంఘసభ్యులూ వున్నారు. దీని సమా వేశాలకు ప్రధానమంత్రి అధ్యక్షత వహిస్తారు. బల్వంతరాయ్ మెహతా బృందంవారి సూచనలను జాతీయఅభివృద్ధిమండలి ఒక సమావేశంలో చర్చించి ప్రధానమంత్రి అధ్యక్షుడుగా వున్న కేంద్రసంఘం ఆధ్వర్యాన మంత్రిత్వశాఖ తుదిరూప మిచ్చిన సూచనలను ఆమోదించింది. అభివృద్ధికార్యక్రమ పాలక వ్యవస్థకొరకై పరిశీలకబృందంవారు సూచించిన విప్ల వాత్మకసూచనను—అనగా ప్రజాస్వామికవికేంద్రీకరణవిధా నమునుయొక్క మూడుతంతెల పద్ధతిని జాతీయఅభివృద్ధిమండలి ఆమోదించింది.

జాతీయఅభివృద్ధిమండలి ఆమోదించినప్రకారం ఆ సూచనలను అమలుపరచడానికై వాటిని 1958 మధ్యలో రాష్ట్రాలకు పంపడం జరిగింది. మదరాసురాష్ట్రం 1957లోనే తనకు తోచిన రీతిని ప్రయోగాత్మకంగా ప్రజాస్వామిక వికేంద్రీకరణనమూనాబ్లాకుహోకదానిని ప్రారంభించి కొంత పని జరిపించింది. ఆ బ్లాకును నిర్వహించడంలో కలిగిన అనుభవాలు వుండనేవున్నవి. ఆంధ్రరాష్ట్రంపరిశీలక బృందంవారు సిఫారసు చేసిన ప్రకారం జిల్లా కొకబ్లాకుచొప్పున మొత్తం ఇరవై ప్రయోగాత్మకబ్లాకులను ప్రారంభించింది. ఈ అనుభవా లన్నింటిచే ఉత్తేజమును పొంది రాజస్థాన్ రాష్ట్రం 1959 అక్టోబరు 2వతేదీన, అనగా గాంధీజయంతినాడు మొత్తం రాష్ట్రమును ప్రజాస్వామ్యవికేంద్రీకరణక్రిందికి తెచ్చింది. ఆ రాష్ట్రమును 232 సామాజికాభివృద్ధిబ్లాకులుగా విభజించారు. ప్రజలకూ, పంచాయతీప్రెసిడెంట్లకూ, పంచాయతీసమితుల

అధ్యక్షులకూ, జిల్లాపరిషత్తుల అధ్యక్షులకూ శిక్షణ ఇవ్వడానికై రాష్ట్రవ్యాప్తకార్యక్రమం ఆరంభింపబడింది. ఈ కార్యక్రమానికి ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేస్తూ, రాష్ట్రాన్ని అభివృద్ధి పరచే బాధ్యతను ప్రజలూ, పంచాయతీలు మొదలుపైనరకూగల సంస్థల నిర్వాహకులైన ప్రజాప్రతినిధులూ స్వీకరించవలెనని ప్రబోధించారు. ఇది జరిగిన తరువాత ఆంధ్రరాష్ట్రం దీనికి సంబంధించిన శాసనాన్ని ఆమోదించింది. 1959 నవంబరు 1వ తేదీన ఆంధ్రరాష్ట్రంలోని సామాజికాభివృద్ధి బ్లాకులలో జిల్లా పరిషత్తు లన్నింటిలో ప్రజాస్వామికవికేంద్రీకరణపథకం ప్రవేశ పెట్టబడింది.

తరువాత మద్రాసు, మైసూరు, అస్సాము, ఒరిస్సా, పంజాబ్ రాష్ట్రాలలో శాసనాలను ఆమోదించేపని మొదలైంది. మదరాసురాష్ట్రం ఈ కార్యక్రమాన్ని 1960 అక్టోబరు 2వ తేదీన 70 బ్లాకులలో ప్రారంభించింది. 1961 అక్టోబరు 2వర కల్లా అన్ని బ్లాకులకు కార్యక్రమం వర్తింపు అవుతుంది. అస్సాము, ఒరిస్సా, మైసూరురాష్ట్రాలు వాటి శాసనాలను అమలుజరుపుతూ ముందుకుసాగిపోయినవి. క్రొత్తగా ఏర్పడ్డ మహారాష్ట్ర, గుజరాతురాష్ట్రాలు తమకు యేవిధమైన ప్రజాస్వామికవికేంద్రీకరణ మంచిదో సూచించడానికై సంఘాలను నియమించాయి. ఆ సంఘాల నివేదికలు వెలువడ్డవి. వాటిలో జిల్లాస్థాయియందు, ఇంకా దిగువస్థాయియందు పరిపాలనను పూర్తిగా సంస్కరించి పునర్వ్యవస్థీకరించవలెనని సూచనలు చేయబడ్డవి. ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహారురాష్ట్రాలలో కూడ ఇదే జరుగుతూవుంది. పశ్చిమబెంగాలు, కేరళరాష్ట్రాలు

కూడా త్వరలోనే ఈ విధానమును అనుసరించగలవు. జమ్మూ-కాశ్మీరు రాష్ట్రంలో బాగా అభివృద్ధిచెందిన పంచాయతీలు ఇదివరకే వున్నవి. అవి ప్రశంసనీయమైన కృషి చేశాయి. 1961 తొలిరోజులలో భావనగర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభ అన్ని రాష్ట్రాలూ పంచాయతీరాజ్యం, సహకారసమాజముల శాసనాలను త్వరగా ఆమోదించి వాటిని అమలులో పెట్టవలె ననీ, భారతదేశంలో మన లక్ష్యమైన ప్రజాస్వామిక సోషలిస్టువిధానానికి పంచాయతీరాజ్యం, సహకారసమాజములే ప్రాతిపదికలనీ నిర్దేశించింది.

ప్రజాస్వామ్యమంటే ప్రజలే పునాదిగా వుంటారన్న మాట. మరి 'ప్రజాస్వామికవికేంద్రీకరణము' అనే మాటలో కొంత వైరుధ్యం కన్పిస్తున్నది. పైగా ఈ మాటను మన భారతప్రజలు సులభంగా అర్థం చేసుకోకుండా వున్నారు. అందుచేత ఈ మూడుతంతెల పరిపాలనా వ్యవస్థకు మన దేశీయమైన పేరు పెట్టాలని మన ప్రధానమంత్రి సూచించారు. ఆ ప్రకారమే 'పంచాయతీరాజ్యం' అన్న పేరు వాడుకలోకి వచ్చింది. ఇది తగిన పేరుకూడా. ఈ పుస్తకం ఆరంభంలో పంచాయతీరాజ్యమును వివరించడం జరిగింది. పంచాయత్ రాజ్ ప్రభుత్వానికి గ్రామస్థాయిపై ఒక యూనిట్ అన్న మాట. కాని పంచాయతీరాజ్య మంటే అది ఒకరకం ప్రభుత్వ మని అర్థం. ఒకవిధంగా చూస్తే ఇది గ్రామపంచాయతీ వ్యవస్థ; మరొకవిధంగా చూస్తే క్రింద గ్రామ పంచాయతీ మొదలు పైన కేంద్రంవరకూ వుండే ప్రజాపాలకవ్యవస్థ అవుతుంది. నిర్ణయాలు సర్వజనామోదంతోగాని, లేదా ప్రజల

సమ్మతితోగాని చేయబడుతవి. గ్రామమంటే యేమిటి? ఒక పెద్ద ఉమ్మడికుటుంబ మన్నమాట. కుటుంబంలో అభిప్రాయ భేదాలు వుండవచ్చు. రాజకీయవివాదాలకు తావుండదు. పంచాయతీరాజ్య మొక కొత్త సిద్ధాంతముగా మనం స్వీకరించాం. ఎందుకంటే ఈ విధానంవల్ల పరస్పరం సంప్రదింపులతో, ప్రజల సమ్మతితో పరిపాలన జరుగుతుంది.

1959లో మైసూరులోనూ, 1960లో కాశ్మీరులోని శ్రీనగర్‌లోనూ డెవలప్‌మెంట్ కమీషనర్ల సమావేశాలు జరిగాయి. ఈ సమావేశాలలో వివిధరాష్ట్రాలలో అమలు జరుగుతూవున్న పంచాయతీరాజ్యాన్ని సమీక్షించి, కలిగిన అనుభవాలను సమన్వయం చేసుకోవడం జరిగింది. కార్యక్రమమును ఒక వంక ప్రభుత్వమూ, మరొకవంక ప్రజాప్రతినిధులూ పంచుకోవడంవల్ల దృక్పథంలోను, ప్రజలు బాధ్యతలను స్వీకరించడంలోను విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. క్రమేణా కార్యక్రమంలోను, దాని ఆచరణవిధానంలోనూ పరిణామం కలుగుతున్నది. మొదట్లో కన్పించిన వత్తిడి ఇప్పుడు లేదు. ఒకరు ప్రోద్బలం చేయనక్కర లేదు. ఆజ్ఞాపించేవారు, ఎదురు తిరిగేవారు ఇప్పుడు లేరు. ప్రజలూ, ప్రభుత్వమూ పరస్పరం తోడునీడగా వుంటూ ఒకరికొకరు చేయూత నిస్తూపోతే దేశానికి ఎంత మేలు జరుగుతుందో ఉభయులూ గ్రహించారు. పరస్పర అవగాహనము రోజురోజుకూ హెచ్చుతున్నది. ఇందుకు అక్కడక్కడ కొన్ని మినహాయింపు లుంటే వుండవచ్చుగాక. అటువంటివి వుంటూనేవుంటాయి. పైన

చెప్పిన రెండు సమావేశాలు-ముఖ్యంగా కాశ్మీరుసమావేశం ఈ మార్పులనన్నిటినీ గుర్తించింది.

ఈ లోపల మరొక విశేషం జరిగింది. సామాజికాభివృద్ధి వ్యవస్థకూ, సర్వసేవాసంఘానికీ ఒక ఒప్పందం జరిగింది. సర్వోదయ ఉద్యమానికీ, సామాజికాభివృద్ధి ఉద్యమానికీ లక్ష్యం ఒకటే. 1957 సెప్టెంబరులో మైసూరురాష్ట్రంలోని యల్వాల్‌లో ఉన్నతస్థాయి మహాసభ జరిగినతరువాత ఇట్లా ఏకలక్ష్యం స్వీకరించడం జరిగింది. ఆ మహాసభను ఆచార్య వినోబాభావే, ఆయన సహచరులు ఏర్పాటుచేశారు. భారత రాష్ట్రపతి, ప్రధానమంత్రి, కేంద్రమంత్రులు కొందరు యల్వాల్ మహాసభకు హాజరయ్యారు. ఈ మహాసభ తరువాత సర్వసేవాసంఘం ప్రతినిధులు, సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖ ప్రతినిధులు అప్పుడప్పుడు సమావేశమై చర్చలు జరిపారు. రెండు కార్యక్రమాలకు ఉభయసామాన్యమైన పద్ధతి ఒకటి రూపొందించారు. ఆ పద్ధతిప్రకారం పని క్రమేణా జరుగుతూ వుంది.

చివరకు ఎట్లాఅయితేనేమి వ్యవసాయకార్యక్రమం ప్రాముఖ్యానికి వచ్చింది. దానితోపాటు వ్యవసాయం అత్యంత ప్రధానమైనదే అయినప్పటికీ అది గ్రామాల్లో భూములు లేని వారి సమస్యను పరిష్కరింపజాలదనికూడా గ్రహించారు. కనుక గ్రామపరిశ్రమల విస్తృతకార్యక్రమం ఒకటి ఇప్పుడు అమల్లోకి తేబడుతూంది. ఇందుకై వాణిజ్యపరిశ్రమల మంత్రిత్వ

శాఖవారూ, వారి క్రిందా సామాజికాభివృద్ధి మంత్రిత్వ శాఖక్రిందా పనిచేసే వివిధబోర్డులూ పూనుకుంటున్నాయి.

గ్రామాలలో నివసించే వెనుకబడిన జాతులవారికీ, ముఖ్యంగా దళితజాతులవారికీ ప్రత్యేకసదుపాయాలు కలిగించవలసిన అవసరం వుంది. అట్టివారికి పంచాయతీలలో, పంచాయతీసమితులలో, జిల్లాపరిషత్తులలో ప్రత్యేకప్రాతినిధ్యం కల్పించుటకు అంగీకరించాము. అయితే కేవలం ప్రాతినిధ్యం వల్లనే వారి సమస్యలు పరిష్కారం కావు. సంఘంలో స్తోమత గల ఉన్నతవర్గాలవారు వెనుకబడిన జాతుల, దళితజాతుల ప్రతినిధులు తమను బలపరిచేందుకు సకలప్రయత్నాలూ చేస్తారు. డబ్బు చూపి లోభపెట్టుతారు. అదనంగా కొన్ని కొత్త ఉద్యోగాలు సృష్టింపవచ్చు. గాంధీజయంతినాడూ, రిపబ్లిక్ దినోత్సవంనాడూ ఉత్సవాలు జరుపుతారు. కాని ఇవి తప్ప నికరంగా జరిగే పని యేమీ వుండదు. గ్రామాలలోని దళితవర్గాలవారికి ఇకముందు ఆర్థికవిషయాలలో ప్రాధాన్యమివ్వడానికి కాశ్మీరులో జరిగిన సమావేశంలో నిర్ణయింపబడింది. ఇది చాలా ముఖ్యనిర్ణయం. ఇంతవరకూ ఆర్థిక సహాయం గ్రామాలలోని స్తోమత—పలుకుబడి గల వర్గాలవారికి మాత్రమే లభిస్తూవుంది. కాశ్మీరుసమావేశం సహకారమునకు, సహకారసమాజమునకుకూడా ఒక కొత్తదృక్పథమునిచ్చింది. ఉమ్మడి సహకారసేద్యం ప్రాముఖ్యానికి వచ్చింది. ఈ విషయమై ఇంతకు క్రితం కొంత వివరించివున్నాను. మరొక అధ్యాయంలో దీనిని మరికొంత విశదీకరించగలను.

కాగా ఇంతవరకూ తేలిన సారాంశమేమిటంటే—సామాజికాభివృద్ధికార్యక్రమం ఇప్పుడు ఒక మలుపు తిరిగి కొత్తమార్గాన పడుతూవుంది. మొదట ఇది గ్రామాభివృద్ధికై ప్రభుత్వంచే ప్రారంభింపబడింది. క్రమేణా ఇది స్థానికపరిపాలన స్థాపన కొక ముఖ్యకార్యక్రమంగా వృద్ధిజెందింది. కేంద్ర ప్రభుత్వస్థాయినుండి కుటుంబస్థాయివరకు అధికారాల పంపిణీ, అధికారాలను సంక్రమింపజేయడం, పరిపాలనావ్యవస్థను ప్రజాస్వామ్యమయం చేయడం ఈ కార్యక్రమం అంతిమలక్ష్యాలై వున్నవి. రాబోవు అధ్యాయాలలో ఈ విషయాలను మరికొంత వివరంగా చర్చిస్తాను.

---

# 7. పంచాయతీరాజ్యం

గ్రామసభనుండి లోకసభకు...

సామాజికాభివృద్ధి కార్యక్రమం ఏ విధంగా అవతరించి దినదిన ప్రవర్ధమాన మవుతూ ప్రజోద్యమంగా ఎట్లా పరిణమించిందో గడచిన అధ్యాయములలో విశదీకరించడం జరిగింది. భారత దేశ చరిత్రను పరిశీలించినట్లయితే ఈ దేశం అనాదినుంచి కొత్త భావాలను, కొత్త సిద్ధాంతాలను - అవి యేదిశనుంచి వచ్చినా సరే - స్వీకరించి వాటిని సమన్వయ పరచుకొని అవలంబించినట్లు తెలియగలదు. ఇట్టి అవలంబనను మనకు పరంపరాగతంగా వస్తున్నది. ప్రపంచం నిత్యనూతనంగా జీవిస్తూవుంటుంది. మానవుడు ఎప్పటికప్పుడు తన్ను గూర్చిన కొత్త అంశాలు తెలుసుకుంటూ వస్తున్నాడు. అతనితోపాటు అతని సమాజమూ వృద్ధిచెందుతూవస్తున్నది. భావాలు ఎప్పుడూ ఒకచోట ఆగవు. అవి వ్యాప్తిజెందుతూనే

వుంటాయి. ఆవిధంగా సమన్వయ మనేది నిరంతరం కొన సాగుతూపోతుంది. మానవునికీ, అతని సమాజానికీ సంబం ధించిన దేశీయ, విదేశీయ భావాల నన్నిటిని సమన్వయపరచు కొని సామాజికాభివృద్ధికార్యక్రమం ఎట్లా పెంపొందిందో మనం గమనించాము. ఈ విధంగా కార్యక్రమం మనకు కనిపించకుండానూ, రోజురోజుకు మనకు కన్పిస్తూనూ ఒక దశ నుండి మరొకదశకు పెంపొందుతూవుంది.

ఈ కార్యక్రమంలో ఇటీవల కనిపిస్తూవున్న విశేష మేమిటంటే దిగువన కుటుంబంలగాయతు పైవరకూ ప్రజా స్వామ్యాన్నీ, ప్రజాస్వామికవ్యవస్థలనూ నిర్మించుకుంటూ పోవడం. ఈ పని జరుగుతూవున్నప్పుడు సమాజంలో దళిత వర్గములవారికి, లోగడ నిర్లక్ష్యం చేయబడ్డవారికి, ఆర్థిక, సాంఘికసహాయం లభింపజేయాలి. అభివృద్ధికి వెలుగుగా వ్యవసాయం, గ్రామపరిశ్రమలూ పెంపొందాలి. కొత్త వ్యవస్థలను ఇవి రెండూ ఆకర్షించాలి. ఇటీవల భారతపార్ల మెంటువారు సామాజికాభివృద్ధి ఉద్యమంపై మరొక బాధ్య తను పెట్టారు. భారతదేశంలోని 5,50,000 గ్రామాలలోనూ, పట్టణాలలోని మురికిపేటలలోనూ, ఆర్థికకృషి జరగాలి. మన ఆర్థికకృషికి అవే కార్యక్షేత్రాలు. అక్కడ నివసించే నోరు లేని అమాయకుల తరఫున సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖ వకాల్తా పుచ్చుకోవాలి. దీనిని సాధించడానికి, అవసరమైతే, ఈశాఖ ఇంకా విస్తరించాలి. ఈ శాఖకు అధికారం పార్ల మెంటునుంచి లభిస్తుంది. అందుచేత సర్వాధికారములు గల

వ్యవస్థయైన పార్లమెంటునుగూర్చి విశదీకరిస్తూ ఈ అధ్యాయాన్ని ఆరంభించడం సముచితంగా వుంటుం దనుకుంటాను.

భారతదేశపు పార్లమెంటు క్రొత్త ఢిల్లీలో వుంది. పార్లమెంటు భవనం చాలా పెద్దది. చూడతగ్గది. వలయాకారంలో దీనిని చాలా ఎత్తుగా నిర్మించారు. ఇందులో భారతదేశప్రయోజనులు ఎన్నుకున్న లోకసభ సభ్యులూ, రాజ్యసభ సభ్యులూ కూర్చుంటారు. మన రాజ్యాంగమునకు ఏ విధమైన భంగం కలుగకుండా దానిని పరిరక్షించడం, దాని సుస్థిరతను, గౌరవమును నిల బెట్టడం ఈ రెండు సభల బాధ్యతయైవుంది. భారతదేశంలో అధిక సంఖ్యాకులు ఇంకనూ నిరక్షరాస్యులై వున్నారు. ఒక వేళ చదువనూ, వ్రాయనూ వచ్చినా, పైచదువు లేదు. మనకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం క్రొత్తది. పార్లమెంటరీ సంప్రదాయాలు అనుభవంతో, ప్రజల సంస్కారంతో పెంపొందుతాయి. పార్లమెంటు భవనం యమున ఇసుక పునాదిపై నిర్మితమైంది. అయితే పార్లమెంటు యొక్క శక్తి దాని భవనం యొక్క దృఢత్వంపై ఆధారపడివుండదు. అది వ్యక్తుల బలమూ కాదు. సాముదాయక బలమూ కాదు. ప్రజాస్వామిక పార్లమెంటు అనగా యావన్మంది ప్రజల - అనగా జాతియొక్క ప్రతిబింబిత శక్తిని తనలో భద్రపరచు కున్న వ్యవస్థ. జాతి ప్రజల వైరశిబలం ఎంత వుంటుందో పార్లమెంటు శక్తి కూడా అంతే. అయితే జాతి బలం కల దైతే పార్లమెంటు కూడా శక్తిసమన్వితమై వుంటుంది. స్థూలంగా చెప్పాలంటే గ్రామసభల సమాహారమే లోకసభ.

మనం చూస్తూ వుండగానే మన ఇరుగు పొరుగు దేశాల పార్లమెంటులు ఛిన్నాభిన్నమై పోయినవి. ఇసుక పునాదిపై కట్టిన పార్లమెంటును సులభంగా ఒక తావునుంచి మరొక తావుకు మార్చవచ్చు. ఎవరు చొచ్చుకు రాగలిగితే వారికి ఆ పార్లమెంటులో చోటు వుంటుంది. అట్లాగాక ప్రజల దృఢమైన భుజస్కంధాలపై ఆధారపడివున్న పార్లమెంటు అయితే దానికి ఎట్టి ప్రమాదమూ వుండదు. ప్రజలు కేవలము మందవంటి వారైతే వారిని గొఱ్ఱెలమాదిరిగా ఎక్కడికి పడితే అక్కడకు తోలవచ్చు. ఆ స్థితిలో పార్లమెంటు దోపిడీ దారుల వశ మవుతుంది. ఏ విధంగా చూచినప్పటికీ ప్రజలు గొఱ్ఱెలమందవలెకాక సుసంఘటితమైన ప్రజగా వుంటే, క్లిష్టసమయంలో పార్లమెంటును ఆదుకోగలిగివుండి, అది తన ఇష్టాయిష్టాల ప్రకారం ప్రవర్తిస్తూవుంటే దానిని దారికి తెస్తూ వున్నట్లైతే ప్రజల ప్రజాస్వామిక రాజ్యమనేది చెక్కుచెదర కుండా వుంటుంది. ఇది భారతదేశంవంటి సువిశాలమైన దేశంలో విద్యా, విజ్ఞానములు బాగా వ్యాపించని దేశములో, వెనుకబడ్డ దేశంలో ఎట్లా సంభవమవుతుంది? మనం అనుకునే ఆదర్శాలనూ, స్వరూపాలనూ కాగితంమీద వ్రాయడం సులభమే. మన గమ్యంవైపుకు ప్రమాదం లేకుండా పురోగమించడానికి నేడు ప్రయత్నం మొదలుపెట్టడం ఎట్లా అన్నదే మన సమస్యగా వుంది.

పార్లమెంటు సభ్యులను ఆయా నియోజక వర్గాలలో వయోజనులైన స్త్రీ, పురుషులు ఎన్నుకుంటారు. లోకసభ సభ్యుని నియోజక వర్గంలో 8,00,000 నుండి 10 లక్షల

వరకూ జనాభా వుంటుంది. రాజ్యసభ సభ్యునికి సూత్రరీత్యా మొత్తం రాష్ట్రం నియోజకవర్గమని చెప్పాలి. పార్లమెంటు సభ్యులు వారి నడతను బట్టి, వారి చొరవ, పరిశ్రమలను బట్టి, ప్రజలపై వారికి గల శ్రద్ధను బట్టి, ప్రజల శ్రేయస్సుకొరకై పూర్వం వారు చేసిన పనులను బట్టి, వారు చేస్తామని చెప్పుకునే ప్రజాహిత కార్యక్రమాలను బట్టి, వారి పార్టీ చరిత్రను బట్టి ప్రజలచే ఎన్నుకోబడుతూ వుంటారు. గొప్ప వ్యక్తు లెప్పుడూ వుంటారు. వా రెంత దూరంలో వున్నా ప్రజలు వారిని గుర్తించగలరు. పార్లమెంటుకు ప్రతినిధిగా వెళ్ళకూర్చో డానికి వారు అర్హులా, కాదా అన్న విషయమును ప్రజలే సుల భంగా తెల్సుకోగలరు. కాని సాధారణ వ్యక్తులు నియోజక ప్రజ లకు ఎట్లా తెలుస్తారు? ఇందుకు మన విధానంలో ఏమైనా అవ కాశం వుందా? భారతదేశ ప్రజాస్వామ్యానికి ఇంకా ఈ సమస్య తటస్థపడలేదు. మన అదృష్ట వశాత్తూ పాతనాయ కులే ఇంకా వున్నారు. అయితే వారిలోనూ కొందరు రాలి పోతూనే వున్నారు. అయినా పరిచిత నాయకత్వ మనేది నిలిచివుంది. ఒక అభ్యర్థి పార్లమెంటుకు అర్హుడా, కాడా? అన్న విషయాన్ని తెలుసుకోడానికి జాతీయోద్యమంలో ఆయన చేసిన పని, జాతీయనాయకులు అతని కిచ్చే మద్దతు వంటి కొలబద్దలు నేటికీ వున్నవి. కాని మన జాతీయోద్యమం మన దేశ చరిత్రలో ఒక భాగమైపోతూ వుంది. పోరాడడానికి ఇప్పుడుకాని, ఇకముందుకాని మనకు వలస ప్రభువులు లేరు; వుండరు. మనకు అద్యతన భావిలో దేశవ్యాప్త ఉద్యమాలేవీ కనిపించవు. కనుక జైళ్ళకు వెళ్ళడం, ఉరికంబాల కెక్కడం

వంటి సాహసోపేతమైన కార్యాలకు అవకాశంలేదు. ఇట్టి స్థితిలో సేవవల్లగాక అవకాశాన్ని పురస్కరించుకొని ప్రజా నాయకులమంటూ ముందుకు వచ్చి నేడో, రేపో పార్లమెంటు సభ్యత్వాన్ని సంపాదించుకునే అవకాశవాదులను మన మెట్లా నిరోధించగలుగుతాము?

అజ్ఞానం, పేదరికం వ్యాప్తి జెంది వున్నంతవరకూ ప్రజలను వంచన చేయవచ్చు. భారతదేశంలో ఇవి ఇంకా వున్నాయి. పూర్వమూ వుండేవి. రేపు కూడా వుండవచ్చు. ఇప్పటికీ మన దేశంలో మాజీ సంస్థానాధీశులు, జాగీరుదార్లు, పెద్ద పెద్ద భూస్వాములు వున్నారు. వారు కొత్త పరిస్థితికి ఇంకా అలవడలేకపోతున్నారు. బ్లాకు మార్కెటు చేసే వ్యాపారస్థులు, గుత్తవ్యాపారులు వున్నారు. మనం నిర్మించబోయే ప్రజాస్వామ్యంలో వీరికి హానిలేదు. అయితే వారి బాగోగులు వారికి వున్నాయి. వారి లావాదేవీలు వారివి. ఇటువంటి దుష్టశక్తులు దొడ్డి దారిని వచ్చి పార్లమెంటును పట్టుకోకుండా ఎలా నిరోధించగలుగుతాము? వీరు ప్రపంచం ఇతర దేశాల్లో వుండే తమ జతగాళ్ళతో కలసి ఏమైనా చేయవచ్చు. విచారకరమైన విశేష మేమంటే మంచిని చేకూర్చగల శక్తులకు జాతి ఎల్లలు అడ్డుగా నిలుస్తున్నాయి. కాని దుష్టశక్తులకు ఎల్లలు అనేవి లేవు. వాటికి జాతిభేదమే లేదు. వారి ఏజంట్లు ప్రపంచమంతటా పరచుకొని వుండి తమ వ్యాపారము సాగిస్తూవుంటారు. బంగారాన్ని, రత్నాలను దొంగతనంగా చేరవేసే నేరస్థులకంటె వీరు మరింత కట్టుదిట్టంగా పనిచేస్తూవుంటారు. వీరి బెడదనుండి బాల్యావస్థలో

వున్న మన ప్రజాస్వామ్యాన్ని కాపాడడమెట్లా? దీనికి పంచాయతీరాజ్యము చక్కని సమాధానం. ఏదృష్ట్యా చూచినా ఈ సమాధానమే సరియైనదిగా కనిపిస్తుంది.

నయోజనుల హృదయాలలో వుండే ప్రజాస్వామ్య భావమే పార్లమెంటులోనూ ప్రతిబింబిస్తుంది. అంటే నయోజనులు కురుక్షేత్రయుద్ధంలో ఎలా వ్యవహరిస్తారో దానిపై దుష్టులకూ, శిష్టులకూ జరిగే యుద్ధం పర్యవసానం ఆధారపడి వుంటుంది. అదే జాతియొక్క పార్లమెంటులో వ్యక్తమవుతుంది. జాతీయస్థాయిపై ప్రజాస్వామ్యమును, సర్వస్వతంత్ర ప్రతిపత్తిని నిలబెట్టాలంటే దుష్టశక్తులను ఎదుర్కొనే స్తోమతను పెంపొందించుకోవాలి. ఇంతవరకూ మనం శిఖరాన్ని చూడటానికి అలవాటుపడ్డాము. ఇకనుంచి మన పరిసరాలను చూడాలి. జాతీయవలయానికి వ్యక్తి కేంద్రంవంటివాడు. మన సర్వసత్తాకప్రతిపత్తికి అతడు ప్రాతిపదిక. మనం పునాదులనైపు చూచి అక్కడనుంచి జాతిని నిర్మిస్తూ రావలెనంటే వ్యక్తి స్వేచ్ఛగా సంపూర్ణంగా వికసించే వీలు యేమిటా అని ఆలోచించాలి.

సమాజంలో వ్యక్తి ఒక్కడే జీవించడు. వ్యక్తులంటే సంఘంలో జీవించేవారని ఇచట నా భావం. సన్యాసులని కాదు. ఒక వ్యక్తి తాను నివసించే సమాజానికి అతీతుడై, సన్యాసి అయితే అది వేరే విషయం. సన్యాసికి పెద్ద బెడద యేమీ వుండదు. సత్రాభోజనం, మఠానిద్ర. కాని సమాజంలో నివసించే సంసారుల సంగతి వేరు. వ్యక్తి సమాజంతో నిమిత్తం లేకుండా వుండలేడు. అతడు సంఘంలో ఒక సభ్యుడై

వుంటాడు. అలా కాక ఏకాకిగా వున్నాడంటే మనుషులంటే ద్వేషం పెంచుకొని అడవిఏనుగువలె సంచరిస్తాడు. సంఘ వ్యతిరేకి అవుతాడు. వ్యక్తి కుటుంబసభ్యుడు కావాలి. కుటుంబం మన ప్రజాస్వామ్యానికి ప్రాతిపదిక. కొన్ని కుటుంబాలు కలసి ఒక గ్రామ మవుతుంది. కొన్ని గ్రామాలు కలసి ఒక దేశ మవుతుంది. ఇట్లా ఏకప్రపంచకుటుంబం ఆవతరిస్తుంది.

భారతరాజ్యాంగంలోని ఆదేశసూత్రాల ననుసరించి మన మొట్టమొదటి ప్రజాస్వామ్యవ్యవస్థ గ్రామపంచాయతీయై వున్నది. గ్రామపంచాయతీ అంటే గ్రామంలోని వయోజనులు ఎన్నుకున్నట్టి పెద్ద మనుషులతో కూడిన మంత్రివర్గం. ప్రజలు దానిని అదుపులో పెట్టకపోతే అది తనకే ఉపద్రవం కొని తెచ్చుకుంటుంది. గ్రామపంచాయతీని మంత్రివర్గంగా పోల్చుకున్నప్పుడు గ్రామస్థుల కొక విశాలమైన వ్యవస్థ వేరే వుండాలి. అట్టి వ్యవస్థనే ఈనాడు మనం 'గ్రామసభ' అని అంటున్నాం. గ్రామంలోని వయోజనులందరూ—అనగా స్త్రీ పురుషులు, యువకులూ, ముసలివారూ అంతా కలసి గ్రామ సభ అవుతారు. అనగా మన జాతీయపార్లమెంటువలె గ్రామ సభ గ్రామానికి పార్లమెంటు అన్న మాట. గ్రామసభవారు పంచాయతీసభ్యులను ఎన్నుకుంటారు. దేశవ్యవహారాలను మంత్రిమండలి చూచినట్లే, గ్రామవ్యవహారాలను గ్రామ పంచాయతీ నిర్వహిస్తుంది. గ్రామసభ అప్పుడప్పుడూ సమావేశ మవుతూవుండాలి. పంచాయతీవారు చేసే పనులను గూర్చి చర్చించాలి. వాటి మంచిచెడ్డలను నిర్ణయించాలి.

పంచాయతీ మంచి పనులను చేస్తే వాటిని ప్రశంసించాలి. అలాకాక పంచాయతీసభ్యులు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తాంటే వారి తప్పు వారికి చూపి అదుపులో పెట్టాలి. గ్రామప్రజల ఆశలనూ, నిరాశలనూ, ఆదర్శాలనూ గ్రామసభ వ్యక్తం చేయాలి. గ్రామపంచాయతీ వాటి కనుగుణంగా తన విధులను నిర్వర్తించాలి.

గ్రామపంచాయతీ తర్వాత రెండవ తంతె బ్లాకు. పంచాయతీల ప్రెసిడెంట్లు — అనగా పంచాయతీసభ్యులు ఎన్నుకున్నవారు బ్లాకుపంచాయతీసభ్యులైవుంటారు. బ్లాకు లోపల జరిగే అభివృద్ధికార్యకలాపాల పరిపాలనకు వారే పూర్తిగా బాధ్యులు. బ్లాకులో పనిచేస్తూవున్న విస్తరణ సిబ్బందినీ, పరిపాలకసిబ్బందినీ వారు పర్యవేక్షణచేసి, మార్గం చూపాలి. బ్లాకుపంచాయతీసమితివారు స్త్రీప్రతినిధులను, నిమ్నజాతులూ, దళితజాతుల ప్రతినిధులను, సమితిలో ప్రాతినిధ్యం లేనట్టి సహకారసంఘాలూ తదితరసంస్థల ప్రతినిధులను సభ్యులుగా కో ఆప్టుచేసుకుంటారు. అనగా బ్లాకుజనాభాలో అన్ని వర్గాలవారికీ సంపూర్ణప్రాతినిధ్యం పంచాయతీసమితిలో వుండవలెనని మన ఆశయం.

గ్రామసభపై వుండే మూడవ వ్యవస్థ జిల్లాపరిషత్తు. జిల్లాపరిషత్తులో బ్లాకుపంచాయతీల ప్రతినిధులు, ఆ జిల్లాకు చెందిన శాసనసభ్యులు, పార్లమెంటుసభ్యులు, జిల్లాలోని సహకారప్రతినిధులు, ఇంకా ఏమైనా ప్రత్యేకసంస్థలుంటే వాటిప్రతినిధులు సభ్యులైవుంటారు. కొన్ని రాష్ట్రాల్లో బ్లాకు సమితికీ, జిల్లావ్యవస్థకూ నేరుగా ఎన్నిక జరిగే పద్ధతి కొంత

వరకు వున్నది. ఏమైనా ఈ విధానం ఇంకా తొలిదశలో మాత్రమే వుంది. పరిపాలనాసర్వీసుకు చెందిన ఒక సీనియర్ అధికారి జిల్లాపరిషత్తుకు కార్యదర్శిగా వుంటాడు. జిల్లాలో వుండే వివిధ ప్రభుత్వశాఖల అధిపతులు జిల్లాపరిషత్తు అధికారంక్రిందనే వుంటారు. వీరు వారి పదవులను బట్టి జిల్లా పరిషత్తు సభ్యులై వుంటారు. కాని వీరికి ఓటు చేసే హక్కు వుండదు. జిల్లాకలెక్టరుకూడా పరిషత్తులో వుండడు. అతడు పరిషత్తుకు మార్గదర్శిగా, సలహాదారుగా మాత్రమే వ్యవహరిస్తాడు. అంతేకాక రాష్ట్రప్రభుత్వప్రతినిధిగా వ్యవహరిస్తూ, వ్యవహారనియమాలను పరిషత్తు అతిక్రమించకుండ ఆచరణలో చట్టం నిబంధనలు అమలుజరిగేట్లు చూస్తూ వుంటాడు. అతడు రాష్ట్రప్రభుత్వానికీ, జిల్లాపరిషత్తుకూ మధ్య సంధానకర్తగా వుంటాడు. సాంకేతిక ఆర్థికసహాయం ఈ ప్రజాస్వామ్యసంస్థకు సక్రమంగా అందేటట్లు చేస్తాడు.

ఒక ప్రజాస్వామికసంస్థయొక్క అధికారమండలంలో వుండే ప్రజలు ఆ సంస్థ చేసే నిర్ణయాలనూ, ఆ నిర్ణయాల అమలునూ, ఏదోవిధంగా ప్రభావితం చేస్తే తప్ప, లేకపోతే ప్రజాస్వామ్యం హెచ్చుకాలం మనజాలదు. అంటే ఏ నిర్ణయమైనా ప్రజలు కోరే విధంగా వుండాలి. అంటే, ఒక నిర్ణయాన్ని చేయడంలో ప్రజలుకూడా భాగస్వాములు కావాలన్న మాట. దీన్ని ఎలా సాధించగలం? ఇందుకొరకై పనినిబట్టి ఉపసంఘాలను వేయవలెనని తలపెట్టబడింది. గ్రామ పంచాయతీవారు గ్రామసభ ఆమోదంతో పనినిబట్టి ఉప సంఘాలను వేయవలెనని తలపెట్టబడింది. గ్రామపంచాయతీ

వారు గ్రామసభ ఆమోదంతో పనినిబట్టి ఉపసంఘాలను నియమించవచ్చు. ఉదాహరణకు: వ్యవసాయం, పశుపోషణ, చిన్న నీటివనరులకు ఒకటి; గ్రామపరిశ్రమలకు రెండవది; విద్య, ప్రజారోగ్యం, రాకపోకలు, పౌరసౌకర్యాలకు మూడవది; దళితజాతులవారి ఉద్ధరణకు నాల్గవది; సాధారణ పరిపాలనకు ఐదవది – ఇట్లా కొన్ని ఉపసంఘాలను నియమించుకోవచ్చు. ఇట్టి ఉపసంఘాలలో గ్రామపంచాయతీసభ్యులు కొందరు, గ్రామసభలో వుండే వివిధవృత్తివర్గాల సభ్యులు కొందరు సభ్యులుగా వుండవచ్చు.

పంచాయతీస్థాయిపై వుండే ఉపసంఘాలవంటి వాటినే బ్లాకుస్థాయిపై, జిల్లాస్థాయిపైకూడా నియమించుకోవచ్చు. పై తంతెలకు పోయేకొద్దీ ఇంకా ఎక్కువ ఉపసంఘాలనుకూడా వేసుకోవచ్చు. ఇటువంటి విధానము రాష్ట్రశాసనసభలలో, పార్లమెంటులో ఇదివరకే వుంది. వాటిని ఆయా విషయాలకు సంప్రదింపుల ఉపసంఘా లని అంటారు. ఈ సంప్రదింపుల ఉపసంఘాలు తమతమ ప్రత్యేకవిషయాలనుగూర్చి పరిశీలన జరుపుతూవుంటాయి. తమకు సంబంధించిన మంత్రిత్వశాఖకు సకలవిషయాలనుగూర్చి సలహాలను యిస్తూవుంటాయి. ఈ సంప్రదింపుల సంఘాల సభ్యులు, స్థానికపరిపాలనాసంస్థల ఉపసంఘాల సభ్యులు ప్రజలకు శిక్షణ గరపే కార్యక్రమంలో పాల్గొనవచ్చు. ఈ విషయాలనుగూర్చి ముందుముందు మరి కొంత వివరిస్తాను.

ఇప్పుడు తేలిన సారాంశ మేమిటి? గ్రామసభ పంచాయతీసభ్యులను ఎన్నుకుంటుంది. పంచాయతీప్రెసిడెంటు

పంచాయతీపరిపాలనావ్యవహారాల్లో దక్షులై వుంటారు. గ్రామపంచాయతీప్రతినిధుల్లో సమర్థులైనవారు ఉపసంఘాల నాయకులుగా ఎన్నుకోబడతారు. లేదా బ్లాకుపంచాయతీ సమితిస్థాయిసంఘాల సభ్యులుగా వుంటారు. వారిలో శ్రేష్ఠులైనవారు కొందరు కాలక్రమేణా బ్లాకుసమితికి అధ్యక్ష, ఉపాధ్యక్షులుగా వరింపబడవచ్చు. ఇలా ఈ విధానం జాతీయ స్థాయివరకూ పోవచ్చు.

గ్రామపంచాయతీ ఉపసంఘాల అధ్యక్షులు తమ ప్రత్యేక పనులను గూర్చి ప్రజలకు తెలియజెప్తారు. బ్లాకు పంచాయతీ సమితిలో సభ్యుడుగా వుండే గ్రామపంచాయతీ ప్రతినిధి బ్లాకుసమితి ఎట్లా పనిచేస్తూ వున్నదో, దాని స్వరూప, స్వభావా లేమిటో గ్రామస్థులకు ఎరుకపరచవచ్చు. అలాగే జిల్లా పరిషత్తులో సభ్యుడుగా వుండే బ్లాకు ప్రతినిధి తక్కిన శాసనసభ్యులూ, పార్లమెంటు శాసనసభ్యులూ పైన జరుగుతూ వుండే విశేషాలను తమవారికి విశదపరచవచ్చు. ఈ విధంగా స్వగ్రామానికీ, పైవ్యవస్థలకూ సంబంధం ఏర్పడుతుంది. ఇలాగే గ్రామంలో పరిష్కారం కానట్టి సమస్యలను బ్లాకు పంచాయతీ సమితికీ, బ్లాకు సమితుల సమస్యలను జిల్లా పరిషత్తుకూ తీసుకుపోయి చర్చించవచ్చు. జిల్లా సమస్యలను రాష్ట్ర శాసనసభలో ప్రస్తావించవచ్చు. రాష్ట్ర సమస్యలను పార్లమెంటులో చర్చకు పెట్టవచ్చు. ఈ రీతిగా పై విషయాలను దిగువవారికి తెలియచెప్పి, దిగువ సమస్యలను పై వ్యవస్థలలో చర్చించినందువల్ల కుటుంబం మొదలుకొని జాతీయ పార్లమెంటువరకూ సరాసరి సంబంధం ఏర్పడిపోతుంది.

జాతీయస్థాయిపై అవలంబింపబడే విధానాలనూ, పథకాలనూ గ్రామసభలకు, చివరకు కుటుంబాలకు తెలియజేప్పవచ్చు.

స్వాతంత్ర్యమంటే మన కిష్టమైన వ్యక్తులనూ, విధానాలనూ ఎంచుకునే స్వాతంత్ర్యమనీ, మనల్ని మనం పరిపాలించుకునేందుకు స్వాతంత్ర్యం కలిగి వుండటమనీ మన నాయకులు పలుమార్లు ఉద్ఘాటించివున్నారు. ఇటువంటి స్వాతంత్ర్యం గ్రామస్థాయి మొదలుకొని కేంద్రస్థాయివరకూ వుండాలి. అధికారాన్ని గూర్చి మాట్లాడేటప్పుడు దిగువ స్థాయినుంచి చూచి ఏ విషయాన్నయినా ఆలోచిస్తాము. దిగువస్థాయి అనగా కుటుంబము అని అర్థము. స్వపరిపాలనకు కుటుంబమే ప్రాథమికస్థాయి. ఒక కుటుంబం ఇతర కుటుంబాల విషయాల జోలికి పోకుండా తన వ్యవహారాలను తాను చూచుకునే హక్కు కలిగివుండాలి. అది దాని జన్మ హక్కు. ప్రపంచంలో ఏ ప్రభుత్వానికీ ఈ విషయంలో జోక్యం కలిగించుకునే అధికారం లేదు. ఒక కుటుంబం చేయజాలని దానిని, కొన్ని కుటుంబాలు సమిష్టిగా చేయగలదానిని గ్రామ పంచాయతీకి వదిలిపెట్టాలి. ఈ విషయంలో పై వ్యవస్థలు సహాయం చేయవచ్చు. కాని గ్రామ పంచాయతీని శాసించడానికి వీలులేదు. ఒక పంచాయతీ చేయలేని పనులు కూడా వున్నాయి. ఉదాహరణకు ఆసుపత్రిని, మాధ్యమిక లేదా ఉన్నత పాఠశాలను నెలకొల్పడం లేక పశువైద్యశాలను స్థాపించడం, లేక మార్కెటింగ్ కేంద్రాన్ని పెట్టడం వంటివి. వీటిని పంచాయతీ సమితి యేర్పాటు చేయగలుగుతుంది. ఈ విధంగా కొన్ని గ్రామాలకు సంబంధించిన పనులను తమ

మార్గదర్శకత్వాన చేసేందుకై గ్రామపంచాయతీని తమ ఏజంటుగా ఉపయోగించుకోనచ్చు. సాంకేతిక పరిపాలనా విషయాల్లో పైనుండి అవసరమైన మార్గ దర్శకత్వమును పంచాయతీ సమితి పొందవచ్చు. జిల్లా సంస్థ మాత్రమే తగురీతిగా నిర్వహించగల అభివృద్ధి అంశాలు ఎన్నో వున్నాయి. వాటిని జిల్లా పరిషత్తు నిర్వహించాలి. జిల్లా పరిషత్తు బ్లాకుపంచాయతీ సమితులకు సలహాలిచ్చి వాటిని నడుపుతూ వుండాలి. సమితుల కార్యకలాపాలకు అవసరమైన సాంకేతిక సహాయమును, ఇతర సాధనసంపత్తిని జిల్లా పరిషత్తు సమకూర్చాలి. జిల్లా పరిషత్తు చేయలేని దానిని రాష్ట్ర ప్రభుత్వం స్వీకరించి నిర్వహిస్తుంది. రాష్ట్రం చేయలేని పనిని కేంద్రప్రభుత్వం చేయగలగాలి.

కనుక మనం తలపెట్టే పంచాయతీ రాజ్యంలో దిగువ నుండి పైస్థాయివరకు యోగ్యతను, సమగ్రతను హెచ్చించడం జరుగుతుంది. కేంద్రంనుండి దిగువస్థాయికి బాధ్యతల మార్పిడి జరుగుతుంది. ఇంకా పైకి ఎక్కదలచుకున్నవాడు తన బుజాలపై వున్న బరువు ఎంత తగ్గించుకోడానికి వీలైతే అంత తగ్గించుకోవాలి. ఈ సంగతి పర్వతాలు ఎక్కేవారికి తెలుసు. మన కేంద్రప్రభుత్వం యే స్థాయినుండి పనిచేయ వలెనో అలా చేయాలంటే దాని బాధ్యతలను కొన్నిటిని తగ్గించి వాటిని రాష్ట్ర ప్రభుత్వాలు స్వీకరించి నిర్వహించే టట్టు చేయాలి. అలాగే పంచాయతీ రాజ్యసంస్థలు చేయదగ్గ పనులను రాష్ట్ర ప్రభుత్వాలనుంచి తీసి, జిల్లా పరిషత్తులకు, బ్లాకుపంచాయతీ సమితులకు, పంచాయతీలకు, సహస్వాచ్ఛంద

సంస్థలకు, కుటుంబాలకు అప్పగింతపెట్టాలి. ఇలా జరిగినపుడు పంచాయతీరాజ్యం మన జీవనవిధానమవుతుంది. అది ప్రభుత్వంలో ఒక భాగమై వుండటానికి బదులు ప్రభుత్వాని కొక కొత్త తెన్నును చూపిస్తుంది. మన ప్రజలకు గ్రామసభ నుండి, లోకసభ వరకు సంపూర్ణమైన సంబంధం యేర్పడి పోతుంది. అప్పుడు మన ప్రజాస్వామ్యానికి కుటుంబం పునాది అవుతుంది. పంచాయతీ రాజ్యం ప్రతి కుటుంబానికి పార్ల మెంటు మొదలుకొని, కింది వ్యవస్థల ద్వారా లభించగల ఉన్నత మార్గదర్శకత్వమును అందుబాటులోకి తెస్తుంది. ఒక స్థాయిలో కొన్ని విషయాలలో ఇతరుల అజమాయిషీతో నిమిత్తం లేకుండా ప్రజలు తమ వ్యవహారాలను తామే నిర్వ హించుకునే అవకాశం లభింపజేస్తుంది. మన ప్రజా స్వామ్యంలో ఒక్కొక్క వ్యవస్థకుం మూడు వర్గాల విష యాలు వుంటాయి. ఒకటి ప్రాతిపదిక విషయం. ఆ విషయా నికి సంబంధించిన బాధ్యత దానిదే. రెండవది ఉభయులకు చెందే విషయం. దీనికి క్రింది వ్యవస్థకూ, దాని పైవ్యవస్థకుం సంయుక్త బాధ్యత వుంటుంది. మూడవది - శేషించిన బాధ్యతలు. వీటిని పై సంస్థకు దఖలు పరచడం జరుగుతుంది.

సహకార సమాజము

జాతిని పునరుజ్జీవింపజేసి, పునాదినుండి నిత్యజీవితమును దృఢ రీతిలో నిర్మించుకోవాలంటే సహకార సంఘాలు, పంచా యతీలు రెండు ముఖ్య వ్యవస్థలుగా వృద్ధి చెందవలసివుంది. కాని వలస పరిపాలకులు వీటిని అలా వృద్ధి చెందనివ్వలేదు.

అందుచేత ఇవి రెండూ చైతన్యము లేకుండా అయ్యాయి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ రెండు సంస్థలకూ రెక్కలు వచ్చాయి. అయితే సామాజికాభివృద్ధి కార్యక్రమం మొదలైనప్పటినుండి ఈ రెండు వ్యవస్థలు పనిజేసే వైనంలో అసంగతాలు ప్రస్ఫుటమయ్యాయి. అసలు ఈ విషయాలు రెండూ ఒకదాని కొకటి సన్నిహితమైనవి. ఒకటి మరొకదానికి బలం చేకూర్చుతుంది. ఇట్లా ఇది రెండూ పరస్పరపోషకమైనవి. కనుక ఈ రెండు వ్యవస్థలకూ పోటీ, ఘర్షణ యేర్పడకుండా చేయాలంటే ఇవి చేసే పనులను స్పష్టంగా విభజించాలి.

సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖకు ఈ రెండు వ్యవస్థలనూ అప్పగించడం చాలా ముఖ్యమైన విషయం. మన ప్రజాస్వామ్యానికి మూడు పునాది స్తంభా లున్నాయి. ఆ మూడింటిలో రెండు ఇవి—(1) పంచాయతీలు, (2) సహకారసంఘాలు. భారతదేశంలో పెంపొందుతూవున్న ప్రజాస్వామ్యంలో సహకారసంఘాలు వహించవలసిన పాత్రను, ఇటు పంచాయతీలలో సహకారానికి గల సంబంధమును, అటు మన లక్ష్యమైన సామ్యవాదపద్ధతిసమాజానికీ, సహకారానికీ గల సంబంధమునూ నిర్వచించి చెప్పవలసిన అవసర మున్నది. పంచాయతీ అన్న మాటలోనే ఆసంస్థ గ్రామపరిపాలనకూ, ప్రణాళికలకూ బాధ్యత వహించివుండే సంస్థ అని విశదమవుతుంది. ఇక గ్రామఆర్థికవ్యవహారాలు కుటుంబాలకు చెందినవైతే వాటికే వదిలి వేయాలి. గ్రామ ప్రజలందరికీ సంబంధించినవైతే సహకారసంస్థకు అప్ప

గించాలి. భారతప్రభుత్వానికి ప్రణాళికాసంఘం ఎటువంటిదో గ్రామఆర్థిక విషయాల్లో పంచాయతీ అలా పనిచేయాలి. పాఠశాల, సామాజికకేంద్రము, మహిళామండలి కేంద్రము, గ్రంథాలయం, ఆటలమైదానం వంటివాటి నిర్వహణమును పంచాయతీలు చేపట్టవచ్చు. కాని వీటినిగూడ ప్రజల సహవ్యవస్థలకే అప్పగింతపెట్టే ప్రయత్నం చేయాలి. పంచాయతీ నేరుగా నిర్వహించవలసిన పనులు ఎంత తక్కువగా వుంటే, ప్రజాభివృద్ధికి, సామాజికాభివృద్ధికి అది అంత సమర్థవంతంగా పనిచేయగలుగుతుంది.

ప్రజాస్వామ్య మనేది ఒక సర్వసమగ్రమైన విధానమని ఇచ్చట నొక్కిచెప్పవలసివున్నది. దీనిని ఏకంగా వృద్ధిచేయవలసి వుంటుందిగాని, అటు కొంత, ఇటు కొంత ప్రవేశపెట్టినందువల్ల ప్రయోజనం లేదు. ప్రవేశపెడితే జీవితంలోని అన్నిరంగాలకూ వర్తింపుచేయాలి. లేకపోతే లేదు. సాధారణ పరిపాలనావిషయాలకూ, గ్రామంలోని పౌర వ్యవహారాలకూ మాత్రమే ప్రజాస్వామ్యాన్ని అసమగ్రంగా వర్తింపుచేయకూడదు. మన ఆర్థిక జీవితంలోకూడా ప్రజాస్వామ్యం పూర్తిపాత్ర వహించాలి. అంటే సాధ్యమైన ప్రతిదశలో సహకారరంగం పెంపొందాలి. సహకారమంటే ఒక మనిషికి ఒక ఓటు. అనగా తలలుమాత్రమే లెక్కకువస్తా యన్నమాట. కనుక సహకారమంటే ప్రజాస్వామ్యంపై ఆధారపడ్డ మన ఆర్థికపరిస్థితి యొక్క పెంపుదల అని మనం గ్రహించాలి. గ్రామానికి ఒక పంచాయతీతోపాటు ఒక సహకారసంఘం

కూడా వుండాలి. దానిని సర్వీసుసహకారసంఘ మని వ్యవహరించాలని మన దేశంలో చాలామంది విజ్ఞులు అంటున్నారు. గ్రామంలో ఆర్థిక వ్యవహారాలకు తల్లివంటిది సహకార సంఘము. అది పరపతి, విక్రయపుఏర్పాట్లు, సరఫరాలు, సర్వీసు మొదలగు విషయాలను చూడాలి. గ్రామపంచాయతీ క్రింద ఎంత ప్రదేశ ముంటుందో సర్వీసుసహకారసంఘంక్రింద కూడా అంతే ప్రాంతం వుండాలి. సమాజం ఏకంగా వుండడం ఒకరి కొకరు తెలిసివుండడం, ఒకరికొకరు తోడ్పడటం, ప్రదేశ మొకటైయుండడం—ఇవి దృష్టిలో పెట్టుకొని సర్వీసు సహకారసంఘమును ఏర్పాటుచేయాలి. ఒక గ్రామానికి ఒక సంఘం వుండవలెనని ప్రభుత్వం నిర్ణయించింది. ఒకవేళ గ్రామం మరీ చిన్నదైతే చుట్టుప్రక్కల వున్న మరిరెండు గ్రామాలనుకూడా చేర్చుకొని ఆ మూడింటికి ఒక సహకారసంఘాన్ని పెట్టాలి. ఏమైనప్పటికీ ఒక సంఘంక్రింద 3,000 జనాభాకు మించరాదు. సర్వీసుసహకారసంఘానికీ, చేర్చుకోబడ్డ గ్రామాలకూ దూరం మూడు మైళ్ళకు మించివుండరాదు.

సర్వీసుసహకారసంఘం వ్యవసాయదారుని అవసరాలను తీర్చడం ముఖ్యవ్యాపారంగా పెట్టుకోవాలి. అయితే గ్రామంలో వ్యవసాయమేగాక ఇతరవృత్తులుకూడా వుంటాయి. మనం మన వ్యవసాయసామర్థ్యాన్ని పెంచి మేలైన పనిముట్లనూ, పరికరాలనూ వాడుతూపోతే వ్యవసాయ వృత్తిలో పూర్వంకంటే తక్కువమంది వుంటారు. కారణ మేమంటే, ఆధునికవిధానాలతో సేద్యం చేయడానికి ఎక్కువ మంది మనుష్యులు అక్కరలేదు. తక్కువమందితోనే పని

గడుస్తుంది. కనుక ఈవృత్తిలో వుండేవారి సంఖ్య తగ్గుతుంది. భూవిస్తీర్ణమును పెంచలేముకదా! కనుక జనాభా ఎక్కువయ్యే కొద్దీ గ్రామపరిశ్రమలరంగం తప్పనిసరిగా విస్తృతిజెందాలి. ఈ పరిశ్రమలే అదనపు మనుష్యులకు పనులు కల్పిస్తాయి. ప్రజల జీవనప్రమాణం పెరగడమంటే రకరకాల పైర్లు సాగు కావాలి. తిండి, బట్ట, ఇల్లు, విద్య, వైద్యం, వినోదంవంటి వసతులు యేర్పడాలి. అంటే రకరకాల వృత్తులు ఏర్పడాలి. పరిశ్రమల రంగం విస్తృతిచెందాలి. ఆర్థికాభివృద్ధికి పునాది ఏర్పరచడానికి సహకారం మనకు అవసరం. దీని అర్థమేమి టంటే సర్వీసుసహకారసంఘాలుకాక రకరకాల సహకార సంస్థలుకూడా ఏర్పాటుకావాలి. ఇవి ఒక గ్రామానికి మాత్రమే సంబంధించినవై వుండనక్కరలేదు. కొన్నిగ్రామా లకు ఇవి ఉపయోగపడుతూ వుండవచ్చు. చేతిపరిశ్రమల వారికి, ఇటుక పనివారికి, తాపీపనివారికి, పశువులను పెంచు వారికి, కోళ్ళను పెంచువారికి, చేపలు పట్టువారికి, కూలీలకూ వేర్వేరు సహకారసంస్థలు వుండవచ్చు. మనం అభివృద్ధిని సాధించేకొలది ఇంకా ఒక్కొక్క రంగానికి ప్రత్యేకంగా సహకారసంఘాలను పెట్టుకోవచ్చు. ఇప్పు డీవిషయాన్ని మన లక్ష్యమైన సామ్యవాదపద్ధతి సమాజందృష్ట్యా పరిశీలిద్దాము.

సామ్యవాద మంటే . బలహీనులకు బలవంతులు సహాయం చేయడ మన్నమాట. అప్పుడు బలహీనులుకూడా బలం కలవారవుతారు. సామ్యవాద మంటే బలహీనులకూ, బలవంతులకూ సమానంగా అవకాశాలు వుండడ మన్నమాట. అంటే సంపత్తిని సంఘంలోనివారంతా అనుభవించడమన్న

మాట. ప్రైవేటురంగంవల్ల సామ్యవాదపద్ధతి యేర్పడదు. మన భారతదేశంలో నిర్వచనంరీత్యా, సాంప్రదాయంరీత్యా ప్రైవేటురంగమంటే వ్యక్తులకు లాభాలు చేకూరడమన్న మాట. ఫలిత మేమిటంటే కొందరు వ్యక్తులు బలవంతు లవుతారు. అర్థబలం కలిగివుంటారు. వ్యక్తి బాగుపడడానికి సమాజం ఉపకరిస్తుంది. ఎంతటి జీవకారుణ్యం గల. వ్యాపారి యైనా ప్రజలకు ఇహంలోకంటే పరంలో సుఖశాంతులు కలగాలని చూస్తాడు. అయితే సామ్యవాదాన్ని తేవడం కేవలం ప్రభుత్వరంగంవల్ల నేలయ్యేపనికాదు. ప్రభుత్వరంగమంటే దేశ ఆర్థికవ్యవస్థకు ప్రభుత్వమే యజమానిగా వుంటుంది. దాని నంతటినీ ప్రభుత్వమే అజమాయిషీ చేస్తూవుంటుంది. వ్యక్తులకుగాని, వర్గాలకుగాని స్వేచ్ఛాపూరితమైన అస్తిత్వంలేనట్టి ప్రభుత్వ రంగం కొద్దికాలంలోనే ఒక పెద్ద యంత్రంవలె తయారయి 'పైపటారం లోపల లొటారం'గా వుంటుంది. అసలు అందులో ప్రాణమే వుండదు. సామ్యవాదవిధానంలో వ్యక్తి, సమాజం ఒకదానికొకటి బలమిచ్చుకుంటూ, రెండూ ఒకదాని సరసన ఒకటి సఖ్యతతో వుండాలి. భారతదేశంలో మనం లక్ష్యంగా పెట్టుకున్న సామ్యవాదపద్ధతిసమాజంలో వ్యక్తివికాసానికీ, సమాజాభివృద్ధికీ అవకాశాలు వుండాలి. అలా వుండాలంటే ప్రైవేటురంగము, ప్రభుత్వ రంగము రెండూవుండాలి. అయితే రెండింటికీచుక్కెదురుకదా. ఈ రెండిటికీ యుద్ధం జరగకుండా వుండాలంటే రెండింటిమధ్య మూడవరంగంవుండాలి. అదేసహకారరంగము. యథార్థమైన సామ్యవాదం అమల్లోకి రావాలంటే సహకారరంగము అవసరం. అవసరమైనదికాబట్టి అది

సహజంగానే పెంపొందుతుంది. భారతదేశం వెనుకబడివున్న దేశం. సమాజశ్రేయస్సు నిమిత్తం మనం పునాదినుంచి నిర్మించుకుంటూ వస్తున్నాము. ఇందుచేత మనకు సహకారరంగం చాలా అవసరం. కాగా తేలినదేమిటంటే భారతదేశంలో సామ్యవాదపద్ధతిసమాజానికి ఆర్థికరీత్యా మూడు రంగములు అవసరమవుతాయి. ఒకటి ప్రైవేటురంగము; రెండవది ప్రభుత్వరంగము. ఈ రెండిటికీ మధ్య సమన్వయం కలిగించేదిగా సహకారరంగము. కనుక భారత సహకారోద్యమం కొత్త పుంతలు తొక్కవలసి వున్నది.

గ్రామాలలోఆర్థికవ్యవహారాలకు తల్లివంటి సంస్థగా సర్వీసుసహకారసంఘం పెంపొందవలెనని ఇంతకుక్రితం చెప్పివున్నాను. ప్రత్యేకసహకార సంఘాలనుగూర్చి కూడా చర్చించాను. ఇటీవలివరకూ సర్వీసుసహకారసంఘాలు చేస్తూ వచ్చిన ముఖ్యమైన పని పరపతిని లభింపజేయడమే. సహకార పరపతిని విస్తృతింపజేయడానికి ఇంకనూ బోలెడు అవకాశాలు వున్నమాట నిజమే. ప్రైవేటు వడ్డీవ్యాపారస్థులు నానాటికీ తగ్గిపోతున్నారు. కాలం గడిచేకొలది వారి సంఖ్యయింకా తగ్గుతుంది. అప్పటికీ మిగిలిన వడ్డీవ్యాపారస్థులకు ఒక వడ్డీరేటును నిర్ణయించడం అవసరమవుతుంది. ఈ విషయంలో న్యాయశాస్త్రోక్తమైన చర్యలవల్ల పెద్ద ప్రయోజనమేమీ కలుగదు. కనుక పరపతి అవసరమైనవారికి సంస్థలద్వారా దానిని లభింపజేయాలి. ఇందుకొరకై రాబోయే కొన్నేండ్ల వరకూ పరపతికార్యకలాపాలు హెచ్చుగా జరగాలి. ఇతర సహకారకార్యకలాపాలుకూడా చురుకుగా కొనసాగవలసిందే.

ఉదాహరణకు: రసాయనికఎరువులు, విత్తనాలు, పైరుల తెగుళ్ళ మందులు, ఇనుము, ఉక్కు, కిరసనాయిలు, చక్కెర, సిమెంటు, ఇంకా ధారాళంగా లభించనట్టి ఇతరవస్తువుల పంపిణీబాధ్యతను సర్వీసుసహకారసంఘాలు తీసుకోవలసిందే. ఈ సంఘాలు వ్యవసాయోత్పత్తుల విక్రయమును, వాటిని నిలువచేసే పనిని, ప్రాసెసింగ్ పనినికూడా చూడాలి. గ్రామాలకు అవసరమైన సరుకులు సరిగా లభించకపోయినట్లయితే వాటిని తెప్పించి గ్రామస్థులకు సప్లైచేయాలి. వ్యక్తులు కొనుక్కొని నిర్వహించుకోలేనట్టి ప్రత్యేకమైన వ్యవసాయపనిముట్లను, యంత్రాలను సర్వీసుసహకారసంఘం తెప్పించి రైతులకు లభింపజేయాలి. తన ఖాతాదారులకు అవసరమైన సాంకేతికసహాయం సంగతి ఆలోచించాలి. అట్టి సాంకేతిక సహాయమును ఒక్క ప్రభుత్వంమాత్రమే లభింపజేయాలనడంలో సరియైన కారణం కన్పించదు. ఇందుకు బదులుగా సహకారసంస్థలు చేసే సాంకేతికసహాయానికి ప్రభుత్వం కొంతవరకు ధనమిచ్చి తోడ్పడవచ్చు. అట్లే ప్రత్యేకమైన సహకారసంఘాలకుకూడా వాటివాటి పనుల మేరకు ఆర్థిక సహాయం చేయవచ్చు.

పంచాయతీరంగంలో దిగువసంస్థలను పైసంస్థలు పర్యవేక్షణచేసి, మార్గదర్శకత్వం వహించవలె నని మనం తలపెట్టాము. అలాగే సహకారముకుండా ప్రజాస్వామికమైన అజమాయిషీక్రింద వృద్ధిచెందాలి. అంతేగాని సహకారసంఘమని బోర్డుపెట్టి తెరవెనుక దానిని కొందరు వ్యక్తులకు ఉపయోగపడే సంస్థగా తయారుచేయకూడదు. అయితే సమా

ఖ్యలవంటి సహకారవ్యవస్థలను నెలకొల్పకుండా దీనిని మనం ఎలా సాధించగలం? ఇంతవరకూ భారతదేశంలో సహకార సంఘాలు ప్రభుత్వసహాయంవల్లనే చాలావరకు వృద్ధి చెందుతూ వచ్చాయి. కాని ప్రభుత్వసహాయం ఎక్కువయ్యే కొద్దీ సహకారోద్యమంపై ప్రభుత్వ అజమాయిషీ వుండకూడదనీ, దానికి స్వేచ్ఛ కావలెననీ కోరడం ఎక్కువ అవుతుంది. అయితే ప్రభుత్వం డబ్బు యిచ్చిన తర్వాత అజమాయిషీ చేయకుండా ఎలా వుంటుంది? ఇచ్చిన డబ్బు ఏమవుతుందో తెలుసుకోవద్దా? నమ్మి ఎంత పడితే అంత డబ్బిచ్చి వూరుకుంటే ఎలా? సహకారసంస్థల నిర్వహణలో మంత్రులకుగాని, ప్రభుత్వోద్యోగులకుకాని పదవులు వుండరాదన్న సంగతి మనం ఆమోదించినదే. అలా ఎక్కడైనా ఎవరైనా పదవిలో వుంటే వారిని తప్పించడానికి ఇటీవల పెద్ద ప్రయత్నం కూడా చేయడం జరిగింది. అయితే సంస్థాగతమైన అజమాయిషీ ఏర్పాట్లు అమల్లోకి వచ్చేటంతవరకూ, ప్రభుత్వం తన బాధ్యతను విస్మరింపజాలదు. ఇందుచేత సహకారరంగంలో 'ప్రజాస్వామిక కేంద్రీకరణ' త్వరగా జరగవలసివుంది.

కనుక సర్వీసుసహకారసంఘంపైన ప్రతిసహకార కార్యవిభాగానికి పైతంతెలు వుండవలెనని తలచబడుతున్నది. సర్వీసుసహకారసంఘాలకు మార్కెటింగు, సరుకుల నిలవ సౌకర్యాలు కలిగించడానికి మార్కెటింగ్ యూనియన్ ఒకటి వుండాలి. అలాగే ప్రాసెసింగ్ యూనియన్, ప్రాసెసింగ్ సౌకర్యాలు కల్పిస్తుంది. కేంద్రసహకారబ్యాంకు పరపతి లభింపజేస్తుంది. జిల్లాసహకారయూనియన్‌వారు సర్వీసు

సహకారసంఘాల సభ్యులకు, కార్యనిర్వాహకులకు శిక్షణ, విద్యాసౌకర్యాలు కలుగజేస్తారు. వాడకందారుల వ్యాపారం పెరిగేకొద్దీ వాడకందారుల యూనియన్లు ఏర్పడతాయి. అవి ప్రాథమిక సహకారసంఘాలకు వినిమయసౌకర్యాలను కల్పిస్తాయి. పైతంతెలకు చెందిన ఇట్టి ప్రత్యేకవ్యవస్థలకు రాష్ట్రస్థాయిపైన, మొత్తం దేశస్థాయిపైన కేంద్రవ్యవస్థలు వుండాలి. సమాఖ్యలు వుండాలి. సహకారరంగంలో ఎగువన వుండే యూనియన్లు సమాఖ్యలపద్ధతిప్రకారం వుండడం చాలా అవసరం. ప్రజాస్వామ్యపద్ధతిప్రకారం వృద్ధిచెందాలంటే జాతీయసమాఖ్యలలో రాష్ట్రవ్యవస్థలు, ఇతర దేశీయ సమాఖ్యలు మాత్రమే సభ్యులుగా వుండాలి. తక్కినవాటిని సభ్యులుగా చేర్చుకోకూడదు. అట్లే రాష్ట్రవ్యవస్థలకు జిల్లా వ్యవస్థలు సభ్యులై వుండాలి. ఈవిధంగా జాగ్రత్తపడకపోయినట్లయితే కొద్దిమంది వ్యక్తులు సహకారరంగమును వారి ముల్లెగా చేసుకునే ప్రమాదం వుంది. అటువంటి వ్యక్తులు ఇతరరంగాలలోను, విదేశాలలోను తమ జతగాళ్ళతో కలసి ప్రజానీకానికి ఎంతైనా హాని చేయవచ్చు. స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోనలెనంటే అందుకు చెల్లించవలసిన మూల్యం నిరంతరజాగరూకతయేనని పెద్దలు చెప్పుతారు. అలాగే పంచాయతీరాజ్యంలో కాని, లేదా సహకారసమాజంలో కాని ప్రజాస్వామ్యవిషయంలో మనం సదా జాగరూకులమై వుండవలసిందే.

సహకారములో ఉమ్మడిసహకారసేద్యం, సహకార పరిశ్రమలుకూడ ముఖ్యమైనవే. ఇంతకుముందే భారతదేశ

సామ్యవాదపద్ధతిసమాజానికి ప్రైవేటురంగము, ప్రభుత్వ రంగము, సహకారరంగము సమకీతిలో వుండవలెనని తేల్చుకొనివున్నాము. అలాంటి పద్ధతే వ్యవసాయరంగములోకుండా అనుసరించాలి. దీని అర్థ మేమిటంటే ప్రభుత్వరంగములో ప్రభుత్వవ్యవసాయక్షేత్రములు వుండాలి. అవి మేలైన సేద్య పద్ధతులను ప్రదర్శిస్తూ, రైతులకు శిక్షణ గరపుతూ, విత్తనాలను ఉత్పత్తిచేస్తూ, వ్యక్తులకు సాధ్యంకానట్టి పరిశోధన కార్యక్రమాలను కొనసాగిస్తూ వుండాలి. స్వంతకమతాలు గల రైతులు ఎవరికి వారు సొంతవ్యవసాయం చేసుకోవచ్చు. దీనినే ప్రైవేటువ్యవసాయమని అందాము. మన దేశ జనాభా పెరిగిపోతున్నది. ఆహారం ఆవశ్యకత నానాటికీ హెచ్చుతున్నది. సొంతసేద్యం చేసుకునే రైతులు ఒక కనీసప్రమాణానికి బద్ధులై సేద్యం చేయవలెనని ప్రభుత్వం కట్టడి విధించవచ్చు. వీరు పోగా సన్నకారురైతులు, అసలు భూములే లేని సేద్యగాండ్రు గ్రామాల్లో చాలామంది వుంటారు. వీరంతా వ్యక్తిగతంగా చేయలేనిదానిని సమిష్టిగా సాధిస్తేతప్ప, లేకపోతే వ్యవసాయప్రమాణం సరిగా వుండదు. గ్రామపరిశ్రమల కార్యక్రమం నడవదు. కనుక నేడు ఈ దళితవర్గాలవారికి వ్యవసాయపరిశ్రమల సంయుక్తకార్యక్రమం అత్యావసరం. ఇట్టి కార్యక్రమంలో సాంద్రవ్యవసాయం-అనగా ఎన్నో రెట్ల పంటలూ, కాయగూరలూ, పండ్లూ, ఫలాలూ పండించే కార్యకలాపాలు, ప్రాసెసింగ్, గ్రామపరిశ్రమలు, కోళ్ళ పెంపకం, పాడిపరిశ్రమ మొదలైనవన్నీ చేరివుండాలి. ఉన్నడి సహకారసేద్యానికి త్రిముఖమైన అనుబంధం వుండాలి.

పరపతి, సప్లైలు, సర్వీసులకొరకై దానికి గ్రామసర్వీసు సహకారసంఘంతో అనుబంధం వుండాలి. పనుల విషయాలలో దానికి ఆయాపనులకు సంబంధించిన సహకారసంస్థలతో సంబంధం వుండాలి. ఉన్నతపరిపాలనావిషయాలకు మార్గదర్శకత్వానికిగాను దానికి సైతం తెన్గా వుండే ఉమ్మడిసహకార సేద్యవ్యవస్థలతో అనుబంధం వుండాలి.

ఇక పారిశ్రామికసహకారరంగంసంగతి ఆలోచిద్దాము. భారతదేశంలో మనం పెట్టుకున్న లక్ష్యంమేరకు వ్యాపారపు పెట్టుబడి లభించ దన్న విషయం మనకు తెలిసినదే. కనుక ప్రభుత్వం ప్రాథమికపరిశ్రమలలో భారీపెట్టుబళ్ళలో వుండే లాభనష్టాలకు సిద్ధపడి, అట్టి పెట్టుబడిని పెట్టేందుకు ప్రయత్నించాలి. భారతప్రభుత్వం దేశపరిశ్రమల విధానం విషయమై చేసిన నిర్ణయంలో ఈ అంశము వుంది. కాని ప్రభుత్వరంగాన్ని వదిలిపెట్టినతరువాతకూడా సహకారం అత్యావసరంగా వృద్ధిజెందవలసినట్టి వినిమయదారుల రంగము, తదితర రంగాలు వున్నవి. ఆ విధంగా సహకారరంగం వృద్ధిజెందితేనే పైవేటురంగం సద్వర్తనముతో మెలగి ప్రజాస్వామ్యం ఎట్టి కల్మషంలేక ఆరోగ్యంగా ప్రవర్ధమానం కాగలుగుతుంది. అట్టి పరిశ్రమలలో గృహవసతి, రవాణా, అచ్చుయంత్రములు మొదలగునవేగాక వినిమయదారుల ఆవసరాలన్నిటినీ చేర్చుకోవాలి. భారతదేశంలో సహకారసమాజ మనే విధానాన్ని ఈ దేశంలో సామ్యవాద, ప్రజాస్వామ్యముల ప్రవర్ధనమును దృష్టిలో పెట్టుకొని విశాలదృష్టితో ఆలోచించాలి. పంచాయతీరాజ్యానికి తోడ్తోడుగా సహకారసమాజంకూడా దిగువన

గ్రామంనుంచి పైకి పెరుగుతుంటూ పోవాలి. అప్పుడు ప్రజా స్వామ్య మనే బండికి పంచాయతీరాజ్యము, సహకారసమాజను రెండు చక్రాలుగా వుంటాయి.

విద్య చాలా ముఖ్యం

"గ్రామానికి ఒక మంచి పంచాయతీ, ఒక మంచి సహకార సంఘం, ఒక మంచి గ్రామపాఠశాల ఏర్పాటుచేసుకుంటే దేశంలో ప్రజాస్వామ్యం, సోషలిజం గ్యారంటీగా ఏర్పడిపోతాయి," అని మనప్రధానమంత్రి ఎన్నోమార్లు చెప్పి వున్నారు. ఆయన అన్న మాటలకు అర్థమేమిటి? మన గ్రామ పంచాయతీలు, గ్రామసహకారసంఘాలు ప్రస్తుతం యేస్థితిలో వున్నాయో, వాటికి పట్టుకున్న జబ్బు లేమిటో వెనుకటి అధ్యాయాలలో విశదీకరించివున్నాను. గ్రామానికి పంచాయతీ, సహకారసంఘం చాలా ముఖ్యమైన సంస్థలు. అవి ఎట్లా వుండాలి, ఏవిధంగా అలా వుంటాయి, వాటిలో అట్టి మార్పును తేవడానికి ప్రభుత్వం ఏమి చేస్తూ వుంది, మున్నగు అంశాలను కూడా చర్చించి వున్నాను. ముక్కాలిపీట రెండుకాళ్ళమీద నిలబడలేదు. మూడవ కాలు వుండవలసిందే. అలాగే గ్రామానికి మూడవ సంస్థ గ్రామపాఠశాల.

పూర్వం మన దేశంలో గ్రామ పాఠశాలను ఒక చెట్టు క్రింద పెట్టి పాఠాలు చెప్పేవారు. దానికి ఉపాధ్యాయుడిని బహు జాగ్రత్తగా ఎంపిక చేసేవారు. అతడు పండితుడై వుండాలి. అతనికి విజ్ఞానం వుండాలి. అతడు వివేకము కల

వాడు కావాలి. కోపము, చిరాకు లేకుండా సౌమ్యుడై వుండాలి. ఈ గుణాలన్నీ వున్నవారినే ఉపాధ్యాయుడినిగా నియమించేవారు. ఆయన గ్రామంలోని పిల్లలకు మాత్రమే కాక గ్రామంవారందరికీ పంతులుగారు. వారికి ఆయన మిత్రుడు. సంగతి సందర్భాలు తెలియజెప్పేవాడు కూడా ఆయనే. గ్రామస్థులు ఆయన కుటుంబ అవసరాలను తీర్చే వారు. ఆయనకు ఏదో ఒక కానుక ఇవ్వకుండా ఎవరూ తమ పిల్లవాడిని ఆయన వద్దకు చదువుకోసం పంపేవారు కారు. ఎవరింట్లో యే శుభకార్యం జరిగినా గురువుగారికి దక్షిణలు ముట్టకుండా వుండవు. అలాగే పంతులుగారింట్లో ఏ సందర్భం వచ్చినా గ్రామస్థులు సహాయపడేవాళ్ళు. మేమంటే మేమని ముందుకు వచ్చే వాళ్ళు. కాని భారతదేశంలో వలసపాలకుల విద్యావిధానము అమలులోకి రావడంతో దేశీయమైన విద్యా పద్ధతి క్షీణించింది. పూర్వం విజ్ఞానాన్ని సంపాదించడమే విద్యకు పరమావధిగా వుండేది. కాని ఆ తర్వాత డబ్బుకోసం విద్య నేర్చుకోవడం ఆరంభించారు. విద్యాబోధన ఒకప్పుడు పవిత్ర కర్తవ్యంగా యెంచబడేది. ఇప్పుడిది వ్యాపారవృత్తిగా మారింది. గురువు పదవి పోయింది. డబ్బిచ్చి పెట్టిన ఉద్యోగులు చదువుచెప్పేవా రయ్యారు. గ్రామంలోని ఇతర ఉద్యోగులవలెనే ఉపాధ్యాయునికి కూడా తక్కువ జీతం ఇచ్చేసరికి ఆయన ఆ జీతానికి తగ్గట్టుగానే చదువు చెప్పడం అలవాటు చేసుకున్నాడు. ఈ విధంగా క్రింద వేళ్ళతో ఆరంభమైన ఈ తెగులు చెట్టుకు కూడా వ్యాపిస్తూ వుంది. కనుకనే నేడు

మన కాలేజీలలో, విశ్వవిద్యాలయాలలో చదువుకొని వచ్చిన యువకులలో ఎన్నో లోటుపాట్లు కనిపిస్తున్నాయి.

వివిధ సంస్థల ఆధ్వర్యాన యువజన కార్యక్రమాలను గూర్చి మనం తరచు ప్రస్తావిస్తూవుంటాము. వారి విరామ కాలములో ప్రభుత్వ ఖర్చుతో వారి కాలక్షేపానికి యేదో ఒకటి ఏర్పాటుచేసి తద్వారా వారిని పోగుడుతూవుంటాము. ఎప్పుడూ ఒకేరకం పని కాకుండా కొంత మార్పు వుండడం మంచిదే. కాని మనం ప్రవేశపెట్టే మార్పులు కేవలం పై పూతలవంటివి. ఈ నాడు పిల్లలుగా వున్నవారే రేపు తల్లి దండ్రు లవుతారు. యువకులు యోగ్యత కలవారు కావా లంటే వారిని బాల్యంనుంచే చక్కగా పెంచుకుంటూ, విద్యా బుద్ధులు గరపుతూ రావాలి. ఎనిమిదేండ్లు దాటిన తరువాత పిల్లవాడి జీవితమును క్రొత్త తీరుగా మలచడం సాధ్యం కాదని మానసిక శాస్త్రజ్ఞులు కూడా అంగీకరించివున్నారు. పిల్లలను పెంచి పెద్దవారిని చేయడంలో ఇద్దరే ముఖ్యపాత్ర వహిస్తారు. ఒకరు తల్లి, రెండవవారు ఉపాధ్యాయుడు. కనుక స్త్రీలకు ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహిస్తే తల్లులకూ వారి బాధ్యత తెలిసి వస్తుంది. పిల్లలకు ప్రతిరోజు విజ్ఞానవినోదములు కల్పించ డానికై బాలలకేంద్రాలను ఏర్పాటు చేయాలి. ఈ విధంగా పిల్లల బాధ్యతను తల్లులకు కొంత తగ్గించితే తల్లులకు వారి వారి చిత్తవృత్తులకు అనుగుణంగా చేతి పరిశ్రమలు, కళలు నేర్పడానికి వీలవుతుంది. పిల్లలను ఆరోగ్యవంతంగా పోషించే విధానమును గూర్చి తల్లులకు బాలలకేంద్రంలో తర్ఫీదు ఇవ్వాలి. ఇలా చేస్తే మహిళలు తమ పిల్లల విషయంలోగాక

మొత్తం గ్రామం బాలబాలికల విషయమై శ్రద్ధాసక్తులు గలవారవుతారు. వారి దృష్టి విశాలమవుతుంది. ఈ రీతిగా విద్యా కార్యక్రమంలో ఒక భాగంగా గ్రామ స్త్రీజనాభ్యుదయ కార్యక్రమం విశాలపరిధిలో వ్యాప్తమవుతుంది.

కేవలం పుస్తకాలలోని పాఠాలు చెప్పే వ్యక్తి గురువు కానేరడు. శతాబ్దాలుగా ఎన్నో విపర్యయాలు సంభవించి నప్పటికి భారత సంస్కృతి చెక్కు-చెదరకుండా నిలిచివున్నది. జీవితానికి సంబంధించిన గుణపాఠాలపైననే భారతీయ సంస్కృతి ఆధారపడివుంది. ఆ పాఠాలలోని కథలు, గాథలు, నీతులు మనకు జీవితతత్వాన్ని బోధించాయి. కనుకనే మన మహా కావ్యాలలో మన ధర్మమూ, తత్వమూ ఇమిడి వున్నాయి. గ్రామఉపాధ్యాయుడు ప్రయోజకుడు కావలెనంటే అతడు చెప్పే పాఠాలు జీవితానికి సంబంధించినవై వుండాలి. జీవితం అవిభాజ్యమైనది. అది పిల్లలకు ఒక తీరుగా, పెద్దలకు ఒక తీరుగా వుండదు. గ్రామ ఉపాధ్యాయుడు జీవిత విద్య నేర్పేవాడై వుండాలి. ఇందుకు వీలుగా గ్రామసమాజం తన్ను తాను తెలిసికొని అందుకు సిద్ధపడాలి. ఉపాధ్యాయునిగా ఎవరిని వేశారు, అతని కెంత జీతమిస్తారు అన్న విషయాలు కూడా ముఖ్యమైనవే అయినప్పటికీ ఈ సమస్య కేవలం వాటికి సంబంధించినదే కాదు. పూర్వం గ్రామోపాధ్యాయు నికి ఎట్టి గౌరవము, ఘనత వుండేవో అవి ఆయనకు నేడు తిరిగీ సంక్రమించాలి. అతడు తిరిగి అతని పూర్వాన్నత్యానికి చేరుకోవాలి. కనుక ఈ సమస్యను దేశంలోని విద్యావేత్తలు, ప్రభుత్వం, ప్రజలు పునరాలోచించాలి. పంచాయతీ రాజ్యం,

సహకారసమాజం నెలకొల్పడానికై తీవ్రంగా ప్రయత్నాలు జరుగుతున్న ఈ నాడు ఈ సమస్య మనకు మరింత ప్రధానమైనది.

ఈ సందర్భంలో 19 వ శతాబ్దిలో వివేకానందుడు వెలిబుచ్చిన అభిప్రాయాలను నే నిచ్చట ఉదాహరిస్తున్నాను:

"విద్యకూ, శిక్షణకూ ముఖ్యాదర్శం మానవుని తీర్చిదిద్దడమే. విద్య అంటే అమాంబాపతుసంగతులు తెలుసుకొని వాటిని బుర్రలో పెట్టుకొని సరిగా జీర్ణంచేసుకోకుండా, తోచినట్లు మాట్లాడటం కాదు. జీవితాన్ని నిర్మించుకోవాలి. మానవుని తీర్చిదిద్దాలి. శీలనిర్మాణం జరగాలి. వివిధ భావాలను, అభిప్రాయాలను స్వీకరించి వాటిని సరిగా జీర్ణంచేసుకోవాలి. మచ్చుకు అయిదుభావాలను జీర్ణంచేసుకొని వాటిని జీవితాదర్శాలుగా, శీలలక్షణాలుగా స్వీకరించితే ఒకగ్రంథాలయము నంతటినీ కంఠస్థం చేసిన వ్యక్తికంటె మీరు ఎక్కువ విద్యావంతులని నే నంటాను. విద్య, భోగట్టా సేకరణ రెండూ ఒకటేనని అనుకుంటే ప్రపంచంలోని గ్రంథాలయాలే మహర్షులనీ, వాటిలో వున్న విజ్ఞానసర్వస్వములే ఋషులనీ అనవ లసి వస్తుంది. మాట."

ఈవిధంగా మనం పునాదినుంచే గ్రామపాఠశాలను గూర్చిఆలోచించినట్లైతే సామాజిక కేంద్రము,ఆరోగ్యవిస్తరణ, పారిశుధ్యం, ఇతరజీవితపద్ధతులవిషయమై మన దృక్పథం ఒక క్రొత్తరీతిలో వుండగలదు. అప్పుడు మనం దేనికిదానిని విడదీసి చూడము. మధ్యయుగపు ఆలోచనావిధానాలతో నిర్ణయాలు చేయము. నేల విడిచి సాముచేసినట్లుగా పునాది లేని సంస్థలను నిర్మించము. అప్పుడు మనం గ్రామగ్రంథాలయమును, గ్రామపాఠశాలలో ఆటలకూ, పాటలకూ వినోద కేంద్రమును, మ్యూజియమును నెలకొల్పుతాము. మొదట

గ్రామపాఠశాలలో త్రాగే నీటి సౌకర్యము కొత్తరకపు మరుగుదొడ్లు, మూత్రశాలలు ఏర్పాటుచేస్తాము. తరువాత క్రమేణా కుటుంబాలకుకూడ అట్టిసౌకర్యాలు కల్పిస్తాము. గ్రామపాఠశాలలో అందరికీ ఆదర్శప్రాయంగావుండే కోళ్ళ పెంపకశాలను, పండ్ల తోటను, కాయగూరల మళ్ళను ఏర్పాటుచేస్తాము. అలాంటివే పోనుపోను కుటుంబాలకుకూడా ఏర్పాటుఅవుతాయి. పాఠశాలకు నమూనాపంచాయతీ, నమూనాసహకారసంఘముకూడా ఏర్పడుతాయి. గ్రామ పాఠశాలలో గ్రామీణకుటీరపరిశ్రమల కేంద్రంగూడా ఏర్పడిందంటే పిల్లలు వారివారి అభిరుచులకు సరిపడే వృత్తులు నేర్చుకోగలుగుతారు. కొన్నింటిలో ప్రావీణ్యంకూడా పొంద గలుగుతారు.

అయితే గ్రామపాఠశాల దానినరకు అది స్వయం సమృద్ధమై వున్నంతమాత్రాన సరిపోదు. మన ప్రజాస్వామ్యా నికీ, మన సామ్యవాద సమాజానికీ గ్రామపాఠశాల మూడవ స్తంభంగా వుండాలి. ప్రజాస్వామ్యానికి . పంచాయతీ, సహకారసంఘం ప్రాతిపదికసంస్థలు. వాటిని దేశమంతటా విస్తరింపజేయడం మన లక్ష్యం. అలాగే దేశమంతటా పైన చెప్పిన గ్రామపాఠశాలలు కూడా యేర్పడాలి. గ్రామపాఠ శాలపైన మాధ్యమికపాఠశాల, బ్లాకుఉన్నతపాఠశాల వుంటాయి. ఇవిగాక స్వల్పకాలికశిక్షణనిచ్చే శిబిరాలు, ప్రత్యేక కోర్సులు బోధించే సంస్థలు వుంటాయి. బ్లాకుమొకటి మాధ్య మికపాఠశాలలు, ఉన్నతపాఠశాలలపైన జిల్లాకళాశాల వుంటుంది. ఇంకా ఉన్నతశిక్షణకై, విషయపరిశీలనకై ప్రత్యేక

కోర్సులు వుంటాయి. రాష్ట్రరాజధానిలోను, ప్రాంతీయస్థాయిలోను వుండే విశ్వవిద్యాలయాలు ప్రత్యేకప్రయోజనాల నిమిత్తమై పట్టభద్రానంతరవిద్యలను బోధించగలవు. ఉన్నతమైన నయోజనసాంఘికవిద్యా కార్యకలాపాలకు విశ్వవిద్యాలయం వివిధసంస్థల కోర్సులతో అనుబంధం కలిగివుంటుంది. ఈవిధంగా పరస్పరసంబంధంగల విద్యావిధానము అనులులోకి వస్తుంది. విశ్వవిద్యాలయాలలోని సిద్ధాంతాలకు కార్యక్షేత్రాలలో ఆచరణ వుంటుంది. దేశంలో జరుగుతున్న పనులకూ, ఆచరణకూ విశ్వవిద్యాలయాల ప్రశాంతవాతావరణములో సూపాందేభావాల ప్రాపు వుంటుంది. ఆచరణ లేని సిద్ధాంతం గాలిపటంవంటిది. సిద్ధాంతాలు లేని ఆచరణ అర్థరహితమైనది. దానికి ఎదుగూ బొదుగూ వుండవు. సిద్ధాంతము, ఆచరణ రెండూ మన జీవయాత్రలో ఒకదానినొకటి అనుసరించివుంటాయి. కనుక మన విద్యావిధానంలో గ్రామపాఠశాల మొదలుకొని విశ్వవిద్యాలయంవరకూ వివిధప్రయోజనముల సమన్వయం జరగాలి.

ఇట్టి విద్యావిధానంలో వృత్తినిబట్టి విద్వాంసులను నియమించినందువల్ల ప్రయోజనం లేదు. విద్వాంసులను వారి మానానికి వారిని వదలిపెడితే వారు ఒంటిస్తంభంమేడల్లో నివసిస్తూ ప్రపంచంసంగతి విస్మరిస్తారు. కనుక విద్వాంసులు, పరిపాలకులు చేతులు కలపాలి. శాసనసభ్యుల సేవలు, పార్లమెంటుసభ్యుల సేవలు, సహసంస్థల సహాయము మనకు కావాలి. యం. యల్. ఏ. లు, యం. పి.లు, జాతీయ కేంద్ర

సంస్థల ప్రతినిధులూ, రాష్ట్రసంస్థల ప్రతినిధులూ కలిసి విద్య, శిక్షణ కార్యక్రమాన్ని అమలుపరచాలి. వీరంతా విశ్వవిద్యాలయాల కార్యక్రమాలను కూడ శ్రద్ధగా గమనించాలి. ఈ విధంగా గ్రామపాఠశాలస్థాయి వరకూ ఈ పద్ధతిని అనుసరించవచ్చు. విద్యా సమస్యలు గ్రామపాఠశాల మొదలుకొని పైన విశ్వవిద్యాలయాలవరకూ, జాతీయస్థాయి వరకూ పోవచ్చు. ఆ సమస్యల పరిష్కారాలుకూడ పైనుంచి దిగువ వరకూ రావచ్చు. ప్రతిదశలో మన ఆలోచనలపైన, మనం చేసే పనులపైన ప్రాతినిధ్య సంస్థల, సహాసంస్థల, విద్యా కేంద్రాల, ప్రజాసంస్థల ప్రభావం వుంటుంది.

మన ఆర్థికసాధన సంపత్తు లన్నింటిని కూడగట్టుకొని కృషిచేసినట్లయితే దారిద్ర్యమును, పేదరికమును నిర్మూలింపవచ్చునని మనం గ్రహించాము. అట్లే మన విద్యావసతులను వినియోగానికి తెచ్చుకుంటే అజ్ఞానమును రూపుమాపవచ్చు. విద్య గల మానవుడు తన పిల్లలను అజ్ఞానములో వుండనివ్వడు. వారికి చదువు సంధ్యలు నేర్పుతాడు. సాధ్యమైనంత త్వరలో మనం మన దేశములో అందరికీ చదువను, వ్రాయను రావలెనని అభిలషిస్తున్నాము. విద్య అంటే విద్వత్తు, పాండిత్య ప్రకర్ష కావు. పూర్వం మన భారతదేశంలో చక్కని విద్యా విధానము వ్యాపించివుండేది. ప్రజలలో అధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులైనప్పటికీ కథలు, గాథలు, పాటలు, భజనలు, కీర్తనలు, నాటకాలు, కవిసమ్మేళనములు, ఇతర ప్రజావినోద పద్ధతుల ద్వారా వారికి విద్య బోధింపబడేది. చదవడం రాకపోయినా ప్రజలకు ఎన్నో విషయాలు తెలిసివుండేవి. మన

జీవిత విధానంలో విద్య ఒక భాగమైపోయింది. దీనిని ఇంకా వ్యాప్తం చేయడానికి విజ్ఞానశాస్త్రం మన కీనాడు ఎన్నో పరికరాలను, సాధనాలను ఇచ్చింది. రేడియో, టెలివిజన్ వంటి సాధనాలు మనకు అందుబాటులోకి వచ్చాయి. వీటిని వివేకంతో ఉపయోగించుకోవాలి. ప్రచారం, సిద్ధాంతబోధకు బదులు పిసనైన విద్యకు రాచబాట యేర్పడాలి. మన తరం లోనే మనం అవిద్యను, అజ్ఞానమును నిర్మూలించగలం. ఇది అసాధ్యమైన పని కాదు. అప్పుడు యుద్ధాన్ని, యుద్ధసన్నాహాలను, యుద్ధనాయకులను శాశ్వతంగా అజ్ఞాతవాసానికి పంపగలము.

భారతదేశంలో సామాజికాభివృద్ధి కార్యక్రమం, గడచిన తొమ్మిదేండ్లకాలములోపల స్థావరంగా వుండేవీ, వస్తూ పోతూ వుండేవీ అనేక కేంద్రాలను నెలకొల్పగలిగింది. ఇవి కార్యక్రమోద్యోగుల విద్యకూ, శిక్షణకూ ఉపయోగ పడేడివి. దిగువనుండి కేంద్రమునరకూ వుండే ఎన్నికైన ప్రజా ప్రతినిధులకూ, గ్రామసేవకుడు మొదలుకొని ఉన్నతాధికారివరకూ, మధ్యన వుండే సాంకేతిక ఉద్యోగులకూ ఇవి ఉద్దేశింపబడినవి. సహకార సంస్థల సభ్యులకు, సహా సంస్థల సభ్యులకు, ప్రజలకూ పెద్ద పెట్టున సంగతిసందర్భాలు తెలియజెప్పేటందుకై దినదినము ప్రవర్ధమానమవుతూ వున్న కార్యక్రమ మొకటి వుంది. మూడవ పంచవర్ష ప్రణాళికలో శిక్షణకార్యక్రమం అత్యధికంగా విస్తృతి జెందగలదు. ఇప్పుడిప్పుడే గ్రామపాఠశాలలు వెలుగులోకి వస్తూ వున్నవి. విజ్ఞానశాస్త్రము, సాహిత్యము, సంస్కృతి మున్నగు వాటికి

సంబంధించిన శాస్త్రము బోధించే ఉన్నత విద్యాసంస్థలను, విశ్వవిద్యాలయాలను కార్యక్రమానికి సన్నిహితం చేసే ప్రయత్నం జరుగుతూ వుంది. అవి క్రమేణా ఈ కార్య క్రమంతో సంపర్కము పెట్టుకో గలుగుతున్నాయి. అయితే ఇంకా కొంత అల్లికపని జరగవలసివుంది. ఈ సిద్ధాంతమునే మనం ఆమోదించవలసివున్నది. మన నిర్వాసులకు ఆవాసము కల్పించే పనిలో నిమగ్నులమైవుండడంవల్లను, వ్యవసాయం, కుటీర పరిశ్రమలు, భారీపరిశ్రమలు మున్నగువాటిని త్వరగా వృద్ధి చేసుకోవలసిన ఆగత్యం కలుగుటచేతను మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి జాతీయరంగంలో అన్నిటి కన్న విద్యపట్ల మనం ఎక్కువగా అలక్ష్యం చూపాము. అంటే అసలు పునాదినే అసలు అలక్ష్యం చేశామన్న సంగతి మనకు ఆలస్యంగా, ఇటీవలనే తెలియవస్తూ వుంది. కనుక రాశిలోనే గాక గుణం రీత్యా కూడా ముఖ్యమైనటువంటి విద్యారంగ మును అభివృద్ధి పరచడానికై ఇప్పుడు తీవ్రంగా ప్రయత్నిస్తూ వున్నాము. ఈ విధంగా నేటి బాలుడు పెరిగి రేపటి యువకుడై, ఆ తరువాత వయోజన పౌరుడవుతాడు. ఇందువల్ల ఒకవంక పంచాయతీరాజ్యం, మరొకవంక సహకార సమాజం అనే సౌధాలు నిలిచేటందుకు గట్టి పునాది యేర్పడగలదు.

———

# 8. విశాలదృశ్యం

పనులు ప్రాతిపదికగా రూపొందే ప్రజాస్వామ్యం

గత అధ్యాయంలో మనం గ్రామానికి వుండవలసిన మూడు ప్రాథమికసంస్థలనుగూర్చి—అనగా పంచాయతీ, సహకార సంఘం, గ్రామపాఠశాలనుగూర్చి చర్చించివున్నాము. మన సంస్కృతి, మన ప్రజాస్వామ్యం ఈ మూడుసంస్థలమీదనే ఆధారపడివుండాలి. మన జాతికి గమ్యమైన సామ్యవాద సమాజసాధనకు ఈ మూడుసంస్థలు వేరువేరుగా, ఉమ్మడిగా పనిచేయవలసివున్నది. ఇక మనం భారతదేశంలో ప్రజాస్వామ్యం యేపద్ధతిన రూపొందవలసివున్నదో పరిశీలించాలి. ఈ సమన్వయం యే దిశన జరుగవలసివున్నదో దానినికూడా అవలోకించవలసివున్నది.

పార్లమెంటులోను, రాష్ట్రశాసనసభలలోను, వివిధ పార్టీల తరఫున ఎన్నికైన ప్రతినిధులు వుంటారు. ఏ పార్టీకీ చెందని స్వతంత్రులు చాలా తక్కువమంది వుంటారు.

ఈనాడు మన దేశంలో కులాలవారీగా, మతాలవారీగా పనిచేసే పార్టీలు మొదలు అంతర్జాతీయంగా ఒకానొక పార్టీతో సంబంధంకలిగివున్న పార్టీలవరకూ రకరకాల పార్టీలు వున్నవి. వీటి రాజకీయ, ఆర్థికసిద్ధాంతాలు విభిన్నంగా వున్నవి. నేడు ప్రపంచం కుంచించుకుపోయివున్నది. అంటే విజ్ఞానశాస్త్రాభి వృద్ధివల్ల దేశాలు ఒకదాని కొకటి దగ్గరగా వచ్చినవి. ఇట్టి ప్రపంచంలో అంతర్జాతీయమైన భక్తిభావం, జాతీయమైన భక్తిభావం వేర్వేరనిపించవు. రెండూ దాదాపు ఒకటే అనిపిస్తాయి. విద్యావ్యాప్తివల్ల సృజనాత్మకమైన వ్యక్తీకర ణకు అవకాశాలు లభించడంవల్ల, ప్రయోజనాత్మకమైన పనిపాటలు దొరకడంవల్ల కుల, మత, ప్రాంతీయాభిమానాలు అంతరించాలి. రేపు మనం దేనికోసమై వెదకుతామో దానిని ఇవాళే సాధించడం వలనుపడదు. రేపు జరగవలసింది ఇవ్వాళే జరిగితే రేపు అనేదానికి అర్థం, విలువ వుండవు. కనుక వివేక వంతులైన ప్రజలు గత మనే పునాది ఆధారంగా ఒక విధా నాన్ని నిర్మించుకోవాలి. అది మనలను భవిష్యత్తువైపుకు నడిపించుకుపోయేదిగా వుండాలి. సరియైన పెంపు, శ్రద్ధ వున్న ట్లైతే ఏ మొక్క అయినా రెమ్మలు, కొమ్మలు పెట్టి పుష్పించి ఫలిస్తుంది. మరి మన మిశ్రమ ప్రజాస్వామ్య స్వరూపం యేవిధంగా వుండాలి?

ప్రజాస్వామ్యమంటే "ప్రజలుచేసే పరిపాలన, ప్రజల కోసం జరిగే పరిపాలన, ప్రజలయొక్క పరిపాలన" అని మనం అంగీకరించివున్నాము. అట్టి పరిపాలనలో ప్రజలనందరినీ సమానులుగా పరిగణించాలి. అనగా సంఖ్యాబలమే పరిగణనకు

రావాలి. "ప్రతిజీవి దివ్యమైనదే" అన్న వాదమును మనం అంగీకరించాలి. దీని అర్థమేమిటంటే—జగత్తులో దైవబల మును ఆమోదించడమన్నమాట. ప్రతిమానవునిలో దైవాంశ వుంది. దివ్యత్వానికి అత డొక రేణువు. ఈ సిద్ధాంతమును మనం ఆమోదించినప్పుడు నియంతృత్వవాదానికి మొదటికే మోసం వస్తుంది. నియంతృత్వవిధానంలో పదిమందికంటె, లేదా నూరుగురికంటె ఒక్కమనిషి తెలివికలవాడనే విశ్వాసం కలుగజేస్తారు. ఆ విశ్వాసమునే ఒక సిద్ధాంతముగా ప్రతిపాది స్తారు. కనుక ప్రజాస్వామ్యయాత్ర అనేది దివ్యత్వానికి చేరే యాత్రవంటిది. మానవుని మేధ క్రిందపడితే పగిలే పాత్ర వంటిది. దీన్ని మనం ఇత్తడిపాత్ర అనుకుందాము. ఇత్తడి పాత్రను తరచు తోమి మెరుగుపెట్టకపోయినట్లైతే అది కళా కాంతీ లేకుండా వుంటుంది. ఇత్తడిపాత్ర అసలు రంగును చూడవలెననుకుంటే దానిని ఎల్లప్పుడూ తోముతూ వుండాలి. అట్లే మానవుని మేధ దివ్యత్వంలోని ఒక అంశ, లేదా ఒక రవ్వ అన్న విషయం గుర్తెరిగి వుండాలంటే మేధకూ ఆ దివ్యత్వా నికీ తరచు సంయోగము వుండాలి. ఇది జరగవలెనంటే మానవుడు వృక్షజాలము మధ్య, జంతుజాలము మధ్య, అనగా ప్రకృతి మధ్య జీవించాలి. ఈ రహస్యమును తెలుసుకున్న వారు కాబట్టే భారతదేశ మహర్షులు, ప్రపంచయోగులు కొండలలో, అడవులలో తపోవనము లేర్పాటుచేసుకొని అచ్చట నివసించేవారు. ఆ విధంగా స్వచ్ఛనిసర్గప్రకృతిమధ్య కాలంపుచ్చువారు ఉన్నతాదర్శాలను సాధించగల్గుతారు.

కనుక దీనివల్ల తెలిసిన దేమిటంటే దివ్యత్వంపై విశ్వాసం లేకపోతే ప్రజాస్వామ్యాన్ని నిర్మించడం సాధ్య పడదు. అలాంటి విశ్వాసం కలకాలం వుండవలెనంటే ప్రకృతి మధ్య జీవితం గడపాలి. యథార్థమైన ప్రజాస్వామ్యం సిద్ధించ వలెనంటే గ్రామసంస్కృతికి ప్రాబల్యం కలగాలి. మన ఉనికికి గ్రామీణసంస్కృతి ముఖ్యమైనది. దానికి భంగం కలుగనీయ రాదు. అందుచేత ఎంతసేపూ పట్టణాల ప్రసక్తే గాని, పల్లెల ప్రసక్తి లేనటువంటి నేటి మన ధోరణిని అరికట్టాలి. దానిని మార్చివేసి మన పాతపద్ధతివేపు దృష్టిని సారించాలి. ఒక వ్యక్తి వ్యాపారం నిమిత్తమో, లేదా వృత్తి నిమిత్తమో పట్ట ణానికి వలసపోయాడు. పట్టణంలో ఒక బస ఏర్పాటుచేసు కున్నాడు. దానిని బస అంటాడే గాని ఇల్లు అని అనడు. వారం వారం గ్రామంలో తాను పుట్టిన ఇంటికి వెళ్ళి ఒకరోజు వుండి తిరిగి వస్తూవుండేవాడు.

జాతీయప్రజాస్వామ్యమనేది కుటుంబస్థాయిపై, ముఖ్యంగా గ్రామస్థాయిపై ప్రజాస్వామ్యసమన్వయమై వుండ వలెనని ఇంతకుముందు ఒకచోట చర్చించివున్నాము. కనుక గ్రామసమాజస్వరూపం భవిష్యత్తులో యేవిధంగా వుండవలె నన్న విషయంలో మనకు సమన్వయంతో కూడిన దృక్పథం వుండడం అవసరం. గ్రామఆర్థికవ్యవస్థను స్వయంసమృద్ధ ప్రాతిపదికపై నిర్మించడం ఇక వీలుపడదని మనం తెలుసుకొని వున్నాము. స్వయంసమృద్ధమైన గ్రామమంటే జీవనాధారానికి ఇంకా దిగువస్థాయిలోనే వున్న గ్రామమని అర్థం. ఇలాంటి గ్రామాలు కొండజాతులవారు నివసించే ప్రదేశంలో

వుంటాయి. మన వ్యవస్థలు నేటికన్నను అభ్యుదయరీతిలో వుండవలెననీ, నేడు మన గ్రామాలలో కన్పిస్తున్నదానికంటె నూరింత అధికంగా ఆలోచనలయందేమి, ఆచరణయందేమి సమన్వయం సాధించాలనీ ఆధునికవిజ్ఞానశాస్త్రం నొక్కి చెబుతున్నది. మన కిష్టమైనా, కాకపోయినా రేపటి విశాల ప్రపంచంలో దారిద్ర్యం, అవిద్య, అజ్ఞానం, రోగాలు వుండటానికి వీలులేదు. ప్రపంచంలో ప్రతిపౌరునికీ శారీరకావసరాలు పూర్తిగా తీరునంతవరకు జీవనభౌతికప్రమాణం క్రమేణా ఉన్నతస్థాయికి హెచ్చవలసివున్నది. అంటే ఆర్థిక, సాంఘిక వ్యవస్థకు పరస్పరసంబంధం వుండేటటువంటి విధానం అమలులోకి రావాలి. సాధ్యమైనచోట్ల గ్రామ ప్రాథమికావసరాల విషయంలో స్వయంసమృద్ధతను సాధిస్తూనే అవసరమైనచోట్ల పరస్పరం ఆధారపడివుండటానికి ప్రయత్నించాలి.

ఉన్నతజీవనప్రమాణమంటే గ్రామంలో ప్రత్యేకతలు విశాలమవడమన్నమాట. ఇందుకు వివిధవృత్తులకు, పనులకు తత్సంబంధమైన వ్యవస్థలు అవసరం. వీటిని పెద్దకుటుంబ స్థాయిపై—అనగా గ్రామస్థాయిపై ఏర్పాటుచేయాలి. ఈ సమన్వయం పంచాయతీస్థాయిపైననే జరగాలి. పంచాయతీలు తమతమ ఆధ్వర్యాననే గ్రామకార్యకలాపాలనన్నిటినీ జరుపుకుంటే అందువల్ల అనేక ప్రమాదాలున్నాయి. అటువంటి సమగ్రమైన పనులకు ప్రజాస్వామ్యంలో యే వ్యవస్థకూడా సరిపోదు. పైగా ఒక వ్యక్తిగాని, లేక కొందరు కలసి జట్టుగా గాని నిర్వహించగలిగిన బాధ్యతలను ఏదేని సంస్థగాని, లేక వ్యవస్థగాని తనపై వేసుకోవడమంటే ఇతరుల ఉత్సాహాన్ని.

చొరవను భంగపుచ్చడమేనన్నమాట. ప్రజాస్వామ్యమంటే పదిమంది చొరవ తీసుకొని పనులుచేయడమన్నమాట. అంతే గాని ఒక్కడికి మాత్రమే చొరవను వదిలి తక్కినవారు మెదల కుండా ఉండడం కాదు. వ్యక్తులకూ, వర్గాలకూ క్రమేపీ పనుల వికేంద్రీకరణ జరగడమే ప్రజాస్వామ్యం ఆశయం.

భారతదేశంలో మనం ఆశిస్తున్న పరిపాలనావ్యవస్థలో పంచాయతీ చిట్టచివరి కొక్కేము. ప్రజాస్వామ్యం వర్ధిల్లి సురక్షితంగా వుండవలెనంటే పంచాయతీల కార్యకలాపాలను కూడా మనం వికేంద్రీకరించాలి. ఇది జరగాలంటే గ్రామంలో ప్రత్యేకకార్యకలాపాలపట్ల ఆసక్తి గల వర్గాలు ఎన్ని వుంటాయో అన్ని సహసంస్థలను మనం నెలకొల్పాలి. నేటి పరిస్థితులలో బాలమండలి, యువకమండలి, మహిళామండలి చాలా ముఖ్యమైన వ్యవస్థలు. ఇవిగాక ఇంకా అనేకసంస్థలు–నాటకం, ఆటలు, పాడిపరిశ్రమ, కోళ్ళపెంపకం, పండ్ల తోటలు మొదలగువాటికి యువకరైతుసంఘాలు యేర్పడ వచ్చు. గ్రామంలో పల్లీయుల జీవితం విస్తరించేకొద్దీ ప్రత్యే కతలు కూడా అధికమవుతాయి. వాటితోపాటు అనేకసంస్థలు కూడా తప్పనిసరిగా పుట్టుకొస్తాయి. గ్రామపంచాయతీలో ప్రత్యేక విషయాలను చూచేందుకై పనులను బట్టి యేర్పడే ఉపసంఘాలు, లేదా స్థాయీ సంఘాలనుగూర్చి ఇంతకు మునుపు నేను చర్చించివున్నాను. ఇట్టి ఉపసంఘాలకు సభ్యు లను కోఆప్టు చేసుకునే విషయంలో గ్రామంలోని సహసంస్థలు ఎవరిని చేర్చుకోవలసిందీ నిర్దేశించగలుగుతాయి. పంచాయతీ ఆమోదించిన, లేక డబ్బు ఇచ్చిన కార్యక్రమాలను అమలు

జరిపే పని సహసంస్థలకు అప్పగించవచ్చు. అవి చేసిన పనిని పంచాయతీ అజమాయిషీ చేయవచ్చు.

ఈవిధంగాపంచాయతీకార్యకలాపాలను వివిధసహసంస్థలకు విభజనచేయవచ్చు. సహసంస్థలద్వారా కుటుంబాలకూ, కుటుంబాలద్వారా వ్యక్తులకూ పనుల విభజన జరుగుతుంది. అంటే చొరవను సాధ్యమైనంతవరకు పంపిణీ చేసివేసి ప్రతి వ్యక్తి చొరవ తీసుకొని పనిచేసే అలవాటును ప్రోత్సహించడం జరుగుతుందన్నమాట. ఇలాంటి స్థాయీసంఘాలే బ్లాకు పంచాయతీ సమితికీ, జిల్లాపరిషత్తుకూ, రాష్ట్రశాసనసభకూ, పార్లమెంటుకూ కూడా వుంటాయి. పని సమర్థవంతంగా జరగడానికై బ్లాకుపంచాయతీ సమితికీ, జిల్లాపరిషత్తుకూ వుండే స్థాయీసంఘాలు సహసంస్థలపై తంతెలనుండి సభ్యులను కోఆప్టు చేసుకోవచ్చు. మరొకవిధంగా చెప్పాలంటే, మానవుడూ అతని కార్యకలాపాలూ సంపూర్ణంగా పెంపొందుటకై సహకార రంగంలో తల పెట్టినట్లే ఇచ్చటకూడా ఈ సహసంస్థలకూ పైవ్యవస్థలు వుండి తీరాలి. ఉదాహరణకు- సహసంస్థలకు బ్లాకు సమాఖ్య అనీ, జిల్లా సమాఖ్య అనీ, రాష్ట్రసమాఖ్య అనీ, జాతీయ సమాఖ్య అనీ వుండాలి.

నేటి స్వరూపమెట్లున్నప్పటికిని మన ప్రజాస్వామ్యం, మన సంస్కృతి వర్ధిల్లవలెనంటే నేటి మన జీవితములో ప్రబలంగా వున్నటువంటి కీచులాటలు, తగాదాలు అంతరించాలి. మానవుడు స్వభావరీత్యా అరిషడ్వర్గాలు కలవాడు. అయితే అతడు ఉన్నతాశయాలకై ఉత్తమ రీతిలో కృషి చేయవలసి వున్నదన్న సంగతిని క్రమేణా అతడు గుర్తిస్తు

న్నాడు. గ్రామంలో అభిప్రాయభేదాలు అనేవి లేకుండా అందరూ ఒక్కమాటపైనే వుండాలనడం కూడా సబబు కాదు. అభిప్రాయభేదాలనేవి లేకపోతే మనుషులలో ఆలోచనే లేకుండా పోతుంది. సజీవుడైన మానవుడు ఒక్కొక్కప్పుడు తాను చేసిన పనులను తానే విమర్శించుకోవలసి వస్తుంది. అటువంటి ఆత్మవిమర్శ మంచిదికూడా. అటువంటప్పుడు ఒక మనిషి ఇతరుల అభిప్రాయాలను, ఆచరణలను విమర్శించకుండా ఎలా వుంటాడు? గ్రామంలో మనం నిర్మించబోయే సామాజికవిధానములో వ్యక్తి తనతో తానేగాక ఇరుగు పొరుగువారితో గూడా చర్చలు జరిపి, మంచి చెడ్డలు తేల్చుకునేందుకు సంపూర్ణావకాశాలు కల్గించాలి. అయితే ఒకరితో ఒకరు సిగపట్లకు దిగి ఒకరికొకరు హాని కలిగించుకోకుండా చూడడం అవసరం. మనం కోరుతూవున్నట్టి ఆదర్శగ్రామంలో ప్రతిపురుషుడు, ప్రతి స్త్రీ ఏమరుపాటు లేకుండా మెలకువగా వుండి విషయ పరిజ్ఞానము కలిగిన వారైవుండాలి. అట్టి గ్రామంలో వివిధవ్యక్తులకూ, వర్గాలకూ మధ్య అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ స్వేచ్ఛగా చర్చింపబడుతూవుండాలి. మంచికీ చెడ్డకూ మధ్య జరిగే పోరాటాన్ని పరిష్కరించేందుకై నిరంతరము అన్వేషణ జరిగేవీలువుండాలి. కుటుంబంలోవలెనే గ్రామంలో కూడా విశాలకుటుంబపు సభ్యులంతా అందరికీ తల్లియైన మాతృదేవిపట్ల భక్తి ప్రపత్తులు కలిగివుండాలి. ఆమెనుంచి జవసత్వాలు పొందాలి. అలాగే ఎచ్చట తాము పగలంతా జీవన సంగ్రామంలో

పోరాడి రాత్రిపూట విశ్రమిస్తారో ఆ గ్రామాన్ని ప్రాణ పదంగా చూచుకోవాలి.

నేటి పార్టీ వ్యవస్థ అనేది ఇదివరకే కుంచించుకు పోయిన గ్రామప్రజలను మరింత సంకుచిత స్వభావులుగా చేస్తూ వుందని చాలామంది తరచు ఆరోపిస్తూ వుంటారు. అట్టి వారు కూడా ఈ నాడు మన గ్రామాల్లో పంచాయతీ రాజ్యం యే రూపంలో ప్రవేశపెట్టబడుతున్నదో ఆ రూపానికి తను హర్షామోదములు తెలిపారు. అయితే వారు ఎన్నికలు వుండ రాదనీ, ఒకవేళ వుంటే అవి ఏకగ్రీవంగా జరగవలెననీ, లేదా దాదాపు ఏకగ్రీవ ఎన్నికలై వుండవలెననీ వాదిస్తున్నారు. ఈ దృక్పథంలో హేతువాదం లేదు. ఇది కొంత విడ్డూరంగా కూడా కన్పిస్తుంది. గ్రామంలో వుంటే ఐకమత్యం వుంటుంది, లేదా అనైక్యత వుంటుంది. అటువంటప్పుడు ఒకవేళ యథార్థ మైన ఐకమత్యం లేనట్లైతే మనం కావాలని కృత్రిమంగా కల్పించిన ఐకమత్యం చిరకాలం వుంటుందా? అనేక శతాబ్దా లుగా గ్రామాలను నిర్లక్ష్యంచేస్తూ రావడంవల్ల, వాటిని దుర్వినియోగపరచడంవల్ల అవి కులమత విభేదాలకు ఆట పట్టులైపోయినవి. ఇట్టి పరిస్థితులలో ఎన్నిక ఏకగ్రీవంగా జర గాలని కోరడంవల్ల స్థితిగతులు బాగుపడజాలవు. ఏ నాటో తీసుకోవలసిన నివారక చర్యలను తీసుకోకపోయినట్లైతే ప్రస్తుత అంతస్తులూ, విభేదాలూ, తగాదాలూ మరింత అధ్వాన్న మయ్యే సూచనలున్నవి.

గ్రామంలో ఐకమత్యావశ్యకత విషయమై మనకు అభి ప్రాయభేదము లేదు. ఐకమత్యం కావలెననే మనమంతా కోరు

తున్నాం. అయితే దానిని ఏ పద్ధతి ప్రకారం సాధించాలన్న విషయంలోనే పేచీ వస్తుంది. ఎన్నికలు నేటి ప్రజాజీవితమును విచ్ఛిన్నపరుస్తాయన్న మాట అంగీకరించదగినదే. కాని పార్టీ పద్ధతి ప్రకారం ఎన్నికలు జరగడంవల్లనేకదా సామాన్య ప్రజలు నేటి ప్రభుత్వంలోని లోపాలను ప్రభుత్వ ప్రతినిధులు కొందరు చేసే అవక తవక పనులను తెలుసుకొని విమర్శించుకునే అవకాశం కలిగింది. పార్టీ పద్ధతి ఎన్నిక లేకపోతే ఈ మంచి చెడ్డలు తెలుసుకునే అవకాశం ప్రజలకు కలిగేదా? ప్రజలు సంగతిసందర్భాలు ఎరిగినవారైవుండి, మంచిచెడ్డలను నిర్ణయించుకోగలవారై వుండి, వారి న్యాయమైన వాదాలనూ, కోర్కెలనూ బలపగచడానికి సువ్యవస్థితమైన సంస్థలున్నప్పుడు ఎన్నికలు పార్టీలవారీగా కాక మరొక పద్ధతి ప్రకారం జరగవచ్చు. ఈ లోపల ప్రతిపక్షమనేది ప్రజాజీవితానికి కాంతిరేఖవంటిదనీ,అది ఎన్నో అంశాలను వెలుగులోకి తీసుకురాగలదనీ మనమంతా గుర్తించాలి. మన రక్తంలో ఎఱ్ఱకణాలు, తెల్లకణాలు వుంటాయి. అవి ఏ పరిమితిలో వుండవలెనో అలా వుండక, హెచ్చుతగ్గులుగా వున్నప్పుడు శరీరం స్వాధీనంలో వుండదు. వెలుపలినుంచి వచ్చే తాకిడులను తట్టుకునే శక్తి శరీరానికి తగ్గుతుంది. మరి ఈ స్థితిని తప్పించుకునే మార్గమేది?

ప్రేమ, ఐకమత్యం లేని చోట్ల కావాలని వాటిని వెలుపలినుంచి ఆపాదిస్తే దానివల్ల గ్రామంయొక్క చేతనత్వము నశిస్తుంది. గ్రామ కార్యక్రమంలో ప్రాణం వుండాలి. దాని నిలువ నీరై వున్న గ్రామ జీవితంలో చైతన్యం పుట్టుకురావాలి.

పాండురోగంలో వున్నవారికి క్రొత్త రక్తము ఎక్కినట్లుగా, మూగవోయినవారికి మాటలు వచ్చినట్లుగా గ్రామప్రజలలో వినూత్న పరిణామం రావాలి. నేడు గ్రామాలలో క్షీణదశలో వున్న ప్రజాజీవితానికి ఆరోగ్యము,జవసత్వాలుకలిగించే బలవర్ధకౌషధం యేదైనా వుందంటే అది పనులపద్ధతిప్రకారంసృజనాత్మక శక్తుల ప్రాబల్యమేనని చెప్పవలసి ఉన్నది. వివిధ వ్యవస్థలు ఒకదానితో ఒకటి నిర్మాణాత్మకంగా పోటీపడుతూ, ప్రజల కోర్కెలనూ, మనోభావాలనూ కన్నతల్లివలె సమన్వయం చేసే గ్రామపంచాయతీ చురుకుగా పనిచేస్తూ, అభివృద్ధి నిరోధకుల నత్తిశులనూ దిగలాగడాలనూ ఎదుర్కొంటూ వుంటేనే గ్రామజీవితం తిరిగి వికాసం చెందగలుగుతుంది. గ్రామం ఈ పద్ధతి ప్రకారం అభివృద్ధి చెందుతున్నప్పుడు రాష్ట్ర, జాతీయరంగాలలో కూడా తదనుగుణమైన మార్పులు రావాలి. దీనికి సమయం మనమనుకుంటున్నదానికంటె ముందుగానే రావచ్చు. రాష్ట్ర శాసనసభలూ, పార్లమెంటూ రేపు ఏ రాజకీయ, కార్యనిర్వాహక స్వరూపం దాలుస్తాయో ఈ నాడు చెప్పడం సబబుగా వుండదు. అయితే ప్రజల తత్వమునుబట్టి, వారి సంస్కృతిని బట్టి వారు యేదిశగా పురోగమిస్తారో చెప్పేందుకు ప్రయత్నించవచ్చు.

రేపటి రాష్ట్ర శాసనసభలలో, పార్లమెంటులో రాజకీయపక్షాల ప్రతినిధులూ, స్వతంత్రులు మాత్రమే ఎందుకుండాలో తగు కారణం కనిపించదు. ఇతరులు కూడా వుండవచ్చు. దేశంలోని వివిధ వృత్తులకూ, పనులకూ సంబంధించిన సహాసంస్థల ప్రతినిధులు కూడా సభ్యులుగా రావచ్చు.

అయితే ఆ సహసంస్థలు పార్లమెంటు ఆమోదించిన వ్యవస్థ స్వరూపానికి అనుగుణంగా వుండాలి. అలాంటి సభ్యులు సైతం తెలచే ఎన్నుకోబడవచ్చు. లేదా ఒక ప్రత్యేక ఓటరుల వర్గముచే ఎన్నుకోబడవచ్చు. పంచాయతీల ఎన్నుకోబడ్డ ప్రతినిధులుకూడా సభ్యులుగా రావచ్చు. వారు దిగువన పునాది నుండిగాని, లేక పై తంతెలచేగాని, లేదా మరేదైనా ఎన్నిక పద్ధతి ప్రకారంగాని ఎన్నుకోబడవచ్చు. జాతీయ, రాష్ట్ర శాసనసభలూ మిశ్రమ సభలుగా రూపొందవచ్చు. వాటిలో సంఘంలోని అన్నివర్గాల ప్రతినిధులూ వుండవచ్చు. పదేండ్ల కొకమారు - అనగా జనాభా లెక్కలు తీయడం జరిగిన తరువాత ప్రజాప్రాతినిధ్య చట్టాన్ని సంఘంలో ప్రచలితమైవున్న జీవితవిధానాని కనుగుణంగా సవరించవచ్చు. ఈ విధంగా జాతీయ ప్రభుత్వమనేది నేటి ప్రపంచంలో ప్రజాస్వామ్య దేశాల లక్షణాల ప్రకారం. సంఖ్యాబలంపై ఆధారపడి వుండే పార్టీ ప్రభుత్వమైవుండక, అందరు వ్యక్తులకూ, అన్ని వర్గాలకూ సంపూర్ణ ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వమై విరాజిల్లగలదు.

మనం మన రాజ్యాంగాన్ని రాజ్యాంగపరిషత్తులో రచించుకున్నాము. రాజ్యాంగపరిషత్సభ్యులు భారతదేశ ప్రజలచే ఎన్నుకోబడినవారు. మరి ప్రజలలో చదువురాని వారు చాలామంది వున్నారు. కేంద్రప్రభుత్వమునకు సంబంధించిన అంశాలు, రాష్ట్రప్రభుత్వమునకు సంబంధించిన అంశాలు, ఉభయులకు చెందినవి, శేషించిన అంశాలు అన్నీ పైనుంచీ నిర్ణయింపబడినట్టివే. అయితే తాను ఏమిచేయ

గలవో, ఇతరులకు ఏయే అంశాలు అప్పగించగలవో సామాన్యమానవుడు ఇంకను తేల్చి చెప్పవలసివున్నది. ప్రస్తుత రాజ్యాంగమును అనుసరించి ఎన్నుకోబడిన పార్లమెంటు ప్రజలకు అధికారాలను ప్రాప్తింపజేయుటకు తనకై తానే నిర్ణయించడం సంతోషకరమైన విషయం. ప్రజలు న్యాయబద్ధంగా, సమర్థవంతంగా చెలాయించగల అధికారాన్ని, వారు స్వీకరించే స్వేచ్ఛను ప్రజలకు వదిలివేయడానికి పార్లమెంటు సిద్ధపడింది. ఈ విషయంలో తన తరఫున వ్యవహరించడానికై పార్లమెంటు ఒక కొత్త మంత్రిత్వశాఖను ఏర్పరచి, దానికి ప్రత్యేకాధికారాలను ఇచ్చింది. ఈ విధానం మన దేశమంతటా సంపూర్తిగా అమలులోకివచ్చినప్పుడు పునాదినుంచి ఒక కొత్తచొరవ, ఉత్సాహం వెల్లివిరియగలవు. అప్పటికల్లా ప్రజలు తమ శక్తిసామర్థ్యాలను, తమ పరిమితులను గ్రహించగలరు. ఇకముందు వారి శక్తిసామర్థ్యములు పెంపొందవలెనంటే ఏ విషయంలో హెచ్చవచ్చునో, ఏ విషయంలో తగ్గవచ్చునో తెలుసుకోగలుగుతారు. తాము ఏ అధికారాలను చెలాయించదలచుకొన్నారో వాటిని ప్రజలే నిర్ణయించుకోగలుగుతారు. ఏ అధికారాలను పైవారు చెలాయించవచ్చునో, ఏ అధికారాలు తాము, పైవారూ కలిసి ఉమ్మడిగా చెలాయించగలరో వాటినికూడా నిర్ణయించుకోగలుగుతారు. ఈ అంచనాలు ఒక్కొక్క మెట్టుగా జాతీయస్థాయి వరకూ పోయి అక్కడ వాటి అనుభూతి కలుగుతుంది.

ఏమైనప్పటికీ ఈ విధానంవల్ల, సాంకేతికపరిపాలనా సామర్థ్యం హెచ్చాలి. పునాదినుంచి ప్రజానాయకత్వాన్ని

సృష్టించగలగాలి. క్రమేపీ అధికారాన్ని, బాధ్యతను పంపిణీ చేయగలగాలి. మనకు సకృత్తుగా లభించే మానవబలగాన్నీ, భౌతికసంపదనూ సాధ్యమైనంతవరకు చక్కగా వినియోగించుకోవాలి. ఇవి జరగాలంటే ముందు జరగవలసినవన్నీ జరిగేటట్టు చేసేందుకై ప్రభుత్వం సదా జాగరూకతతో వుండాలి. అధికారదత్తత అనేది యథార్థంగా జరగాలి. బదిలీచేసే సాధనాలు, సంపదలు తగినంతగా వుండాలి. ప్రభుత్వఏజన్సీకి, క్రొత్తప్రాతినిధ్యసంస్థలకు మధ్య వుండవలసిన సంబంధాలను స్పష్టంగా నిర్వచించాలి.వాటిని తూ.చ. తప్పకఅమలుజరపాలి. పౌరులకు నూత్నప్రజాస్వామ్యతత్వాన్నీ, లక్ష్యాలనూగూర్చి బోధించే విషయంలోను, తత్సంబంధమైన శిక్షణను ఇచ్చే విషయంలోను నేటి రాజకీయపక్షాలు ఒక ఒడంబడికకు రావలసివున్నది.

మన దేశంలో రకరకాల ఆరోపణలు చేస్తూవుంటారు. "పండిత నెహ్రూకు ప్రజలు సర్వాధికారాలు ఇచ్చారు. ఆయన నియంతవలె దేశాన్ని ఎందుకు పాలించడు? జాతీయ శక్తిస్తోమతలను ఎందుకు కర్తవ్యనిర్వహణకు వినియోగించడు? దేశంలోని వివిధప్రాంతాలలో బాధ్యతారహితంగాప్రవర్తించే వారి ఆటలను ఆయన ఎందుకు కట్టించలేదు?" మరికొందరు "నెహ్రూ తర్వాత నాయకుడెవరు?" అని ప్రశ్నిస్తూవుంటారు. రెండువర్గాలవారు ఈ ప్రశ్నలు వేస్తూ వుంటారు. ఒకరు— పండితనెహ్రూకుగల అధికారాన్ని చూచి ఈర్ష్యపడేవారు. వీరు మన దేశపరిపాలనను మన ఇరుగుపొరుగునవున్న దేశా

లలో మాదిరిగా నడపాలని అనుకుంటారు. రెండవవారు నెహ్రూను ఆసరాగా పెట్టుకొని పైకివస్తూవుంటారు. నెహ్రూ లేక తమ పదవులు వుండవన్న సంగతి వారికి తెలుసు. కనుక నెహ్రూ తమను ఇప్పుడే వారసులుగా ప్రకటించాలని అనుకుంటారు. అలా ప్రకటించినట్లైతే ఒకవేళ నెహ్రూ లేకపోయి నప్పటికీ జాతి తమను జ్ఞాపకం పెట్టుకుంటుందనీ, తమను నిర్లక్ష్యం చేయదనీ వారి నమ్మకం. నెహ్రూ ఈ ప్రశ్నలను బహిరంగంగానే వింటున్నారు. కాని వాటికి ఇదమిత్థమని సమాధానం చెప్పడం లేదు.

అసలు ఈ ప్రశ్నలు ఉదయించడమే ఆశ్చర్యకరం. పండిత నెహ్రూ వలె సమాజానికి సంగతిసందర్భాలు విశద పరచిన వ్యక్తి ఎవరూ కానరారు. మానవజాతి చరిత్రలో ఆయన మాదిరిగా ప్రజాస్వామ్య తత్వాన్నిగూర్చి, జీవిత ప్రాథమిక సూత్రాలనుగూర్చి అసంఖ్యాక ప్రజానీకానికి ముఖాముఖిగా ప్రబోధించిన వ్యక్తి మరెవ్వరున్నారు? ఆయన ఉపన్యాసాలను కోట్లాది భారతీయులు వినివున్నారు. ఆయన ఆశయాలేమిటో, ఆదర్శాలేమిటో వారికి తెలుసు. భారత రాజకీయరంగంలోకి ఆయన ప్రవేశించినప్పటినుంచి స్వాతంత్ర్యమును, సమానత్వమును, సౌభ్రాత్రమును పెంపొందించ డానికి ఆయన ఎంత కష్టపడ్డాడో, ఎన్ని త్యాగాలు చేశాడో ప్రజలకు తెలుసు. నెహ్రూ తర్వాత నాయకుడెవరు? అన్న ప్రశ్న యేమిటి? వారసులను పేర్కొనడమనేది రాజులు, నియంతలు చేసేపని. అలా చేశారుకూడా. కనుక నెహ్రూ తర్వాత ఎవరు తమ నాయకుడు కావలెనో భారతప్రజలు

నిర్ణయించాలి. ప్రజలు పొరపడి చెడ్డవ్యక్తిని తమ నాయకుడిగా నిర్ణయించవచ్చు. అట్టితరి వారి పొరపాటును వారే దిద్దుకోవాలి. నెహ్రూకు విశ్వాసపాత్రులైన వారి మద్దతును తీసుకోవాలి. ఆయన తర్వాత యేమి జరుగుతుందో అని ఆందోళన పడటమెందుకు? ఒకవేళ ఆయన ఆదర్శాలను ఆయన తదనంతరము భంగపుచ్చడం జరిగితే ఆయన అనుయాయులు సర్వత్యాగాలుచేసి ఆయన ఆదర్శాలను పరిరక్షింప ప్రయత్నించరా?

ఇక్కడ దాపరికం లేకుండా కొన్ని విషయాలు స్పష్టం చేయదలచాను. నాయకుడు, అతని అనుచరులైన ప్రజలు ఒకరికొకరు సన్నిహితులు. తమ నాయకుడెంత అంతస్తు గలవాడు కావాలని ప్రజలు కోరుకుంటారో దానిని అతనికి ఆపాదిస్తారు. నాయకుడు ప్రజల ఆశలకూ, ఆశయాలకూ ప్రాతినిధ్యం వహించి వారి తరఫున మాట్లాడుతాడు. అవాంతర పరిస్థితిలో, లేదా అసాధారణస్థితిలో ప్రజలకు ఒక మహా నాయకుడు కావాలి. చక్కని ప్రజాస్వామ్యంలో పౌరులు, వారి నాయకులు పెద్ద అంతస్తు గలవారై వుండాలి. మరి మన ప్రజాస్వామ్యానికి పునాదివేసింది పండిత నెహ్రూ కదా! కనుక ఆయన తర్వాత వచ్చే వారసులు ఆయనను ప్రతిబింబించ గలవారై వుండాలి. అంటే పెద్ద వ్యక్తిత్వం గలవారై వుండాలి. పండిత నెహ్రూ తర్వాత మరొక పండిత నెహ్రూ వారసుడుగా రావాలంటే ఆయన జీవితము, ఆయన పడ్డ కష్టాలు వ్యర్థమన్నమాటే.

## సోషలిస్టు కామన్వెల్తు

గ్రామంలో వుండవలసిన మూడు ప్రాథమికవ్యవస్థలనుగూర్చి మనం చర్చించాము. ఈ మూడు వ్యవస్థలు గ్రామంలో గల ఇతర సహాసంస్థలతో సమన్వయం చెందినపుడు ఏర్పడే స్వరూపాన్నికూడా మనం అవలోకించివున్నాము. ఎగువన వుండే వ్యవస్థలనుకూడా చూచివున్నాము. అయితే మన మింతవరకూ ప్రజాస్వామ్యవృద్ధినే ముఖ్యంగా పరిశీలించాము. భూమాత మనకిచ్చే సంపదల పంపిణీవిషయం మనం చర్చించ లేదు. నానాటికీ సన్నిహితమవుతున్న ప్రపంచంలో, జనాభా వేగంగా పెరిగిపోతూవున్న ప్రపంచంలో ప్రజాస్వామ్యనౌక భద్రంగా ప్రయాణంచేయాలంటే ఆర్థికవ్యవస్థ చాలా ముఖ్యమైనది. ఆర్థికరంగంలోకూడా మనం పైనుంచి క్రిందికి గాక పునాదినుంచే సమస్యను పరిశీలించాలి. ఏ చెట్టుకైనా వేళ్ళు భూమిలో వుంటాయి. కొమ్మలు, రెమ్మలు, ఆకులు ఎండా, గాలీ తగులుతూ పైన వుంటాయి. ప్రజలు వేళ్ళవంటివారు. భూమాతకు వారే వారసులు. కొమ్మలు, రెమ్మలు, సిరిసంపదలు, ఆకులు, పూలు వేళ్ళయొక్క పర్యవసానములు. ప్రజల ఆస్తిని ప్రకృతిలో పుష్పజాలమని భావించుదాము. ఈ ప్రాతిపదికపై సోషలిస్టు కామన్వెల్తును పరిశీలిద్దాము.

జంతువైనను దాని కదే సంతోషంగా వుండలేదు. మదపుటేనుగు బీభత్సం చేస్తుందంటే అందుకు కారణం దానికి ఇతరమైన వ్యాపకం లేకపోవడమే. ఆంతరమైన దాని ప్రవృత్తి తీరే అవకాశం వుంటే అది అలా చేయదు.

చెంఘిజ్ ఖాన్, తైమర్లేన్, హిట్లర్ వంటి విజేతలు, దురాక్రమణదారులు, క్రూరులు బాల్యంలో ఎదుర్కొన్న కొన్ని కాకతాళీయసంఘటనలు కారణంగా స్వప్నచారులుగానో లేక నాడికి సంబంధించిన వ్యాధిపీడితులుగానో వుండెడివారని మనం వింటాము. జంతువులను వాటి సంఘమునుండి వేరుచేసినపుడు అవి మదపుటేనుగువలెనే ప్రవర్తిస్తాయి. అట్లే పుట్టుక కారణంచేతనో, లేదా పెంపకం కారణంగానో, లేక మరే ఇతర కారణంచేతనో ఒకవ్యక్తి అతని సంఘముర్నుండి వేరు చేయబడినపుడు అతను మామూలుమనిషివలె ప్రవర్తించడు. ఈ పుస్తకంలో ఒకచోట వివరించబడినట్టి భారతీయసమిష్టి కుటుంబం సోషలిస్టు సమాజానికి చక్కని చిహ్నమని చెప్పాలి. కుటుంబంలోని ప్రతివ్యక్తి అతనికి, లేక ఆమెకు అప్పగించబడిన పనిని చేస్తారు. చివరకు దిప్పకాయ చేసే పనికూడా వుంది. అతడు కుటుంబంలోని తక్కినవారికి వినోదం చేకూరుస్తాడు. వాళ్ళూ వీళ్ళూ చెప్పిన పనులు చేస్తూవుంటాడు. కుటుంబంలోని ప్రతివ్యక్తి తన ఆర్జనను తెచ్చి అందరిరాశిలో పోస్తాడు. మాతృదేవి ఆ రాశినుంచి ఎవరి కెంత కావాలో అంత తీసి ఇస్తుంది. దానధర్మాలకూ, శుభాశుభ కార్యాలకూ, రాబడిలేనప్పుడు వాడుకోనటానికీ కొంత అట్టే పెట్టుతుంది. తక్కినదానినంతా ఎవరి అవసరాలనుబట్టి వారికి ఇస్తూవుంటుంది. ఒక్కొక్కరిచే వారి శక్త్యనుసారం పనిచేయిస్తుంది. అందరికీ పెట్టే తల్లి, పోసే తల్లి మాతృదేవత.

గడచిన విభాగంలో మనం తలపెట్టే పనుల ననుసరించిన ప్రజాస్వామ్యంలో గ్రామమనేది ఉమ్మడి కుటుంబానికి

విస్తృతరూపంవలె వుండవలెననుకున్నాము. గ్రామమనే కుటుంబానికి గ్రామపంచాయతీ పైన చెప్పిన మాతృదేవివలె వ్యవహరించాలి. గ్రామపంచాయతీ ప్రెసిడెంటు మన ఉమ్మడి కుటుంబాలలో జ్యేష్ఠునివంటివాడు. అతడు మాతృదేవి తరఫున కుటుంబ భారమును మోయాలి. కుటుంబంలో కలతలవల్ల విషం పుట్టుకొస్తే అతడు దానిని నీలకంఠునివలె దిగమ్రింగుకో వాలి. కుటుంబంలో నలుగురు వ్యక్తులు ఒకచోట కలిసి జీవిస్తున్నప్పుడు కలతలు, జగడాలు వుండడం కద్దు. వాటివల్ల ఉత్పన్నమయ్యే విషాన్ని ఎవరో ఒకరు దిగమ్రింగాలి. లేక పోతే అది కుటుంబంలోని వారికి చుట్టుకుంటుంది. కుటుంబంలో పుట్టే విషాన్ని మ్రింగేవాడు జ్యేష్ఠుడుకాగా, గ్రామపంచాయ తీలో వచ్చే చెడుగులను పంచాయతీ ప్రెసిడెంటు భరించాలి. జ్యేష్ఠుడు తక్కిన వారిని ఒక క్రమంలో పెడతాడు. అవసర మైతే మందలిస్తాడు. అలాగే పంచాయతీ ప్రెసిడెంటుకూడా గ్రామంలోని వారిని ఒకదారిలో పెట్టి చక్కగా నడపాలి.

ఉమ్మడి కుటుంబంలో ఎవరు యే బాధ్యత వహిం చాలో, ఏ పని చేయాలో నిర్ణయించే విషయంలో మాతృదేవి పలుకుబడికూడా కొంతవరకు వుంటుంది. కాని ఎవరి పని యేమిటో నిర్ణయమైన తర్వాత నిత్యకృత్యాలలో జోక్యం కలుగజేసుకునే హక్కు ఆమెకూ వుండదు; జ్యేష్ఠుడికీ వుండదు. ఎవరి పనులు వారే చూచుకోవాలి. ఆ స్వేచ్ఛ వారికి వుంది. ఏదైనా చిక్కు యేర్పడితే పెద్దల సలహా తీసుకుంటారు. అలాగే గ్రామమనే కుటుంబంకూడా గ్రామ ప్రణాళికలో ఏ వ్యక్తిపాత్ర యేమిటో నిర్ణయించాలి. గ్రామప్రజలు

గ్రామనైసర్గికస్థితి ఇవ్వగల సంపదలను హెచ్చు వినియోగానికి తెచ్చుకునేందుకు వీలుగా గ్రామప్రణాళిక తయారుచేయాలి. జీవితంలో మానవుడే సాధనోపాయము; మానవుడే లక్ష్యము. సంఘంలో అన్నిటికన్న సహజసిద్ధమైన సాధనము ఎవరంటే మానవుడే. దూరదృష్టి, ముందుజాగ్రత్త ఏ మాత్రమూ లేని సంఘంలో మాత్రమే మానవుణ్ని పనిలేని సోమరిగా వదలి వేయడం జరుగుతుంది.

గ్రామపంచాయతీలు గ్రామంలో వ్యక్తుల ఆదాయాలను ఒకచోట కలబోయవు. అలా కలబోసే అవసరంకూడా లేదు. అయితే గ్రామ అవసరాలను తీర్చడానికీ, గ్రామంలో సహాయము అవసరమైనవారికి సహాయం చేయడానికీ ఒక్కొక్కరు కొంత మొత్తము ఇవ్వవలెనని అడిగే హక్కు గ్రామ పంచాయతీకి వున్నది. ఈ విధంగా గ్రామప్రజల తెలివి తేటలను, వారి సాధనసంపత్తులను గ్రామపంచాయతీ ఒక చోట చేర్చుతుంది. తన కుటుంబంలోని వారికి మార్గదర్శిగా వుండి వారిని ఆదుకుంటుంది. ఎదురుతిరిగేవారిని ఒకదారికి తెస్తుంది. గ్రామానికి వర్తించేదే బ్లాకు పంచాయతీ సమితికీ, జిల్లాపరిషత్తుకూ, రాష్ట్రశాసనసభకూ, లోకసభకూ వర్తి స్తుంది. కాకపోతే బాధ్యతలు హెచ్చుతగ్గులుగా వుండవచ్చు. సాధన సంపత్తులను కలబోయడం, నిధులపరిమాణం, పన్నులు, చేసే సహాయం మొదలగు విషయాలలో వ్యత్యా సాలు వుండవచ్చు. కాని చేసే సైనం దిగువన ఉమ్మడి కుటుంబంలో వలెనే వుంటుంది. జాతీయస్థాయిపై ప్రధాన మంత్రి జ్యేష్ఠుడుగా వ్యవహరిస్తాడు. ఆయన తన బాధ్యతలను

నిర్వహించే విషయంలోను, ఆయనకు సందేహాలు కలిగినప్పుడు మార్గం చూపేందుకూ, ఆయన చేసే పనులు నిరంకుశంగా వున్నప్పుడు ఆయనను హెచ్చరించి సరియైన దారిలో పెట్టే విషయంలోను పార్లమెంటు మాతృదేవతగా వ్యవహరిస్తుంది.

విజ్ఞానశాస్త్రాభివృద్ధివల్ల ఒక దేశానికీ, మరొక దేశానికీ మధ్య దూరం తగ్గిందనీ, ప్రపంచం ఒక పెద్ద గ్రామంగా, ప్రపంచప్రజ ఒక పెద్ద కుటుంబంగా అవుతూవుందనీ ఇదివరకొకచోట చెప్పివున్నాను. మానవులు ఆటంబాంబులు, హైడ్రోజన్‌బాంబులు తయారుచేశారు. మూడవ ప్రపంచ యుద్ధమే వస్తే ఎటువంటి దారుణమైన ఫలితాలు కలుగుతాయో మనకు తెలుసు. కర్రలతో, గదలతో పోట్లాడటం జరిగినపుడు గాయాలు చాలా తక్కువగా వుండేవి. కాని కత్తులు, బల్లెములు, బాణములు వచ్చిన తరువాత తీవ్రంగా గాయపడటం జరిగింది. తుపాకులు, ఫిరంగీలు వచ్చి నాశనము సంభవించింది. ఆటంబాంబులవల్ల, హైడ్రోజన్‌బాంబులవల్ల సర్వనాశనం తప్ప మరొకటిలేదు. తాము సర్వనాశనం కావడానికి మానవాళి కోరుకోదు. కాకపోతే స్వప్నచారులు, మానసికంగా రుగ్మత కలవారు వుండవచ్చు. గడిచిన కొన్నేండ్లలో మానవ మనశ్శాస్త్రము చాలా అభివృద్ధిచెందింది. కనుక మానసిక రుగ్మత గలవారిని తగు అదుపులో పెట్టే ప్రయత్నం ప్రపంచం చేస్తుంది. అమెరికా, రష్యాలు ఒక ఒప్పందానికి వచ్చి నిరాయుధీకరణకు పూనుకోవలెనని ప్రపంచ ప్రజలు కోరుతున్నారు. అమెరికాలో స్వేచ్ఛా వ్యాపారం పద్ధతి వుంది. ఆ పద్ధతి కదిపుట్టిల్లు. రష్యా సోష

లిస్టు దేశం. అక్కడి పరిపాలన, అక్కడి ఆర్థిక వ్యవస్థ నియంతృత్వం క్రింద వున్నాయి. రష్యా ఇనుపతెర వెనుక వున్నదనీ, అక్కడ ఏమి జరుగుతూవుందో ఎవరికీ తెలియదనీ ఒక ఆరోపణ వుంది. అమెరికాను గూర్చి కూడా కొన్ని ఆరోపణలు వున్నాయి. ఈ స్థితిలో కమ్యూనిజమూ, పెట్టుబడీదారీవిధానమూ వాటంతట అవి సఖ్యత పడలేవు. వాటికి సఖ్యత కుదర్చాలంటే ప్రత్యామ్నాయ మార్గాలు వెదకాలి. అణువిజ్ఞానం ఈ ప్రపంచాన్ని పూర్తిగా మార్చివేసింది. ఒక కొత్త ప్రపంచమే ఆవిర్భవించనున్నది. ఎద్దులు, గుర్రాలకు బదులు ఆవిరి ఇంజను రావడంవల్ల ఎంత అభివృద్ధి చేకూరిందో దానికి ఎన్నోరెట్లు విప్లవం అణుశక్తివల్ల కలుగుతుంది. ప్రపంచంలో ప్రతి రోజూ ఆయుధ నిర్మాణమునకై ఎంతో డబ్బు వ్యయ పరచబడుతున్నది. ఆ ఆయుధాలు ఉత్పత్తి అయి బయటికి వచ్చేసరికే అవి పాతబడుతున్నవి. కారణమేమంటే వాటికి బదులు మరింత నష్టం కలిగించే కొత్త ఆయుధాలను ఎప్పటికప్పుడు కనుక్కోవడం జరుగుతూ వుంది. యుద్ధం దృష్ట్యా చూచినా ఈ ఖర్చు సర్వదండుగ అని విశదమవుతుంది. మానవజాతి మనవలెనంటే మూడవ ప్రపంచయుద్ధం కేవలం అసంగతమైనది. ప్రజలు అమాయకులవడంచేత తెలివితేటలు గలవారు వారిని మోసగిస్తారు. దానికి తోడు దారిద్ర్యం కూడా వుందంటే యుద్ధం సులువుగా వస్తుంది. మానవజాతినుండి అజ్ఞానమును, దారిద్ర్యమును శాశ్వతంగా రూపుమాపవచ్చునని మనకు తెలుసు. కాని ఇది జరగాలంటే ముందు యుద్ధాన్ని బహిష్కరించాలి. ప్రపంచసాధన సంపత్తు

లను ఉత్పత్తి కార్యాలకు వినియోగించి అజ్ఞానాన్ని పూర్తిగా రూపుమాపాలి. మానవచరిత్రలో యుద్ధమనేది పొసగని విషయమని పెట్టుబడిదారీ దేశాల నాయకులు, కమ్యూనిష్టు దేశాల నాయకులూ గ్రహించారు. అయితే సహజీవనమనేది రాకపోతే యుద్ధాన్ని నిషేధించలేరు. సహజీవనమంటే పరస్పర సాంఘిక వ్యవస్థలను పునర్నిర్మించుకోవడానికి పరస్పరమూ సహాయం చేసుకోవడమన్నమాట. అంటే ఇంతవరకూ యుద్ధాలలో పోరాడేందుకు మనుషుల నిచ్చిన దేశాలకూ, విదేశాలలో తయారైన సరుకులకు అమ్మకపు కేంద్రాలుగా వున్న వెనుకబడ్డ దేశాలకూ ఆర్థికసహాయం చేయాలి. ఇది జరిగిందంటే పునర్నిర్మాణం ఆరంభమవుతుంది. అప్పుడు ప్రపంచం సోషలిస్టు సమాజంగా విస్తరిస్తుంది. మన కవసరమైన ఆహారాన్ని పండించడానికి తగినంత భూమి వుంది. ఈ భూప్రపంచంపై జీవులను పోషించేందుకై అవసరమైన సామగ్రినిచ్చే భూతల్లి వుంది. క్రమేణా తక్కువ శ్రమతో హెచ్చుఉత్పత్తిని పొందేందుకై భౌతికశాస్త్రములు, పరిపాలనావ్యవస్థ దినదినాభివృద్ధిగాంచుతూవున్నవి. ప్రపంచం ఒక ఉమ్మడికుటుంబంగా రూపొందినపుడు ఈ భూతల్లిపై లభించే సిరిసంపదలు మానవులందరికీ సరిపోవడమేగాక మిగులుతాయికూడా. అప్పుడు మానవులంతా ఒకేజాతికి చెందినవారవుతారు. అది ప్రపంచజాతి అనబడుతుంది. ఒక్క ప్యాస్‌పోర్టుతో ప్రపంచంలో ఏ భాగానికైనా వెళ్ళవచ్చు. అప్పు డీ ప్రపంచం ఒకటి అవుతుంది. మానవనిర్మితమైన సరిహద్దులు పోతాయి. ఒక వేళ యే దేశమైనా ఇతరుల పొడ తగలకుండా దూరంగా

వుండదలిస్తే అలా వుండే స్వేచ్ఛ దానికి వుంటుంది. అయితే అది అలా ప్రత్యేకంగా వుండదలచినందుకుగాను ప్రపంచ పంచాయతీకి ఒకరకం పన్ను చెల్లించాలి. ఇప్పుడు మునిసిపాలిటీలలో, కార్పొరేషన్‌లలో నివాసగృహములున్నవారు ఇంటిపన్ను చెల్లిస్తున్నారుకదా. అదీ అంతే. ఆ పన్నుద్వారా వసూలైన మొత్తములోనుంచి కొంతభాగమును తమ సాధన సంపత్తిపై తాము జీవించజాలనట్టి తక్కిన ప్రపంచ ప్రజల అవసరాలను తీర్చేటందుకు వినియోగించవచ్చు.

కాగా తేలినదేమిటంటే ఎవరి స్వేచ్ఛప్రకారం, ఎవరి ఇష్టప్రకారం వారు వుండే హక్కు వున్నది. కాని ఈ భూతలిని తమవరకే గుత్తచేసుకునే హక్కు ఎవ్వరికీ లేదు. గాలి, నీరు, సూర్యరశ్మి మానవులకే గాక పశుపక్ష్యాదులకు కూడా స్వేచ్ఛగా వినియోగించుకునే హక్కు ఎలా వుందో అలాగే ఈ భూప్రపంచంపై గల సాధనసంపత్తులనన్నిటినీ ప్రపంచ ప్రజలంతా ఉపయోగించుకునే స్వేచ్ఛ వుండాలి. నేడు ఐక్యరాజ్యసమితి ఛిన్నాభిన్నంగ వుందంటే అందుకు కారణం అది తనకై తాను కొన్ని వైరుధ్యాలను సృష్టించుకుంది. పైగా కొందరు సభ్యులు ఇతరులకు నష్టం కలిగే రీతిని తమవరకు ప్రత్యేకహక్కులు కావాలని చూచుకుంటున్నారు. యుద్ధాన్ని నిషేధించి, అజ్ఞానాన్ని, దారిద్ర్యాన్ని నిర్మూలించినప్పుడు కొత్త ఐక్యరాజ్యసమితి ప్రపంచ పంచాయతీగా పెంపొందుతుంది. అప్పుడది ప్రపంచకుటుంబానికి మాతృదేవియై ప్రపంచ సాధనసంపత్తిని వారివారి అవసరాలనుబట్టి ఏకకుటుంబసభ్య

లకు పంపిణీచేయగలుగుతుంది. వారినుంచి వారి శక్తిసామర్థ్యాలనుబట్టి రాబట్టగలుగుతుంది.

భోగాలను వదులుకొని త్యాగాలకు సిద్ధమై అమరులుగా నిల్చేవారు చాలా అరుదు. నిరంకుశమైన పద్ధతులు క్రొత్తవిధానాలను సృష్టిస్తాయి గాని క్రొత్తమానవులను రూపొందించలేవు. ఈ విషయాన్ని పరపీడనకు పాల్పడేవారు—వారు గ్రామానికిచెందినవారైనాసరే, లేక ప్రపంచసమాజానికిచెందినవారైనాసరే—గ్రహించాలి. వారు త్వరగా మేల్కొని తాము బలహీనులైనవారి తరఫున ధర్మకర్తలుగా వున్నామనీ, వెనుకబడ్డవారి విజ్ఞాన సంస్కృతులను అభ్యున్నతికి గొని పోవడమే తమ కర్తవ్యమనీ తెలుసుకోవాలి. అంతేకాని దళిత ప్రజలను మరింత క్రుంగదీయకూడదు. సమాజంలో ప్రతి వ్యక్తీ పని సరిగాచేసినప్పుడు, వారి జీవితావసరాలను తీర్చగల సాధనసంపత్తులు వున్నప్పుడు ఎవరూ అక్రమంగా నిలవ చేసుకోవలసిన అగత్యమేవుండదు. అసలు నిల్వచేసుకోవాలన్న బుద్ధిని తప్పించి సమాజసేవ మహోదాత్తమైనదన్న సంగతి మానవులు గుర్తించేటట్లు చేయవచ్చు. అదృష్టవశాత్తు నేడు భారతదేశంలో తెలివికీ, డబ్బుకూ బదులుగా నీతికీ, నిజాయతీకీ, సంఘసేవకే హెచ్చు గౌరవమున్నది.

నేడు ప్రపంచంలో రెండు బలీయమైన జాతులు రెండు రకాల ఉద్యమాలకు నాయకత్వం వహించివున్నవి. ఈ రెండు ఉద్యమాలు పరస్పరవిరుద్ధమైనవి. ఒకటి ప్రభుత్వ రంగమువంటిది. రెండవది ప్రైవేటురంగము వంటిది. ఈ రెండింటి మధ్య ఎటూ మొగ్గని వెనుకబడ్డ దేశాల సహకార

రంగము వున్నది. ఈ దేశాలు తమ పునర్నిర్మాణం విషయంలో చాలా శ్రద్ధ కలిగివున్నవి. ఇవి పై ఉద్యమాలకు నాయకత్వం వహించే రెండు దేశాలతో చేతులు కలిపి రెంటికి స్వాగత మిచ్చి మహత్తరమైన మానవసమిష్టి కుటుంబానికి ఆ రెండిటిని మార్గదర్శకులుగా చేయవలెనని చూస్తూ వున్నవి. అమెరికా ప్రజలు జీవకారుణ్యస్వభావముగలవారు. కష్టాలలో వున్న వారిని ఆదుకునే ధర్మబుద్ధిగలవారు. రష్యావారు లోకజ్ఞానము గలవారు. ఈ విధంగా ప్రైవేటురంగము, ప్రభుత్వరంగమూ కలిసి తమ మధ్య సమస్థితిని నిలబెట్టే సహకార రంగమును కలుపుకోవచ్చు. ఈ విధంగా భారతదేశంలో మనం లక్ష్యంగా పెట్టుకున్న సామ్యవాదపద్ధతి సమాజానికి విశాల ప్రపంచంలో ఒకస్థితి కలుగుతుంది. ఈ భూప్రపంచంపై సోషలిష్టు ద్వీపము నకు తావులేదు. యావత్ప్రపంచమే సోషలిష్టు సమాజమవు తుంది, లేదా ఈ ప్రపంచం తిరిగి రాతి యుగానికిపోతుంది.అంతే గాని మధ్యేమార్గం లేదు. ప్రైవేటురంగము, ప్రభుత్వరంగము ఒకదానికొకటి విరుద్ధమైనవి. వాటిమధ్య పోటీ పెరిగితే రెండూ ఒకదానినొకటి నాశనం గావించుకోవడం తప్ప మరేమీ లేదు.

మానవుని భవితవ్యం

భారతదేశంలో పెండ్లి అనేది కుటుంబంలో చాలా శుభ కార్యం. దీనికి సాంఘికంగా కొంత ప్రాముఖ్యంకూడా వుంది. ఒక ఉమ్మడి కుటుంబంలో పెండ్లి జరిగేటప్పుడు ఆ కుటుంబంలోని పెద్దలంతా, వారెక్కడవున్నా సరే ఒకచోటికి

చేరుకుంటారు. మాతృదేవి పెద్దగా వుండి ఆ శుభ కార్యాన్ని జరిపిస్తుంది. పెండ్లి వేడుకలలో జీవనమాధుర్యం వ్యక్తమవుతుంది. సంస్కారం మొదలు విందు భోజనాలవరకూ అన్నీ యథావిధిగా జరిగిపోతాయి. కుటుంబంలో ఒకరు విందులకూ, మరొకరు సలక్షణమైన కాండకూ, ఇంకొకరు గృహాలంకరణకూ, బట్టలకూ, వేరొకరు బాజాభజంత్రీలకూ, వినోదాలకూ ప్రాముఖ్యమివ్వవచ్చు. కాని రాజ్యపాలనవలెనే వివాహం కూడా ఒక సాంఘిక కార్యము. దీనికి కుటుంబంయొక్క ఉమ్మడి ప్రయత్నం కావాలి. సంబంధాన్ని నిశ్చయించడం, పెట్టుపోతలు, మర్యాదలు అన్నీ మొదట నలుగురూ చర్చించి నిర్ణయిస్తారు. పెండ్లి జరుగుతుంది. కుటుంబంలో ప్రతి ఒక్కరూ తాను కూడా దానికి కర్తలైనట్లు సంతృప్తి చెందుతారు. గ్రామంలోని తక్కిన కుటుంబాలు కూడా పెండ్లి వేడుకలలో పాల్గొంటాయి. కలవారూ, లేనివారూ తక్కువ కులంవారూ, ఎక్కువ కులంవారూ అనే భేదము లేకుండా అంతా వధూవరులను ఆశీర్వదిస్తారు.

ఉమ్మడి కుటుంబంలోని పెండ్లిప్రయత్నం వలెనే ప్రజాస్వామ్యంలో పరిపాలనా వ్యవహారాలు కూడా అందరి సమ్మతితో జరగాలి. కాని నేడు ఆచరణలో మనం చూస్తూ వున్న ప్రజాస్వామ్యం ఇందుకు భిన్నంగా వుంది. పార్టీలు ఎన్నికల యుద్ధంలో పాల్గొంటాయి. ఏ పద్ధతుల నవలంబించి అయినాసరే నూరు స్థానాలలో 51 స్థానాలు పెద్ద మెజారిటీతో సంపాదించగల్గిన పార్టీ పరిపాలనకు కర్త అవుతుంది. తన ప్రాంతంలోని సిరిసంపదలకు తానే యజమాని అవుతుంది.

మెజారిటీ వున్నంతకాలమూ పరిపాలన సాగిస్తుంది. పార్లమెంటు ఉభయ సభలలోనూ, రాష్ట్ర శాసన సభలలోనూ వివిధ పక్షాలవారూ వాగ్యుద్ధాలు సల్పుతారు. ఒకరినొకరు చిక్కులు పెట్టి ఆ తమాషా చూస్తారు. కాని మెజారిటీ ఉన్నంతవరకూ పాలకపక్షం వారు యే ప్రతిపాదన తెచ్చినా అది నెగ్గుతూనే వుంటుంది. పార్టీ ఆజ్ఞాపించిన ప్రకారం సభ్యులంతా ఓటు చేయవలసిందే. ప్రభుత్వ యంత్రాంగమంతా పాలకపక్షం వారి ఆజ్ఞలకు లోబడి వ్యవహరిస్తూ వుంటుంది. ఆమోదింపబడ్డ విధానాలు అమలు జరుపబడతాయి. అయితే ఏ పని చేయడానికైనా సాధన సంపత్తులను సమకూర్చేది ప్రజలే. కాని అంతా తానే చేసినట్లుగా పాలక పక్షం చెప్పుకోవడం కద్దు. ప్రతిపక్షంవారు పాలక పక్షాన్ని వీలైన చోటల్లా విమర్శిస్తూ వుంటారు. పాలక పక్షం లోపాలను పెద్దవిగా చేసి చెప్పి వారు సాధించిన పనులను గూర్చి తక్కువగా చెపుతూ వుంటారు. ఒక్కొక్కప్పుడు పాలక పక్షంవారు చేసే పనులకు అడ్డు కూడా తగులుతూ వుంటారు.

ఎన్నికలకు ముందు అన్ని రాజకీయ పక్షాలవారూ వారి వారి ఎన్నికల ప్రణాళికలను ప్రకటిస్తారు. వాటిలో తమ లక్ష్యం ప్రజాసేవయేననీ, ప్రజల శ్రేయస్సును తాము కోరుతామనీ ఉద్ఘాటిస్తారు. అంతా మానవ స్వాతంత్ర్యాన్ని ప్రబోధిస్తారు. చివరకు కమ్యూనిష్టు సిద్ధాంతం లక్ష్యంకూడా ప్రభుత్వం ప్రభావం క్రమేణా క్షీణించి పోవడంతో మానవునికి పూర్తి స్వాతంత్ర్యం లభించడమేనని చెప్పబడుతున్నది. అన్ని

మార్గాలూ ఆ లక్ష్యాన్ని చేరేవే అయినప్పుడు గమ్యస్థానాన్ని గూర్చి తగాదాలు పడటమెందుకు? ఆ మార్గం తమదేనని వివాదపడటం దేనికి? ఎందుకంటే ప్రజల స్వయంపరిపాలనా విధానంగా ప్రజాస్వామ్యం ఇంకనూ అవతరించవలసి వున్నది. ఇప్పుడు మనం చెప్పుకునే ప్రజాస్వామ్యం అవతరించనున్న మూల సిద్ధాంతానికి కేవలం ఛాయ మాత్రమే. ప్రపంచం ఇంతవరకూ దండములతో, పందాలతో పరిపాలింపబడుతూ వచ్చింది. ప్రజాస్వామ్యంలో పాలక పక్షంగాని వంశపారం పర్యంగా వచ్చే రాజరికంగాని, నియంతగాని, లేదా ఎడారిలో ఒక తెగ నాయకుడుగాని అంతా దండం చూపి బెదురుపెట్టి ప్రజలను లోబరచుకొని పెత్తనం చెలాయించేవారే. ఇక దేవుని పేరిట ప్రజలపై పాలన జరిగినప్పుడు పందాలు పెత్తందార్లు. ఒక్కొక్కప్పుడు అటు దెబ్బలకూ, ఇటు పెత్తందార్లకూ ప్రజ లోబడుతూవుంటుంది. అందుచేతనే ఇంతవరకు అనుసరింప బడ్డ యే విధానంవల్లనైనా మానవుడికి నిజంగా స్వయం పరిపాలనావకాశం లభించలేదనే చెప్పాలి.

వెనుక నేను చెప్పినట్లుగా ప్రజాస్వామ్యమంటే ఆలోచనలను, ఆచరణలను వికేంద్రీకరించడమన్నమాట. సంఘంలోని ప్రతి వ్యక్తి ఫలితములను అనుభవించడన్నమాట. ఆ ఫలితములు మంచిగా వున్నా సరే, చెడుగావున్నా సరే. అరాజకమునకు బదులు ఒక క్రమమైన పద్ధతి మనకు కావాలంటే అది ఒక సమష్టితి గల విధానంలోనే మన ఆలో

చనలు, ఆచరణలు వికేంద్రీకరింప బడుతాయి. అట్టి విధానంలో ప్రతి అంశమూ నిర్దిష్టమైన రీతిలో వుండాలి. దాన్ని ప్రజలు అవగాహన చేసుకొని గౌరవించ గలగాలి. దిగువన కుటుంబం మొదలుకొని ఎగువన ప్రపంచ సమాజము వరకు ప్రజా స్వామ్య మేర్పడటమంటే మూడు రంగములలో ఆచరణ జరగవలసి వుంటుంది: (1) పరిపాలనా రంగము, (2) ప్రాతినిధ్య రంగము, (3) ఆర్థిక రంగము. పరిపాలనా రంగంలో కార్య నిర్వహణ కొరకు సమాజంచేత నియమింపబడ్డ వ్యక్తులలో పరిపాలనా సామర్థ్యం అత్యున్నత స్థాయికి చెందినదై వుండాలి. సమాజం పెరుగుతూ వున్నప్పుడు ప్రభుత్వోద్యోగుల కార్య దక్షత కూడా పెరగాలి. ఆలోచించడంలో, ఆచరించడంలో, ఫలితాలను అనుభవించడంలో బలవంతులకు, బలహీనులకు స్వేచ్ఛాసమానత్వములు ఒకే రీతిగా వుండవలెనంటే ప్రతినిధులైన సమాజనాయకులలో సహనము, అవగాహన, వివేకము చాలా వుండాలి. అయితే నాయకులకు మాత్రం జీవనాధారం వుండనద్దా? వెనక ఏదైనా ఆదరువు లేకపోతే నాయకులుగా ఎలా సేవ చేయగలుగుతారు? కనుక ఆర్థిక వ్యవస్థను వికేంద్రీకరించవలసిన అగత్య మున్నది. లేకపోతే నాయకులకు మరేదైనా ఆకర్షణ లభించి అటుకేసి వెళ్ళిపోతారు. వారిస్థానంలోనాయకమ్మన్యులు తయారవుతారు. వారి సేవలు ఉచితంగా లభిస్తున్నట్లు పైకి కన్పించినా ఇతరత్రా ప్రజానీకం ప్రత్యక్షంగానో, లేక పరోక్షంగానో వారికి

హెచ్చు మూల్యం చెల్లించవలసిన స్థితి వస్తుంది. ప్రజా స్వామ్యం మనవలె నంటే అది వికేంద్రీకృత సమాజ ఆచరణపై ఆధారపడి వుండాలి. దానికి వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థ ఊతగా వుండాలి. ఆ ఆర్థిక వ్యవస్థ పునాది నుంచి అంచెలుగా చక్కగా నిర్మితమైనట్టిదై వుండాలి.

ప్రపంచంలో యే ప్రాంతానికి చెందిన ప్రజలైనప్పటికిని వారు యుగ యుగాలుగా బాహ్యంగా, ఆంతరముగా తీరని కోరికలతో జీవయాత్ర వెళ్ళబుచ్చుతూ వచ్చేవారే. ఇది బలవంతులకూ, బలహీనులకూ సమంగా వర్తిస్తుంది. ఎందుచేతనంటే అన్యాయము, అక్రమము అధికంగా వున్న ఈ ప్రపంచంలో బలవంతులైనవారు మదపుటేనుగుల వలె వ్యవహరిస్తూ వచ్చారు. బలహీనులు భయం వల్లనో, లేక వెలుపలి వత్తిడుల వల్లనో దూరంగా వుంటూ వచ్చారు. ఈ సంకెళ్ళు పోయినప్పుడు, మానవునిలోని పులి, మేక దేశ సంపదలలో సమాన భాగస్వాములైనప్పుడు మొదట సంక్షోభము, సంఘర్షణ తప్పవు. పాలకుండలో కవ్వము పెట్టి చిలకడంతోటే నురుగు పైకి తేలుతుంది. చిలికేవారు జాగ్రత్తగా వుంటే పైకి వచ్చిన తెప్పను వచ్చింది వచ్చినట్లుగానే తీసివేయువచ్చు. క్రమేణా నురుగు పోతుంది. చివరకు వెన్న లభ్యమవుతుంది. ప్రజాస్వామ్యంలో పంచాయతీ రాజ్యం, సహకార సమాజం, ప్రజావిద్య అనేవి మొదట నిలువ నీరువలె వున్న

నేటి మన సమాజంలో కొంత కదలికను, కలకలమును తెచ్చి పెట్టేమాట నిజమే. మొదట నురుగు తేలుతుంది. స్వాతంత్ర్యోద్యమంలో కాకలు తీరిన మన నాయకులు నేటికీ సజీవులై వుండి వుత్సాహంతో పనిచేస్తున్నారు. వారు జాగ్రత్తతో మెలగితే నురుగు తెప్పలను సులభంగా తొలగించ గలుగుతారు. అప్పుడు పై భాగమంతా తేటపడుతుంది. ఆ పిమ్మట వారి శ్రమ ఫలితంగా వెన్న లభిస్తుంది. మన ప్రజావాణి నేడు దుర్బలంగా వున్నప్పటికిని ప్రజలు మాత్రం సజీవులై వున్నారు.

పిల్లలు తాము పక్షులవలె ఎగురవలెననీ, ఒక నక్షత్రం నుంచి మరొక నక్షత్రానికి పోవాలనీ చిత్రవిచిత్రముగా ఊహిస్తూ వుంటారు. వారి కలలు ఈ శతాబ్దిలోనే నిజం కానచ్చు. అయితే అందుకు మానవుడు అందాకా బ్రతికి వుండాలి కదా. ఒకప్పుడు గుహలలో నివసించినమానవుడు ఇప్పుడు విశ్వాంతరాళంలోకి పోబోతున్నాడు. మానవుడు పుట్టినప్పుడు, అతడు ఈ నాడు ఎట్లా వున్నాడో, రేపు ఎట్లా వుంటాడో ఆ స్వరూపం గర్భమందలి పిండములోనే వుండేది. అతడు తన పరిసరాలను అవగాహన చేసుకొని వాటితో రాజీ పడవలసివచ్చింది. మానవుడు పశుదశలో వున్నప్పుడు తన కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించాడు. ఆరంభదశలో అడ్డంకుల నన్నిటినీ అతడు అధిగమించిన తరువాత ఒక విశేషం జరిగింది.

అతనిలోని తర్కబుద్ధి, వివేకము అతనిని బయల్పరచాయి సమాజంలో బలవంతులైనవారు బలహీనులను తమ బానిసలుగా చేసుకున్నారు. కాని ప్రకృతిలో బానిసలకు తావులేదు స్వేచ్ఛవుంటేనే ప్రకృతి ప్రవర్ధమానం కాగలుగుతుంది బానిసలకు యజమానులైనవారు వలలో చిక్కుకున్నా వారే గొప్ప బానిసలయ్యారు. మానవుడు తనకు తా భయంకరంగా తయారయ్యాడు. ఈనాడు మానవుడు అడ మృగాలను చూచి, పిడుగులను తలచుకొని భయపడుటలేదు అతడు తనలోని పిశాచానికే భయపడ వలసినవాడయ్యాడు. మానవుని అగ్రగణ్యత్వమునకే ఈనాడు ముప్పు వచ్చింది. దేవుడనేవాడు వుంటే ఆయన తాను సృష్టించిన మానవునిలో తన అంశము వుందో లేదో తెలుసుకోవలసి వున్నది. మానవుడు పైన వినీలాకాశము, క్రింద వినీలజలము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, నక్షత్రవీధి, వృక్షజాలము, జంతుజాలము మున్నగు సమస్తమూ అయినట్లైతే వీటన్నిటికీ కొంత అర్థం వుంది. కానట్లయితే అంతా మాయ అన్నమాట.

ప్రేమభావంలో మానవుడు జన్మించాడు. అనగా అతని పుట్టుక, ఉనికి అంతా ప్రేమమయం. అతడు జీవించడం కూడా ప్రేమతో జీవించి, ప్రేమలో అధికుడు కావాలి. మానవుడు ప్రేమ ప్రపూర్ణుడై వుంటే సమాజం కూడా ప్రేమభరితమై వుంటుంది. మానవునిలో ప్రేమ మృగ్యమైనప్పుడు సమాజం

్రశించి కాలగర్భంలో కలిసిపోతుంది. మానవుని భవితవ్యం
ంగతి పట్టించుకోకుండా అతని విశ్వాంతరాళ ప్రయాణం
ార్చి ప్రయత్నాలుచేయడం అర్థరహితమైన పని అవుతుంది.
క ఎల్లకాలాలలోనూ ప్రధానమైనది మానవుని శ్రేయస్సు
మనం గుర్తుంచుకోవాలి.

ంపు

సూర్యుడు అస్తమిస్తున్నాడు. గాలి రొద పెడుతూ వుంది.
గంగానది ఎప్పటి వలెనే ప్రశాంతంగా ప్రవహిస్తూ
వుంది. పొగ మబ్బులవల్ల కొండలు కనపడకుండా అవు
తున్నాయి. నీడలు అలముకుంటున్నాయి. సంధ్యావేళ అవత
రిస్తూ వుంది.

భారతదేశ నదులలో అన్నిటికన్న బహుశా గంగ ప్రాచీనమైనది. మహోన్నతమైన పర్వత శిఖరాలు వాటి మంచుతో గంగానదికి శాశ్వతంగా నీరు అందజేస్తూ వున్నవి. గంగమ్మ తల్లి యుగ యుగాలుగా ప్రవహిస్తూ వుంది. ఆమెకు విశ్రాంతి అన్నదే లేదు. విశ్రాంతిని ఆమె కోరదు. ఎంతో వేదనతో నేను ఇక్కడికి వచ్చాను. ఇప్పుడు వేదన తొలగి పోయింది. నేను పెంచగోరిన బిడ్డను గంగమ్మ తల్లి కన్నది. నా మనసులో, పరిసరాలలో శాంతి తప్ప మరేమీ లేదు.

జనన మరణములు, సృష్టి ప్రళయములు జగన్నాటకంలో మాయలని జగజ్జననికి తెలుసు. ఉన్నది ఉంది, లేనిది

లేదు. జగత్తు సూత్రాలను యేదీ మార్చదు; మార్చజాలదు. జీవితం యథావిధిగా గడిచిపోతూనే వుంటుంది. మానవుడు రాగబద్ధుడై ప్రకృతితో ఐక్యము చెంది వున్నంత వరకూ అతనికి సిరిసంపదలు అపారంగా లభ్యమవుతాయి. అలా వుండకపోయ్యాడా, ఆ వడ్లతో పాటు ఆ తట్టకూడా ఎండ వలసిందే!

ప్రపంచం చీకటి ముసుగులో వుంది. చీకటి మరింత దట్టమవుతున్నది. కాని వెలుతురు చూడదలచుకున్న నేత్రాలకు వెలుతురు తప్పకుండా కన్పిస్తుంది. చుట్టూ వెలుతురే వుంటుంది. ఈ ప్రపంచంలో మానవులు పుట్టుతూ వుంటారు, గిట్టుతూ వుంటారు. గిట్టినవారు వట్టి చేతులతో ఈ ప్రపంచం నుంచి నిష్క్రమిస్తారు. కాని సజీవుడైన మానవుడికి చేతినిండా పనివుంటుంది. రెండు చేతులా ఆర్జించవచ్చు. నాలుగుదార్లు కలిసే కూడలిలో మానవుడు సాటిమానవుని కలుసుకొని పురోగమించాలి.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA113B111 |
| --- | --- |
| పుస్తకం పేరు | పంచాయతీ రాజ్యం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 253 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4,12,248 18 128,130,16 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |